# చతుర

రూ. 7/-

సెప్టెంబర్ 1999



## మాట్లాడే బొమ్మలు

-కాలువ మల్లయ్య

# చతురప్రపంచం

## కళ్లులేనివారికి చూసి చెప్పే పరికరం

క్రీ.శ. 1829లో గుడ్డివాళ్ళకోసం ప్రత్యేకంగా ఓ లిపిని కనుక్కున్నాడు బ్రెయిలీ. పేజీమీద గతుకులుగా వుండే చుక్కలు, గీతల సముదాయాన్ని వేలితో తాకుతూ అంధులు ఆ భాషని స్పర్శద్వారా గ్రహించగలగడమే బ్రెయిలీ భాష. తన ఆరో ఏట గుడ్డివాడైన బ్రెయిలీ ఈ భాషద్వారా ప్రపంచంలోని కోట్లాది మంది గుడ్డివాళ్ళు చదువుకునేలా చేశాడు. రీడర్స్ డైజెస్ట్ పత్రిక బ్రెయిలీ భాషలో కూడా వెలువడుతుంది.




నేడు అమెరికాలో కంప్యూటర్ టెక్నాలజీ అభివృద్ధి చెందుతున్న తరుణంలో ఓ శాస్త్రజ్ఞుడు అంధులకోసం ఓ కొత్త పరికరాన్ని కనుగొన్నాడు. కంప్యూటర్ని స్టైప్‌చేస్తే స్క్రీన్‌పై కనపడే పదాలని సింథసైజర్ వాయిస్ పలికే విధానం కనుగొన్న నేపథ్యంలో డాక్టర్ విల్సన్ నార్మన్ ఈ పరికరాన్ని కనుగొన్నాడు.

గుడ్డివాళ్ళు తమ చొక్కాకి కంప్యూటర్ చిప్‌గల ఓ పరికరాన్ని తగిలించుకుంటారు. వాళ్ళ చేతుల్లో ఓ కర్ర వుంటుంది. ఆ కర్రకి ఈ పరికరానికి వైరుతో ఓ కనెక్షన్ వుంటుంది. గుడ్డివాళ్ళు ఆ కర్రని తాటిస్తూ నడుస్తుంటే దారిలో గోతులు, నీళ్ళు, రాళ్ళు లాంటివి అడ్డంవస్తే ఆ కర్ర దాన్ని గ్రహించి ఆ పరికరానికి ఆ విషయాన్ని అందిస్తుంది. ఆ పరికరంలోని సింథసైజర్ వాయిస్ ఆ సంగతి వారికి వివరిస్తుంది.

ఆ కర్రనుంచి వెలువడే రాడార్ తరంగాలు పదిహేను అడుగుల మేరకి ప్రసారమై దారిలోని అడ్డుని తాకి వెనక్కి రావడంతో ఆ కర్రనుంచి ఆ ప్రతిబింబ తరంగాలని ఆ పరికరం గ్రహించి బిగ్గరగా ఆ వివరాలు తెలియజేస్తుంది.

ఇంతే కాకుండా ముందే వివిధ ప్రదేశాల్లో అమర్చిన మరో పరికరంనుంచి సదా తరంగాలు వెలువడుతూ వుంటాయి. ఈ పరికరం వాటిని గ్రహించి ఆ తరంగాలని వెలువరించే పరికరంలో రికార్డుచేసిన వాయిస్‌ద్వారా ముందే తెలియజేస్తుంది. రైల్వే స్టేషన్స్, బ్యాంక్స్, సూపర్ మార్కెట్స్ లాంటి భవనాల ప్రవేశద్వారం దగ్గర ఆ తరంగాలని వెలువరించే ఆ ఎలక్ట్రానిక్ పరికరం ఉంచడంద్వారా ఇది సాధ్యమౌతుంది.

కవర్ ఫొటో: వి. సత్యమూర్తి

ఉదాహరణకి ఓ బ్యాంక్ బిల్డింగ్ దగ్గరకి గుడ్డివాళ్ళు రాగానే వాళ్ళ చొక్కాకున్న పరికరం బ్యాంక్ బయట అమర్చిన పరికరం వెలువరించే తరంగాలను గ్రహించి 'ఫస్ట్ నేషనల్ సిటీ బ్యాంక్ పదిహేను అడుగుల దూరంలో వుంది' అని చెబుతుంది. ఈ పరికరాలు అమెరికన్ మార్కెట్‌లో ఇప్పుడు లభ్యమవుతున్నాయి.

## 80ఏళ్లఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్

సినిమా పరిశ్రమలోని రకరకాల విభాగాలలో పనిచేసేవారికి ముందుగా శిక్షణ ఇచ్చేందుకు ప్రపంచంలో ఎన్నో ప్రఖ్యాత పాఠశాలలు ఉన్నాయి. అలాంటి వాటిలో మొట్టమొదటి ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ 1919 సెప్టెంబర్ 1న మాస్కోలో స్థాపించబడింది. సినిమా పరిశ్రమ ఆరంభదశలో వుండగానే నెలకొల్పబడ్డ ఆ పాఠశాల పేరు 'మాస్కో ఆల్ యూనియన్ స్టేట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సినిమాటోగ్రఫీ'

పాశ్చాత్య దేశాల్లోని ఈ రకం శిక్షణ కేంద్రాలకి ఇదే మార్గదర్శి.

మాస్కో ఆర్ట్ థియేటర్‌లో నాలుగు గదులలో 25 మంది విద్యార్థులతో మొదలైన ఆ ఇన్‌స్టిట్యూట్ అభివృద్ధి చెంది ఇప్పుడు సంవత్సరానికి 1500 మంది విద్యార్థులకి శిక్షణ ఇచ్చే స్థాయికి చేరింది. విద్యార్థులందరికీ నెలనెలా స్టైఫండ్ కూడా ఇవ్వబడుతోంది. ఆ ఇన్‌స్టిట్యూట్‌లో ఫిల్మ్ స్టూడియో, లేబరేటరీ, చిత్ర నిర్మాణానికి కావలసిన ఇతర ఆధునిక హంగులన్నీ వున్నాయి. విద్యార్థుల శిక్షణలో భాగంగా అక్కడ నిర్మించే చిత్రాల్లో చాలా వరకు అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలలో ప్రదర్శించబడుతున్నాయి.

ప్రతి విభాగానికి 'మాస్టర్' అనే ప్రధానోపాధ్యాయుడు వుంటాడు. అతను చిత్ర పరిశ్రమలోని ప్రముఖ వ్యక్తి అయి వుంటాడు. ప్రవేశ పరీక్షలు కఠినంగా ఉంటాయి. నటీనటులకి మూడు అడ్మిషన్ టెస్ట్‌లుంటాయి. దర్శకశాఖ లాంటి ముఖ్యమైన శాఖలలో చేరదల్చుకున్న వారు చిత్రాలకి పనికివచ్చే కథలని రాసి ముందుగా ఇవ్వాలి. ఆ కథలు వారి సొంతమై వుండాలి. ఒక్కో గ్రూప్‌లో పదినుంచి పదిహేనుమంది విద్యార్థుల కంటే ఎక్కువ వుండరు.

సోవియట్ రష్యా ముక్కలైనా ఇప్పటికీ ఆయాదేశాలనుంచి ఔత్సాహికులు దీనిలో చేరుతున్నారు.

రష్యాలో చాలా భాషలున్నాయి. కాబట్టి అన్నిభాషలకి కావలసిన నటీనటులకి అక్కడే శిక్షణ ఇవ్వబడుతుంది. కొంతమంది మొదటిసారే ప్రవేశ పరీక్షల్లో ఉత్తీర్ణులైతే కొందరు నాలుగోసారి కాని కృతార్థులవరు. ఆ ఇన్‌స్టిట్యూట్‌లో కేవలం రష్యన్స్‌కే కాక, విదేశీయులకి కూడా శిక్షణ ఇస్తారు. 1981లో



జరిగిన మాస్కో ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివ లికి వివిధ దేశాలనుంచి వచ్చిన దర్శకులలో చాలామంది మాస్కోలో శిక్షణ పొందినవారే. ఇప్పటివరకూ 50 దేశాలకి చెందినవారు అక్కడ శిక్షణ పొందారు.

---

## పెద్దవారి పెద్దమనసులు

డబ్బుండడం ఓ ఎత్తు, దాన్ని కొంతైనా తన సేవకులతో పంచుకోవడం ఓ ఎత్తు. ఇందుకు పెద్ద మనసుండాలి. హాలీవుడ్ స్టార్స్‌లో ఎంతోమందిది ఈ విషయంలో పెద్దమనసే.

★ఎలిజబెత్ టేలర్ తన హెయిర్ డ్రస్సర్ జోస్ ఎలుర్ కారులో పెట్రోల్ కొట్టించుకునే బంక్‌లో 1000 డాలర్లు ఇచ్చి, అది ఖర్చయ్యేదాకా ఆమె దగ్గర డబ్బు తీసుకోవద్దని చెప్పింది.

★బార్బరా స్ట్రైసేండ్ తన జుట్టుకి రంగులేసే హేరిస్‌కి టిఫాని (సూపర్ బజార్)లో డిపాజిట్ చేసిన 2500 డాలర్ల రసీదిచ్చి ఆ మేరకు ఇష్టం వచ్చింది కొనుక్కోమంది.

★'పల్ప్ ఫిక్షన్' దర్శకుడు క్వెంటిన్ టారన్‌టినో తన పారితోషికంలోంచి యూనిట్‌లోని అందరికీ ఓ జత సాక్స్ కొనిచ్చాడు.

★సీన్‌కానరీ తను పనిచేసే ప్రతి సినిమా యూనిట్లోని సభ్యులకి 'కేష్ బోనస్ కవర్లు' ఇస్తుంటాడు. వాటి మొత్తం విలువ పదివేల డాలర్లదాకా ఉంటుందిట!

★కమెడియన్ డేనీ డివిటో తన వంటవాడి కుటుంబానికి 5000 డాలర్లు ఖరీదుచేసే స్వెట్టర్లు బహూకరించాడు.

★మడోన్నా తన పర్సనల్ అసిస్టెంట్ మెలిస్సాకి ఓ పెద్ద బబుల్‌గమ్ పెట్టినిచ్చింది. అందులో వాటితోపాటు కార్టియత్ వాచి కూడా వుంది.

★ప్రముఖ దర్శకుడు ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ తన హిచ్‌కాక్ మేగజైన్‌లో వరసగా 5 కథలు రాసిన రచయితలందరిని (మొత్తం 16 మంది) 'తను ఖర్చులన్నీ భరించే' పేకేజ్ కింద డిస్నీలేండ్‌కి పంపించాడు.

★రోగర్‌మూర్ తన డూప్‌ని, హవాయ్ దీవుల్లో తనకున్న మేన్షన్‌కి పంపించి, వారంరోజులు ఉచితంగా అక్కడ తనలా గడిపే అవకాశాన్నిచ్చాడు.

★జాన్ ట్రవోల్టా తన గార్డెనర్‌కి స్పోర్ట్స్ కారొకటి కొనిచ్చాడు.

★సోఫియాలారెన్ తన కారు డ్రైవర్ లైఫ్ ఇన్సూరెన్స్ ఏన్యువల్ ప్రీమియంలు తను కడుతూంటుంది.

అయితే వీటిల్లో ఏవీ పబ్లిసిటీకి ఇచ్చిన బహుమతులు కాకపోవడంతో ప్రెస్‌లో ఈ అంశాలు చోటుచేసుకోలేదు. నిజమయిన దాతృత్వానికి ఇవి ప్రతీకలు.



# 'జీవనఖేల'పై సమీక్షలు

**జూలై 'చతుర'లో ప్రచురితమైన ఐ. కవిత నవల 'జీవనఖేల'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.**

## దయనీయ గాధ

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

కథలు, సినిమాలు, నవలలు వాస్తవానికి దగ్గరగా ఎలా వుంటాయి అంటే ఏం చెప్పలేం కాని, వీటి నుంచి ప్రేరణ పొందేవారు, అందులోని పాత్రలను ఆదర్శంగా తీసుకొని ఆ మార్గంలో నడవాలని అనుకొనేవారు ఎంతో కొంతమంది ఉండే అవకాశం ఉన్నప్పుడు మనం రాసేది కొంతైనా వాస్తవానికి దగ్గరగా ఉండితీరాలి.

'జీవనఖేల' నవలలో కథానాయిక, కథానాయకుడు రెండు పాత్రలూ కూడా ఎవరికీ మార్గదర్శకంగా లేరు. ముఖ్యంగా కథానాయిక తను చేబట్టిన వృత్తిని సమర్థించుకొనేందుకు ఎంతో ప్రయత్నిస్తుంది. ఆమెకి వేశ్యావృత్తిమీద మనసులో ఎక్కడో ఓ మూల ఆసక్తి, సమర్థింపు ఉన్నాయి గనుకనే ఆమె ప్రతి చిన్న సంఘటననీ తను ఆ వృత్తిని స్వీకరించటానికి కారణంగా సమర్థించుకొంటోంది. వేశ్యావృత్తి ఎంతో భయంకరమైంది. "మనం ఆ స్థితిలో వుంటే" అని ఆలోచించటానికి కూడా మనసు ఒప్పనంత దయనీయమైన వృత్తి అది. కాని ఆమె అందులో దిగకుండా ఉండటానికి చేయవలసినంత ప్రయత్నం చేయలేదు. సినిమాలలో వేషం కోసం ప్రయత్నించేటప్పుడు కాని, ఇతర చిన్న ఉద్యోగాలలో దెబ్బ తిన్నప్పుడుకాని ఆమె వెంటనే ఈ వైపుకు మొగ్గుతోంది. ఆమె తల్లిదండ్రుల గురించి ఇచ్చిన వివరణ కూడా సమర్థనీయంగా లేదు. ఆమెకున్నపాటి విద్యార్హత లేకుండా, సరైన దారిలో ధైర్యంగా స్థిరపడిన వాళ్లున్నారు. కథానాయకుడు ఆమెకి రుణపడి వుండటానికి చూపిన కారణం, కృతజ్ఞత చూపిన తీరు మనసుకు పట్టేలా లేవు.

నవల మొత్తంలో నచ్చిన అంశం... కొన్నేళ్ళ సంపాదన తరువాత ఆమె ఆ వృత్తి నుంచి స్వచ్ఛందంగా విరమించడం. సినిమా తారల గురించి నేనెప్పుడూ అనుకునేదాన్ని. "భర్తకి, బిడ్డలకి పరిమితమవ్వాల్సిన ఈ తారలు ఎందుకు ఇంత సిగ్గువిడిచి ఇలాంటి పాత్రలలో నటిస్తారు? పరిస్థితుల ప్రభావం వల్ల అనుకున్నా, ఆర్థికంగా స్థిరపడిన తరువాతనైనా మానెయ్యవచ్చుకదా? " అని. ఈ నవలలో నాయికను ఆ కోణంనుండి చూస్తే ప్రశంసించవలసిందే. చిత్ర తల్లిదండ్రులలాంటివాళ్ళు అసలంటూ వుంటే ఈ నవల చదివి మారితే మంచిది.

మొత్తానికి ఐ. కవితగారి రచన మంచి శైలితో, సామెతల వర్షంతో సాగిపోయింది. కాని కాస్త వాస్తవానికి దగ్గరగా, 'చెడు'ని సమర్థించేది కాకుండా ఉంటే ఇంకా బాగుండేది.

—యస్. ఉష, మచిలీపట్నం.

## చితిమంటలు

(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)

సభ్య సమాజం తలవంచుకొనే రీతిలో

రంగుల హరివిల్లయిన సినీపరిశ్రమలో జరిగే మోసాలను 'జీవనఖేల'యందు రచయిత్రి ఐ కవిత చక్కగా చెప్పారు. వేశ్యా జీవితాలను గురించి సహజంగా చిత్రించారు. ఈ సమాజంలో తోడులేని స్త్రీ ఎంతగా వంచింపబడుతుందో, వారి కడగండ్ల కన్నీటి గాథలు మన కళ్లముందు ఆవిష్కరించారు. సినిమాలలో చేరాలనే మోజుతో యువతరం అథో లోకానికి ఎలా చేరుకొంటుందో చూస్తే బాధేస్తుంది. అలాగే 'ఇచ్చేది ఈతకాయ, లాగేది తాటికాయ', 'ఊరుకున్నంత ఉత్తమమూ లేదు బోడిగుండంత సుఖమూ లేదు' అంటూ తెలుగు నుడికారాలను చక్కగా ప్రయోగించారు.

కానీ ఈ నవలలో ఎన్నో లోపాలున్నాయి. 'ఒక కుక్క, ఒక పంది, ఒక ఎలుగుబంటి... మూడు మృగాలు తన కన్యత్వం దోచుకొన్నాయి' అంటుంది. అంటే కన్యత్వం మూడుసార్లుంటుందా? ఈ నవలలో కీలకమయిన మలుపు కథానాయిక మద్రాస్ వెళ్ళడం. ఆ సన్నివేశాన్ని ఏ పాఠకుడు నమ్మలేనివిధంగా తల్లిదండ్రులే పంపేసినట్లు రాశారు. పంథొమ్మిదేళ్ళ వయసు వచ్చేంతవరకూ 'కొజ్జా'లను చూడకపోవడం..., చిత్రం! కథానాయిక చేత తన తల్లిదండ్రుల గురించి 'నాకు చదువు చెప్పించే పని అసలే చేపట్టుకోరు' అని చెప్పించింది. అయితే ఆమె చివరకు ఎలా చదివింది? ఒక్క రాత్రిలోనే ముఖంమీద శోభి ఎలా వస్తుంది? వచ్చినా అది మనుషులు భయపడేంత భయంకరంగా తీవ్రస్థాయిలో ఉంటుందా? ఆ వ్యాధి కోసం వారంవారం డాక్టర్ దగ్గరకు పోయే అవసరంలేదు. ఎందుకంటే చర్మవ్యాధులకు నెలల పర్యంతం మందులు వాడాలి! వేణుమాధవ్ విషయంలో అతడ్ని తెలుగువారు మచ్చల కారణంగా ఆదరించలేదనీ, మద్రాసులో ఆదరించారని రాయడం ఒకరకంగా తెలుగువాళ్ళ కళాహృదయాన్ని కించబరచడం కాదా? ఈ నవల ఆసాంతం ఒకరికొకరు కథలు చెప్పుకోవడంతోటే సాగుతుంది.

వీటన్నిటికన్నా క్షమించరానిది.

ఇందులో ఒకచోట 'పోనీ కాయకష్టం చేసుకుబతుకుదామన్నా వచ్చేది అంతంత మాత్రమే' అంటుంది. అభివృద్ధి చెందుతూ ఉన్న ఈ దేశంలో ఎంతమంది స్త్రీలు కూలీలకు వెళ్ళి బతకడంలేదు? మాణిక్యమ్మచేత పెళ్ళనేది అత్యాశని, మగాళ్ళు పెళ్ళి చేసుకొనేది ఆడాళ్ళచేత వ్యభిచారం చేయించడానికేనని, బతకాలంటే వ్యభిచారం తప్ప మరో మార్గంలేదని' చెప్పించింది. ఇదంతా మన వివాహ సాంప్రదాయానికి విఘాతం కలిగించేది కాదా? మరోచోట... "నువ్వేమీ తక్కువ సంపాదించలేదమ్మా. వృత్తి చేస్తున్నది నాలుగయిదేళ్ళనుంచే అయినా ఈ ఇల్లు కొన్నాం, బ్యాంకులో అయిదులక్షలున్నాయి. వడ్డీలో స్తాయి. ఇంట్లో ఉన్న బంగారం నీకు తెలుసు. బీరువాలో పట్టుచీరలు, కొంచెం వెండిసామాను"

దీన్ని చదివితే పేదరికంలో ఉన్న అందమయిన అమ్మాయిలు ఏమనుకొంటారు? తాము సుఖాలనుభవించాలంటే అందుకు వేశ్యావృత్తి ఎంతో సుగమమయిందని అనుకోరా? 'చతుర' సామాన్య పాఠకులకు అందుబాటులో ఉన్నటువంటి దీన్ని ఎక్కువమంది చదివేది పేదవాళ్లే. అందుకే ఒకరిద్దరయినా వేశ్యావృత్తివేపు మొగ్గుచూపే అవకాశం లేదా?

రచయిత్రి వేశ్యా జీవితాల్లోని చితిమంటలను తగ్గించాలని రాసిందో, లేదూ 'చితిమంటల్లాంటి' వేశ్యావృత్తిలోకి పేదమ్మాయిలను వెళ్ళమని రాసిందో, ఇంతకూ రచయిత్రి ఉద్దేశమేంటో?

—సుంకోజి దేవేంద్రాచారి,
తిరుపతి-517 501

## ఆంటీ కల్చర్

(మూడవ బహుమతి రు: 50/– పొందిన సమీక్ష)

'జీవనఖేల'లో పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఓ

యువతి వ్యభిచారిగా ఎలా మారిందో హృద్యంగా రాశారు రచయిత్రి.

జన్మతః ఎవరూ వ్యభిచారిణులుకారు. మదమెక్కి కూడా ఎవ్వరూ ఆ వృత్తి స్వీకరించరు అనే రచయిత్రి వాదన పాఠకుణ్ణి ఆకట్టుకుంటుంది. నవలలో లలిత హీనస్థాయికి కూడ తల్లిదండ్రుల తృణీకారభావం, పురుషాహంకార దౌష్ట్యం, దారిద్ర్యం ఇవేకారణాలుగా చూపించారు.

ఇప్పుడు ప్రభుత్వం కూడా "సెక్స్‌వర్కర్స్" అంటూ వాళ్లకో స్థాయి కల్పించినా, అది నేటికీ సాంఘిక సమస్యలా వుంది. వ్యభిచార వృత్తి అనే చెత్త బుట్టపై మొలిచిన వివిధ సమస్యలూ, రికార్డింగ్ డ్యాన్సులూ, ఎయిడ్స్, సుఖరోగాలూ వంటివి చక్కగా చర్చించారు.

ఓ యువతికి వెండితెరపై ప్రవేశం ఎంత కష్టమో ఈ నవలలో బాగా రాశారు. ఎక్స్ట్రాల దయనీయ జీవితం పాఠకుణ్ణి కన్నీటిలో ముంచింది.

విలక్షణ కథావస్తువుతో, వినూత్న కథనంతో కథను నడిపించినా అక్కడక్కడా దొర్లిన తప్పులు విజ్ఞులకు నవ్వు పుట్టిస్తాయి. శీలం కోల్పోయిన ఆడది పతిత అంటూ పెళ్ళికి పనికి రానిదని భావించటం ఈ ఆధునిక యుగంలో జరుగుతుందా? తన ప్రతిఘటన ఏమీ లేకుండా ముగ్గురు పశువులు తనను రేప్ చేశారని లలిత భావించటం... మచ్చుకు ఒకటి!

విరహభారంతో వేగిపోయే 'వేణు'కి శృంగారదానం చేయటం... ఆమె ఎవరో చివరిదాకా 'సస్పెన్సు'లో వుండటం నవలకు హైలెట్. ఈ 'కంప్యూటర్ ఎరా'లో వెర్రితలలు వేసే శృంగార భావనల గూర్చి, ఆంటీ కల్చర్ గూర్చి రచయిత్రి కొత్త కోణంలో రాశారు.

**–డాక్టర్ కె. సంధ్యారాణి,**
లింగపాలెం (ప.గో.)

## 'సుపర్బ్, సింప్లీ సుపర్బ్'

(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

ఊహా, స్వప్నాలున్నవారు గత్యంతరంలేక ఎలా పతనమౌతారో చిత్ర గాథ విడమర్చి చెప్పింది. కొందరి తల్లిదండ్రుల బాధ్యతారాహిత్యం అలాంటి జీవనానికి నాంది పలుకుతుంది.

క్రొత్తగా సినిమాల్లోకి రావాలనుకునేవారు ఎలా మోసపోతారో చెప్పి అలాంటివారికి కనువిప్పు కల్గిస్తుందీ నవల 'జీవనఖేల'.

వేశ్య అయినా ఓ మంచికోసం పరోపకారం, నిస్వార్థం, త్యాగంతో తన తనువిచ్చిన చిత్ర పాత్ర మన్నన పొందుతుంది.

రూపసి, ధనవంతుడు, వినయశీలి వేశ్యావాటికలో చిత్రని వెతుక్కుంటూ రావడం చిత్రమే అయినా అది సబబేనని పాఠకులు ఒప్పుకోవాల్సిందే. సస్పెన్స్ చక్కగా విప్పుకుంటూ కథ ముందుకు సాగుతుంది.

నిరసించబడిన సమాజంలో నిరసించి ఆత్మహత్యకి పాల్పడిన మాధవ్ ఓ దేవత మహోపకారం పొంది కొత్త ఊపిరులు పోసుకుని, పోయిన రూపాన్ని, కరిగిన ఆత్మస్థైర్యాన్ని పొంది స్ట్రీట్ సింగర్ కాస్తా గ్రాండ్ సినీ సింగర్‌గా మహోన్నతంగా విలసిల్లుతాడు. అయితే ఆ ఔన్నత్యంలోనూ ఔచిత్యాన్ని ప్రదర్శిస్తూ ఆ దేవతని వెతుక్కుంటూ రావడం కొనియాడ దగ్గది.

పతిత యింకా ఏం పతనాన్ని పొందుతుందని చెప్పి బురదలోంచి ఓ ముత్యాన్ని తీసి కడిగి మళ్ళీ ఆ బురదలోనే చక్కని జీవితం ఉందని వేశ్యా జీవనానికి ఒప్పించి, ఆశ్రయమిచ్చి ఆనక తానే ఆమె ఆశ్రయం పొందుతుంది మాణిక్యం. తాను వేశ్యను, అతనికి తగను అని గుంజాటన పడుతున్న చిత్రని మాధవ్‌తో పెళ్ళికి ఒప్పిస్తుంది!

విశ్వనాథం, అయ్యర్, నాయర్- ఏ పాత్రా తక్కువ కాదనిపించేలా, సినీరంగ రీతులు,

వేశ్యాజీవితపు విచిత్ర గతులు స్పష్టంగా చెప్పబడ్డాయి. కథా కథనంలో పాత్రోచిత సంభాషణల్లో అసహజ సంఘటనలతోనే అయినా చక్కగా సాగింది నవల.

"పిల్లలు ముద్దుగా ఉంటారు. వాళ్ళ అల్లరి అందంగా ఉంటుంది. వాళ్ళ వచ్చీ రాని మాటలు ఊరీఊరని ఊరగాయల్లా మహారుచిగా ఉంటాయి"లాంటి ముద్దు మాటల్ని చెప్పారు రచయిత్రి!

సంగీతాన్నికైనా, ఏ కళకైనా యితరులు ముఖ్యంగా తమిళులు గుర్తింపునిచ్చాకే తెలుగువారు గుర్తిస్తారని ఓ చురక!

అందుకే సింప్లీ సుపర్బ్! అనిపించింది జూలై చతుర నవల ఐ. కవితగారి 'జీవన ఖేల'.

– కమలా నారాయణరావు,
హైదరాబాద్-74

## గడ్డిపూవు

**(అయిదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)**

కుల స్త్రీలు నోటితో ఉచ్చరిస్తేనే మైలపడి పోతామనుకునే వేశ్యా వృత్తిని సైతం రచయిత్రి తన రచనా పటిమతో దాన్ని వృత్తి ధర్మంగా మాణిక్యం ద్వారా విశదీకరింపచేయడం ఈ జీవనఖేల నవలకి హైలైట్. దాన్నే 'నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు' అని గీతాకారుడు కూడా చెప్పడంతో అతి హేయమైన వేశ్యావృత్తికీ ఓవిధమైన గౌరవం లభింపచేసేరు రచయిత. ఏ స్త్రీ కూడా తనంతతానుగా పతితగా మారడానికి యిష్టపడదన్న నగ్నసత్యాన్ని చిత్రద్వారా మరోసారి రుజువుచేసారు. పురుషాధిక్య ప్రపంచంలో పురుషుడే తన అవసరం కోసం స్త్రీని ఈ పాపంలోకి లాగుతాడని మాణిక్యం తన అనుభవసారంతో చెప్పిన అక్షరసత్యాన్ని గ్రహించిన ప్రతి స్త్రీ ఏదో ఒక టైంలో పురుషుడిని అసహ్యించుకు తీరుతుంది. వేశ్యకి కూడా మమత, మానవత్వం, కోరిక అనేవి వుంటాయనడానికి తార్కాణంగా చిత్ర తన జీవితం ఒక్కసారైనా మంచిపనికి వుపయోగపడాలన్న తపనతో, చూస్తేనే ఛీడుసుకోనే చర్మవ్యాధిగ్రస్తుడిని ముద్దుపెట్టుకొని అతనికి జీవితంలో యిక తీరదేమో అన్న ప్రగాఢ కోరికను తీర్చి అతనికి కొత్త జీవితాన్ని ప్రసాదించి అతని మనసుకో దేవతగా నిల్చింది.

కన్నతల్లిదండ్రులనే మరిచిపోతున్న ఈ స్వార్థ ప్రపంచంలో వేణులాంటి గొప్ప గాయకుడు ఎప్పుడో చిన్నతనంలో తనకు సహాయం చేసిన అందరికి పేరుపేరునా కృతజ్ఞతలు చెప్పడం అతని సంస్కారాన్ని ఔన్నత్యాన్ని తెలియజేస్తున్నాయి. మురారి, అయ్యరు, సంగీతం మాష్టారు లాంటి వారిని చూస్తే ఈ లోకంలో యింకా ధర్మబుద్ధి పరోపకార చింతన బతికే వున్నాయనిపిస్తుంది.

చిత్ర నీతిగా బ్రతకాలని పడిన ఆరాటం చివరికి తను ఎంత మాత్రం యిష్టపడని వ్యభిచారవృత్తినే స్వీకరించడంద్వారా అనాథ అయిన అందమైన అమ్మాయి ఒంటరిగా, నీతిగా బతకడం 'ఏటికి ఎదురీదడమేననే' నిజాన్ని నిరూపించేరు.

అమూల్యమైన శీలాన్ని సినీమోజులో ఎంతమంది యువతులు కోల్పోతున్నారో పరోక్షంగా చెప్పేరు.

కుల స్త్రీ జీవితం తమకు అందని ద్రాక్ష పండులా భావించి లోలోన కుమిలిపోతున్న, సమాజ భ్రష్టులయి భారంగా బతుకులీడుస్తున్న చిత్రలాంటి వేశ్యలకి రచయిత్రి తన జీవనఖేలలో పరిమళాల్ని అందించారు. రచయిత్రికి, చతురకు మా మనఃపూర్వక అభినందనలు.

–పీసపాటి పార్వతీదేవి
విశాఖపట్నం-530 016.




# చతుర

సంపుటి : 22

సంచిక : 8

సెప్టెంబర్ 1999

పల్లెలో పుట్టీ, పల్లెలో పెరిగిన ఆ అమ్మాయి ఆశలు ఎప్పుడూ ఆకాశహర్మ్యాలు నిర్మించేవి. అక్కడే పుట్టి పెరిగిన ఆమె భర్త ఆదర్శాలు... ఆచరణకై పాకులాడేవి.

ఉపాధ్యాయుడుగా సార్థక జీవితం గడపాలనుకున్న అతడు పరిస్థితుల ఒత్తిడితో ఫ్యాక్టరీ ఆఫీసర్‌గా మారిపోయాడు. తెలుగు మీడియం స్కూళ్ళలోనే చదివించాలనుకున్న తన పిల్లలను తప్పనిసరై ఇంగ్లీషు స్కూళ్ళలో చేర్చాడు. భార్య మాటలను కాదనలేకా, సామాజిక పరిస్థితులకు తలవంచీ... చివరకు ఆ యువకుడు పొందినదేమిటి?

అతని ఆదర్శాలు ఆచరణ సాధ్యం కాకపోవడానికి అడ్డువచ్చిన పరిస్థితులేమిటి?

సంస్కారాన్నీ, విజ్ఞానాన్నీ నేర్పవలసిన విద్య కొంతమందిని స్వార్థపూరితులుగా తయారు చెయ్యడం వెనుకగల కారణాలను కథా నేపథ్యంలో విశ్లేషించిన

## మాట్లాడే బొమ్మలు

\- కాలువ మల్లయ్య

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

ఎమర్జన్సీ రోజులు.

దేశాన్నంధకారం అలుముకొని నెలరోజులు దాటింది. ఎమర్జెన్సీ తన ప్రభావాన్ని చూపడం ప్రారంభమైంది. దీని ప్రభావం ఉత్తర భారతదేశంలో ఉన్నంతగా కాకున్నా దక్షిణ భారతదేశంలోనూ కొంతుంది. గరీబీ హటావో నినాదాలిచ్చిన ప్రభుత్వం ఢిల్లీలో గరీబుల గుడిసెలను నేలమట్టం చేయడానికి పునాది సిద్ధం చేసుకుంది. ఆంధ్రప్రదేశ్‌లోనూ రాజకీయ నాయకులను, విద్యార్థులను అరెస్టు చేస్తున్నారు. ప్రభుత్వాలను, అధినాయకులను విమర్శించేవారిపై నిఘా ఉంది.

చీకటి పడబోతోంది. జిల్లా కేంద్రంలోని కరీంనగర్ బస్టాండు ఇరుకుగా ఉంది. బస్టాండు నిండా జనం. రైలు సౌకర్యం లేక పోవడంవల్ల ప్రయాణీకులందరికీ బస్సే శరణ్యం. ఆ సౌకర్యమూ ఇంకా అన్ని పల్లెలకూ విస్తరించలేదు. ఒక్కో మార్గానికి ఒకటి రెండు బస్సులు రెండు మూడేళ్ళగా నడుస్తున్నా పల్లెలకెళ్లే బస్సుల కోసం ఎదురు చూసే జనాలతో బస్టాండంతా రద్దీగా ఉంది.

"సారూ! గీ బస్సే ఊరికి పోతుంది?" అని వచ్చే బస్సులను చూస్తూ అడుగుతున్నారు పల్లెవాళ్లు.

కొందరు గద్దెలమీద కూచొని పడిగాపులు కాస్తున్నారు.

వ్యవసాయ మార్కెట్‌కు వచ్చినవాళ్లు, దవాఖాన కొచ్చినవాళ్లు, ఎరువులు కొనడానికొచ్చినవాళ్లు, అనేక ఇతర పనులపై వచ్చినవాళ్లు త్వరగా ఇల్లు చేరుకోవాలని బస్సుకొరకెదురు చూస్తున్నారు.

తెల్లవారితే ఆదివారం సెలవు దినం కావడంవల్ల అక్కడ చదువుకుంటున్న విద్యార్థులు తమ ఊళ్లకెళ్లడానికి బస్టాండుకొచ్చారు.



రకరకాల ప్రయాణీకులతో ఆ ప్రాంగణమంతా రణగొణ ధ్వనుల్తో ఉంది. పిల్లల ఏడ్పులు, తల్లుల బుజ్జగింపులు, తండ్రుల విసుగుదలలతో గోలగోలగా ఉంది.

"పిప్పరమెంట్లు.. పిప్పరమెంట్లు... నిమ్మపులుసు పిప్పరమెంట్లు"

"అరటిపళ్లు... అరటిపళ్లూ... చక్కెరకేళీ అరటిపళ్లు"

"బిస్కెట్లు... బిస్కెట్లు... కమ్మకమ్మటి బిస్కెట్లు"

"అల్లమురబ్బా... అల్లమురబ్బా... కారం కారం, తియ్యతియ్యని అల్లమురబ్బా"

తినుబండారాలమ్మే కుర్రాళ్లు మనిషి మనిషికీ తిరిగి అమ్ముతున్నారు. పిల్లల నోరూరేట్టు చెబుతున్నారు.

"ఓ దొరొక్క పైసెయ్యవా? కండ్లులేని గుడ్డోన్ని బాంచెను. నాకు దానం చేస్తే పుణ్యమస్తది బాంచెను"

దీనంగా వేడుకుంటున్నాడో అంధుడు. పదేళ్ల పాప సాయంతో బస్టాండంతా తిరుగుతున్నాడు. అతని చేతిలో సత్తుగిన్నుంది. అందులోని చిల్లర ఊపుతూ అడుక్కుంటున్నాడాతను.

"కూడుగుడ్డకు లేదు నారాయణా... కుంటివాడను తండ్రి నారాయణా... బంగారు చెయ్యెత్తి నారాయణా! పది పైసలెయ్యిండ్రి నారాయణా!"

ఓ అవిటివాడు ఆ ప్రాంగణమంతా తిరుగుతూ అడుక్కుంటున్నాడు. మొదలే ఇరుకైన బస్టాండు... దాన్నిండా గుంతలు... గుంతల్లో వర్షపు నీళ్లు. ముందే ముక్కిడంటే అందులో దగ్గు పడిశమన్నట్టుంది పరిస్థితి. బస్సులొస్తుంటే గుంతల్లోని నీళ్లు ప్రయాణీకులపై చల్లుతున్నాయి.

బస్టాండులోని రణగొణ ధ్వనిని వింటూ, రద్దీని చూస్తూ బెంచీమీద కూర్చున్నాడు అయిలయ్య. తన ఊరికెళ్లే బస్సు రాకకోసం ఎదురుచూస్తున్నాడు. తన చేతిలో ఉన్న సంచీని అపురూపమైన వస్తువును పట్టుకున్నట్టుగా పట్టుకున్నాడు. అతని పక్కనే

కూర్చున్న కొమరయ్య ఎంతకూ రాని బస్సు కోసం చికాకు పడుతున్నాడు. విసుక్కుంటున్నాడు.

"నీయవ్వ! పొద్దుగూట్లెవడె... ఇంకెప్పుడస్తది బస్సు... బస్సుకోసం చూసిచూసి కండ్లు కాయలుగాయవట్టె" అన్నాడు కొమరయ్య.

"వానరాకడ ప్రాణం పోకడ తెలువదనేవాళ్లు మునుపు. ఇప్పుడు బస్సు రాకడెప్పుడో తెలుస్తలేదు. ఏకో నారాయణనన్నట్టు మనూరుకున్నదే ఒక్క బస్సు. అదే అటూ ఇటూ తిరగాలి. వానాకాలమాయె. ఏ గుంతల పడాగినా అంతే సంగతులాయె. బస్సెప్పుడొస్తె అప్పుడే ఎక్కాలి. ఏం చేసేదుంది మరి? " అన్నాడు అయిలయ్య.

"ఎప్పుడొస్తె అప్పుడెక్కకుంటె నేనేమన్న ఉరుకులాడుతన్నానా ఐలన్న. నువ్వేమొ కథ జెయ్యవట్టివి. మన బస్సుకు యాల పాలేం లేకపాయె. ఇయ్యాలరేపేమొ కాలం మంచిగలేదు. బీట్ల పనయి పైసలు తీసుకునెవారకు ఇంతసేపాయె. ఆ సేటేమొ లెక్క వెట్టిందే లెక్కపెట్టుకుంట, చెప్పిందే చెప్పుకుంట పైసలిచ్చుటానికి ఇంతసేపు జేసె"

"మనలాంటోల్లెంతమంది సేటుకు? లక్షలల్ల వ్యాపారమాయె. జాగ్రత్తగుండద్దా మరి? "

"సరెగని అయిలన్నా ఈ రాత్రికి మనూరి కర్నం పంతులింటికాడ పండుకుందామేంగది? పొద్దుగాల లేసి మొదటి బస్సుకు పోవచ్చు. జేబునిండ పైసల్తోని ఈ రాత్రెందుకు పోవుడు? "

"ఎడ్లబండిమీద పోతే భయమనే బస్సుకు పోవాలని ఆగినంగద! బస్సుల చాలామందుంటరుగద. భయమేముండదు. పొద్దుటి బస్సుకు పోతె ఊరికి చేరేసరికి పొద్దెక్కుతది. పని దండుగైతది. ఇప్పుడు పోతే రాత్రికి ఇంట్ల పడుకోవచ్చు"

"నిజమే.. ఇప్పుడు బాగా పనులున్న కాలం. చస్తామన్నా పురుసతు దొరుకుత లేదు. ఆయుటి పూనిందంటె మనకేమన్న తీరుతదా? పునాసయిపోయె. మడికట్టుకు సాగవట్టిమి. కరువుల భాగోతమన్నట్టు బక్కెద్దు సరిగ నడుస్తలేదు. ఓ ఎద్దును కొనాలిగ"

"వడ్లమ్ముతె వచ్చిన డబ్బులున్నయిగద. కొనేంది ఎద్దును? "

"ఈ పైసలకెంతమంది చూసుకుంటున్నరనుకుంటున్నవు? కల్లం మీదనే వడ్లు కొలుసుక పోతనంటె నేనియ్యనని చెప్పిన షావుకారికి. ఇంతకుముందయితె మనల్నే బెదిరించి తీసుకపోయెటోడు. ఇప్పుడు అన్నల భయం మొదలైంది. అన్నలు అన్నలంటున్నరు"

"అవును... ఈ నడుమ వాళ్ల మాటలు వినబడ్తున్నయి. ఎవ్వారెవ్వలో పడుచోల్లు ఊళ్లళ్లకొస్తున్నరు. అందులో పెద్ద చదువులు చదివెటోల్లున్నరట. వాళ్లేవో విడమరచి చెప్పుతున్నరట"

"వాళ్లెవరో మన దిక్కే చూస్తున్నరు. పోలీసోల్లు డ్రెస్సులు లేకుంట వచ్చి వింటున్నరట. ఇప్పుడు అత్యవసర పరిస్థితటగద. గోడలకు చెవులుంటయి. లోపలేసి తోముతె మన ఇజ్జతుపోతది. చప్పుడు జెయ్యకుండుండు"

"నిజమే కాని అంత భయపడుతెట్లనోయ్ కొమరయ్య. పుట్టిందో రోజు చనిపోయిందో రోజని తెగిస్తున్నరు పడుచోల్లు. సరెగని ఎన్ని రూపాయలచ్చినయి"

"ఎన్నేడియి... ఐదు వందలు. నువ్వు చూడని ధరలా? "

"ఊళ్లనయితె నాలుగు వందల యాభయే వచ్చేటియి"

వాళ్ల పక్కనే కూర్చున్న వాళ్లిద్దరు ఏవేవో మాట్లాడుకుంటున్నారు. ఇందిరాగాంధీ పేరు వినబడేసరికి వాళ్లు మాటలాపారు.

"ఏ మొగోనికి లేని ధైర్యమామెకుంది"

"అవును, బ్రహ్మంగారు చెప్పినవి నిజమ

వుతున్నయి. ఎంపలిచెట్లకు నిచ్చెన లేసె టోల్లు పుడ్తరని, విధవ రాజ్యమేలుతదని చెప్పిండు బ్రహ్మంగారు"

మరో ఇద్దరు యువకులు రాజకీయాల గూర్చి మాట్లాడుకుంటున్నారు. వీళ్లకు దూరంగా నిల్చొని గమనిస్తున్నాడో వ్యక్తి.

ఇంతలో జూలపల్లికి పోయే బస్సు వచ్చా గిందక్కడ. ఒకర్ని తోసుకుంటూ ఒకరు బస్సులోకి వెళ్తున్నారు. కొద్ది నిమిషాల్లోనే బస్సునిండా జనం. ఒకర్నొకరు తోసుకోవడం, పిల్లల ఏడ్పులు నడుస్తూనే ఉన్నాయి. అయిలయ్య, కొమరయ్య అతిక ష్టంగా చివర్లో సీట్లు సంపాదించుకొని కూర్చున్నారు.

కండక్టర్ బస్సెక్కి రైట్ రైట్ అనగానే బయలుదేరింది బస్సు. కండక్టర్ చివరికొచ్చి టికెట్లు చింపుతున్నాడు. బస్సు ఆపసోపాలు పడుతూ నడుస్తోంది.

అయిలయ్య ముందు సీట్లో కూర్చున్న కాలేజీ చదివే యువకులిద్దరు మాటల్లోప డ్డారు. రాజకీయాలు మాట్లాడుతున్నారు వాళ్లు.

"పోలీసు రాజ్జెమైంది దేశమంతా. ఇలా ఎన్నేండ్లేలుతదో ఇందిరమ్మ. ప్రజాస్వామ్యా నికర్ధమే మారిపోయింది. అధికారం పోతుందనేకదా అత్యవసర పరిస్థితి ప్రకటిం చడం"

"గదిలో వేసి కొడుతుంటే పిల్లయినా తిరుగబడుతుంది. హిట్లర్, ముస్సోలినీ లాంటి నియంతలే పోయారు. ప్రపంచాన్నే జయిద్దామన్న అలెగ్జాండర్ సంగతేమైంది? చరిత్రనుంచి ఈ పాలకులెందుకు గుణపా ఠాలు నేర్చుకోరు? పేరుకేమో ప్రజా స్వామ్యం. అన్నీ నిరంకుశ విధానాలే"

"ఉత్తర భారతదేశంలో ఎమర్జెన్సీ ప్రభావం బాగా ఉందట. సంజయ్ లీలలు బాగా సాగుతున్నాయట. అతడే పరోక్ష ప్రధానట"

"మన దగ్గర కూడ కుటుంబ నియంత్రణ టార్గెట్లు పెడ్తున్నారు. ఆరెస్సెస్ వాళ్లను, ప్రతిపక్షపోల్లను, కమ్యూనిస్టులను అరెస్టు చేస్తున్నరట"

"ఇలాంటి ప్రభుత్వాలు కూలిపోక తప్పదు. వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్‌ను చిత్తు చిత్తుగా ఓడిస్తారు ప్రజలు"

"అందరు నియంతలకు పట్టిన గతే ఆమెకు పడుతుంది"

వాళ్లు మాట్లాడుకుంటూనే ఉన్నారు. బస్సు కరీంనగర్ పొలిమేరలు దాటి పరు గులు తీస్తోంది. కండక్టర్ టికెట్లివ్వడం పూర్తిచేసి తన సీట్లో కూర్చున్నాడు. బస్సులో రాడ్ పట్టుకొని నిల్చొనున్న సివిల్ దుస్తుల పోలీసులిద్దరు ఆ యువకుల దగ్గరికొచ్చారు. వాళ్ల కాలర్లు పట్టుకున్నారు.

"ప్రభుత్వాన్నే తిడుతార్ర మీరు. ప్రభు త్వాన్ని కూలదోయడానికి కుట్ర పన్నుతున్నా రన్న మాట. ప్రధానమంత్రినే ఇష్టమొచ్చి నట్టు అంటున్నారంటే మీరు ఖచ్చితంగా తీవ్రవాదులే"

అని వాళ్లను లేపి నిల్చోబెట్టారు. బస్సా గింది. వాళ్లను తీసుకొని బస్సు దిగారు వాళ్లు. కరీంనగర్ దిక్కుపోయే బస్సాపి వాళ్లతో పాటెక్కారు. ఆ బస్సు కదిలింత ర్వాత ఊరెళ్లే బస్సు కదిలింది.

"గాలికి పొయ్యే కంపను తగులబెట్టుకోవ డమంటే ఇదే. గవర్నమెంటును తిట్టడమెం దుకు ఈ కాలేజీ పోరగాండ్లు? "

"అంటే... ఏం మాట్లాడకూడదా ఏంది? "

"ఇప్పుడు ఎమర్జెన్సీ కద! గవర్నమెంటును తిట్టకుంటేంబాయె"

"ఆ పిల్లగాండ్లు బయటకొస్తారన్న నమ్మకం లేదు"

"ఓ దిక్కేమొ ఎమర్జెన్సీ, ఇంకో దిక్కేమొ ఊళ్లలోకి చీకటోల్లు వచ్చి ఏమేమొ చెప్పుతు న్నరు. అంతా వడ్లు పెరుగు కలిపిన ట్టుంది"

"ఏదో శాత్రం సెప్పినట్టుంది. ఆ పిల్లలది జూలపల్లి. కరీంనగర్ కాలేజీల చదువుతున్నరు. వట్టిగ మాట్లాడుతున్నందుకు పోలీసులు తీసుకపోయిరి"

"మరి కాలేజీ పోరగాండ్లు చక్కగా చదువుకోక విప్లవాలని, మన్నని మసానమని తిరుగుడెందుకు? గవర్నమెంటేం తక్కువ జేసింది? స్వతంత్రమొచ్చినంక కొంచెం కొంచెం పైకొస్తున్నమా లేదా? ఇప్పుడు చాలామంది చదువుకుంటున్నరుగద! మేం మునుపు మగ్గం నేసుకుంట బతికెటోల్లం. స్వతంత్రమొచ్చినంక చేనేత సహకార సంఘాలొచ్చె ఉన్ని పారిశ్రామిక సంఘాలొచ్చె నవారు సంఘాలొచ్చె. ఆదిలాబాద్ దిక్కు పోవుకుంట బట్టలమ్ముకస్తున్నం. మేమో తీరుగ బతుకుతున్నమా లేదా?"

వీరమల్లుకు నడుస్తున్న వ్యవస్థమీద మంచి విశ్వాసముంది. తండ్రి కాలంలో బట్టకు పొట్టకు బతకడమే కష్టంగా ఉంటే ఇప్పుడో తీరుగా బతుకుతుండటంవల్ల అతనికి సంతృప్తికరంగానే ఉంది.

"నీకేంది వీరమల్లు? ఎంతో కొంత సంపాదించినవు. సంఘాలపేరు మీద మీ వాళ్లు ఓ తీరుగయింద్రు. కొండాలక్ష్మణ్‌బాపూజీ మీకన్నంబెట్టిండు. మీరు ఆదిలాబాద్ దిక్కుపోయి కొయ్య గొండోల్లకు అడ్డగోలు ధరలకు బట్టలమ్మి సంపాయించుకుంటున్నరు. నోట్లె నాలికెలు లేనోల్లు వాళ్లు. ఇప్పుడు వాళ్లు అన్నలతోని తెలివికస్తున్నరంటున్నరు"

"ఆ పిల్లలను పట్టుకపోయింది చూస్తూ కూడా మీరేవేవో మాట్లాడుతున్నారు. ఎందుకు లేనిపోని తంటాలు?"

నిల్చొనున్న వ్యక్తనగానే వాళ్లు మాటలాపారు.

దేశం గూర్చి అత్యవసర పరిస్థితి గూర్చి అన్నల గూర్చి మాట్లాడటం మానుకొని వ్యవసాయంలోని కష్టసుఖాల గూర్చి ముచ్చటించుకుంటున్నారు.

ప్రతి ఊరుకూ బస్సాగుతుంది. దిగేవాళ్లే ఎక్కువవడంవల్ల బస్సులో రద్దీ తగ్గుతుంది క్రమక్రమంగా.

ఐదేళ్లక్రితం వరకు తెలంగాణ ప్రాంతంలో ప్రత్యేక తెలంగాణా ఉద్యమం జరిగింది. మూడేళ్లక్రితం ఆంధ్రప్రాంతంలో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమమూ జరిగింది. ఈ ఉద్యమాలు ముఖ్యమంత్రులను మార్చాయి. కొందరికి పదవులను కట్టబెట్టాయి. రాజకీయ నాయకులు ఈ రెండు ఉద్యమాల్లోనూ విద్యార్థులను పావులుగా వాడుకున్నారు. వీటి ఫలితాల సంగతెలా ఉన్నా ప్రత్యేక తెలంగాణ ఉద్యమంతో ఓ చైతన్యం వచ్చింది. అందులో నాయకులుగా ఉన్న అప్పటి విద్యార్థులు ఇప్పుడు రైతాంగ ఉద్యమాల్లో నాయకత్వం వహిస్తున్నారు. కొందరు రహస్య జీవితం గడుపుతున్నారు. అయితే పాఠశాలల్లో, కాలేజీల్లో మాస్ కాపీయింగ్ మామూలయింది. అరాచక పరిస్థితులేర్పడ్డాయి. పాఠశాలల్లో నాన్‌డిటెన్షన్ పద్ధతి మొదలయింది. వాటికి తోడు రైతాంగ ఉద్యమాలు మొదలయ్యాయి. వాటిపట్లా విద్యార్థులు ఆకర్షితులవుతున్నారు.

ఈ పరిణామాలన్నీ గమనిస్తూనే ఉన్నాడు అయిలయ్య. అయిలయ్యది దిగువ మధ్యతరగతి వ్యవసాయ కుటుంబం. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం రావడానికి నాలుగేళ్లక్రితమే అతడు పదవ తరగతిలో ఉన్నాడు. అప్పుడే అతని తండ్రి చనిపోయాడు. ఇంటి పరిస్థితులాతనితో చదువు మాన్పించేట్టు చేశాయి. అప్పుడే అతడు వ్యవసాయంలో స్థిరపడ్డాడు. ప్రత్యేక తెలంగాణ, ఆంధ్ర ఉద్యమాలను ప్రత్యక్షంగా చూసిన అయిలయ్య ఇపుడు గ్రామాల్లో ఉద్ధృతమవుతున్న ఉద్యమాలు చూస్తున్నాడు. అన్నీ మననం చేసుకుంటున్నాడు.

"అయిలన్నా ఏందో బాగా ఆలోచించుతు

న్నవేందే?" అన్నాడు ఆతని పక్కనే కూర్చున్న కొమరయ్య.

"ఏంలేదు.. ఏం లేదు"

"నా దగ్గర దాచుడెందుకు? అప్పట్నుంచి ఒక్కమాట మాట్లాడుతలేవు. బస్సులనుంచే తీసుకపోయిరా పిల్లగాండ్లను. వాళ్లు ఊరు ముఖం చూస్తారన్న నమ్మకం నాకు లేదు"

"నిజమే కొమరయ్యా! పరిస్థితులను చూస్తుంటె భయమేస్తుంది నాకు. జరుగుతున్నవి మంచికో చెడ్డకో నాకర్థమయితలేదు. కూలిరేట్లు, పాలేర్ల జీతాలు పెంచాలంటరు కొత్తగొస్తున్నవాళ్లు. మరి చిన్న రైతులనెవరు పట్టించుకోవాలి? వ్యవసాయాలన్ని మూలపడతయేమొననిపిస్తుంది. పిడుక్కి బియ్యానికి ఒక్కటే మంత్రమన్నట్టు కూలీలు కూలీలంటె రైతుల నెవ్వలు పట్టించుకోవాలె మరి?"

"నువ్వన్న మాట నిజమే కాని అయిలన్నా... ఇన్ని రోజులు దొరలను అడిగినోడున్నడా? ఇప్పుడు వాళ్లంటె దొరలే భయపడుతుండ్రు. ఇంకో దిక్కేమొ చాలామంది బొగ్గుబాయిలర్ల నౌకర్లకు పోతున్నరు"

"వ్యవసాయంలో ఎంతజేసినా ఏడేమాన్కలన్నట్టుండె. అందుకే ఇదువరకు పాలేర్లున్నోల్లు, చిన్నచిన్న వ్యవసాయదారులు, కూలినాలి చేసుకునేటోల్లంత సింగరేణి నౌకర్లకు పోతున్నరు. పోచంపాడు కాలువ నీళ్లొస్తె మన వ్యవసాయాలు కొంచెమన్న బాగుపడుతాయేమొ. ఇప్పుడు చెరువు నిండుతె నాలు గిత్తులు రాలినట్టాయె. లేకుంటె కరువే నాయె"

"మన బతుకులే అంత! ఎక్కడున్నవే గొంగళంటె వేసినకాన్నే అన్నట్టు! నువ్వు మీ నాయన చనిపోయిన మోలె చదువు బందు జేసి ఎవుసం చెయ్యవడ్తివి. నువ్వు చదువుల ఉషారే ఉంటివి. పదకొండోది పాసయితె నీకు కండక్టరు నౌకరన్న వచ్చేది. ఇప్పుడెటు గాకుంటయిపాయె. ఓ చెపరాశి గూడ మనకంటె మంచిగనే బతుకతుండు. ఓ కండక్టరు నౌకరిజేసినాయిన బస్సులకు బస్సులే దోచి సినిమా తీసిండట..."

"ఆయన సినిమా తీసింది నిజమే. దాంతోనే నిండా మునిగిండు... ఎంతయిన పాపపు సొమ్ముగా. ఇటు నౌకరిపోయింది. అటు సంపాయించిందంత ఊడ్సుకపోయింది"

"అయిలన్నా... ఎంతయినా అన్యాయపు సొమ్ము నిలువది..."

"ఆ మాటెప్పుడో పోయింది కొండయ్యా. తెల్లబట్టలేసుకొని పైరవీలు చేసుకుంట తిరిగెటోడే బాగా సంపాయించుతుండు. ఎద్దు ముడ్డి పొడ్సుకుంట బతికెటోల్లు అట్లనే చావకుంట లేవకుంట ఉంటున్నరు. వేలకొద్ది ప్రభుత్వ బాకీలు తీసుకునేవాళ్ళ నేమనరు బేంకువాళ్ళు. చిన్న రైతులయితే పీడించి వసూలు జేస్తరు"

"నిజమేనే అయిలన్న. ఎంత ఇదయినా ఉన్నోడిదే రాజ్యం నడుస్తున్నది. సరెగని నీ కొడుకును బడికి పంపిస్తున్నవాలేదా?"

"ఇద్దరు బిడ్డల తర్వాత నాకున్నదే ఒక కొడుకాయె. వాన్ని చదువనియ్యకుంటేం జేస్త... నేనే చదువుకొని పైకి రావాలనుకున్న కాని మా నాన్న అకాల మరణంతో చదువాపవలసొచ్చింది. ఎంత కష్టపడయినా సరే నా కొడుకును మంచి చదువులు చదివిస్తా"

"మనకు చదివించాలని మా ఉంటదిగని వాళ్లు చదువుకోవద్దా ఏంది? ఇప్పుడు కాలేజీల్లో యూనియన్ల లొల్లట, అరెస్టులట. చాలా మంది మంచిగ చదువుకున్న వాళ్ళే అన్నల్లో కలుస్తున్నరట. పెద్దపల్లినుంచి, సిరిసిల్లనుంచి, జగిత్యాలనుంచి చాలామందే వాళ్లలో కలిసిపోయారట. ఇప్పుడు బడికి తోలియ్యన్నంటె గూడ భయమవుతుంది. అంత లొల్లి లొల్లయితుందట"

"ఎక్కడో ఏదో జరిగిందని, ఎలుకలున్నాయని ఇల్లు కాలబెట్టుకుంటామా చెప్పు?

రేపేదో అవుతదని పిల్లలకు చదువు లేకుంట జేస్తమా? ఈ సమాజంలో మనం తామరాకుమీద నీటిబొట్టులా ఉండాల న్నాడు ఒకాయన. ఆ మాట నిజం. పట్టుద లుంటే మనం దేన్నైన సాధించవచ్చు"

పైకైతే అలా అన్నాడు కానీ అయిల య్యకు పరిస్థితులను చూస్తుంటే భయం భయంగానే ఉంది. ఆదిలాబాద్ జిల్లా తపా లాపూర్‌లో దొరను చంపిన సంగతులు పేపర్లలో చూస్తూనే ఉన్నాడు. భూమయ్య, కిష్టాగౌడ్‌లను విడుదల చేయాలంటూ గోడ రాతలు కరపత్రాలు రావడమూ అతని దృష్టిని దాటిపోలేదు.

"ఉద్యమాల ప్రభావం ఉద్ధృతమవుతున్న సమయంలో ఆ ప్రభావం విద్యార్థులపై పడ కుండా ఉంటుందా? అనుకున్నాడు. వాడు కాలేజీ చదువులకొచ్చేవరకు చూసుకోవచ్చు"

తనకు తాను సమాధానం చెప్పుకున్నాడు.

"బళ్లు మొదలయినయి గదా! నీ కొడుకు బడికి పోతున్నడా? "

"ఒకటో తరగతిల శరీఖుజేసిన. మా కుటుంబంలో పదవ తరగతి వర్కైనా చదు వుకున్నది నేనొక్కన్నే. నా కొడుకునైనా బాగా చదివిస్తాను"

"చదివించాలె.. చదువుతోనే మనిషి తెలి వికొస్తడు. సరెగాని మీ చెల్లె పెళ్లింకా చెయ్య కపోతివేంది? ఇంకో దిక్కేమొ నీ బిడ్డలెదు గుతున్నరు. చేసెయ్యలేవూ ఆ పెండ్లి"

"ఏం జెయ్యాలె కొమరయ్యా. దాన్ని నా బిడ్డల లాగానే సాదిన. వ్యవసాయ కుటుం బమే అయినా దాన్ని గారాబంగా పెంచిన. దాన్ని ఊల్లున్న పదవ తరగతి వరకు చది వించిన. మా నాన్నలేని లోటు కనబడని య్యలేదు. మంచి సంబంధం కోసం చూస్తున్న. ఏదైనా ఉద్యోగమున్నతనికిస్తే నీడ పట్టుకు బతుకుతదని చూస్తున్న. అందుకే వెతకడం"

"నౌకరి గాడయితె కట్నం తక్కువడుగు తడా ఏందీ? "

"అది నిజమే.. కాని మా చెల్లె పెండ్లి కోసమనే మా నాన్న మొదట్నుంచే కొంత భూమి తీసుంచాడు. దాన్నమ్మి డబ్బులు బేంకులేసిన. పది వేలదాక కట్నమిచ్చుటా నికి సిద్ధంగున్నం. మంచి సంబంధం గావాలె"

"మీ కులంల పదివేల కట్నమిస్తె మంచి గిచ్చినట్టే లెక్క. చదువుకున్న సంబంధం మా దొరుకుతది. అయినా తలాపుకు చెరు వును పెట్టుకొని చేప నీళ్లకోసమేడ్చినట్టుంది నీ సంగతి. సాంబయ్య బియస్సీ చదివిండు గద! సారు నౌకరు దొరికే ట్రేనింగ్ గూడ చేసిండటగద! మీకు వరుస గూడయితడు. ఆ పిల్లవాడు చదువుల మస్తుషారే. త్వర గానే నౌకరయితదతనికి. బుద్ధిమంతుడు పిల్లగాడు. మాట్లాడకపోయినవా? "

"ఆ విషయాన్ని దృష్టిలో పెట్టుకున్నం. ఓసారడిగినం గూడ. వాళ్లకు గూడ సంబంధం మా నచ్చింది. కాని ఊళ్లె సంబం ధమని వెనుక ముందాడుతున్నరు. ఊళ్లె సంబంధమయితె విలువుండదని ఆళ్ల భయం"

"నీయవ్వ మంచి సంబంధమైనప్పుడు అవ్వన్ని చూస్తరా? ఊళ్లె సంబంధమై తేంది? ఎవ్వల గౌరవం వాళ్ల కియ్యాలె. వాళ్లు మ్యానోల్లు కాదుగద! మీకు సంబంధం కలిస్తె ఆపదల, సంపదల ఒగల కొగలు తోడుంటరు"

"నేను అదే ఆలోచిస్తున్న. ఆ పిల్లవాడు గూడ మా చెల్లెను మా నచ్చిండు. కాని నౌకరింకా కాకపాయె. నౌకరాయేసరి కింకెన్ని రోజులు పడుతదో? "

"అంత చదివినోనికి నౌకరిగాదా ఏందీ? నౌకరయినంకనయితె ఇంకింత మీదికి పోతరు. అన్ని మాట్లాడుకోని వరపూజ చేసెయ్యి. పిల్లవాన్ని నీవాన్ని చేసుకో. కార్తీక మాసంల పెండ్లి జేసెయ్యలేవు"

"ఆలోచించుకోవాలె"

బస్సు ఊరు చేరుకుంది. ఊరు బయటున్న బస్టాపులో ఆగింది. అయిలయ్య, కొమరయ్య బస్సు దిగారు. సంచిని అపురూపంగా పట్టుకొని చుట్టూ చూశాడు అయిలయ్య. రాత్రయినా వెన్నెల రోజులవడం వల్ల వెలుతురుంది. బస్టాపులో పాతున్న రెండు పార్టీల జెండాలను చూశాడు అయిలయ్య. కొమరయ్యది వేరే వాడ కావడం వల్ల వెళ్లిపోయాడు. సంచీతో ఇంటిదిక్కు నడుస్తున్నాడు అయిలయ్య.

ఎన్నికల సమయంలో గోడలకు రాసిన పేర్లను, అభ్యర్థనలను, పార్టీల నినాదాలను చూస్తూ నడుస్తున్నాడు అయిలయ్య.

ఒకప్పుడు ఊళ్లోని చాలామంది దొరా, కర్నప్పంతులూ చెప్పిన వాళ్లకే ఓటేసేవాళ్లు. ఐదారేళ్ల క్రితం వరకు వాళ్లకు ఎదురన్నదే లేదు. ఊళ్లో యువజన సంఘాలు స్థాపింపబడిన తర్వాత కొంత రైతు కూలీ పోరాటాలు ప్రారంభమైన తర్వాత చాలావరకు వాళ్ల అధికారాలకు ముకుతాళ్లు పడ్డాయి.

తనలో తాననుకుంటూ ఇల్లు చేరుకున్నాడు అయిలయ్య.

"బాపూ బాపూ! నాకేం దెచ్చినవు?" కాళ్లను పెనవేసుకున్నాడు శ్రీనివాస్

"మామిడిపండ్ల కాలమయిపోయిందిగద! కల మామిడి పండ్లు తీసుకొచ్చిన. వీట్నికోసుక తింటె మంచిగుంటయి"

అని సంచీలోంచి పండ్లు తీసి కొడుకు చేతికిచ్చాడు అయిలయ్య. రాజమ్మ, సరోజిని తమ్ముని చేతికిచ్చిన పండ్ల దిక్కు చూస్తున్నారు.

"కొడుకాయె... వంశాంకురంగద... బాపుకు రేపు సీనుగాడే అన్నం బెడుతడు" అంది ఏడేళ్ల రాజమ్మ నిష్ఠూరంగా.

కూతుర్ల భావాన్నర్థం చేసుకున్నాడు అయిలయ్య.

"అది కాదు బిడ్డా. తమ్ముడు చిన్నోడాయె. అందరు సమానంగా తినుండ్రి. వాని ఒక్కని కోసమేం తేలేదు" అని.

"పండ్లుకోసి తలకొన్ని ముక్కలియ్యి!" అన్నాడు భార్యతో అయిలయ్య.

"కోసిస్త..." శ్రీనివాస్ చేతుల్లోంచి పండ్లను తీసుకుంది శాంతమ్మ.

"బాపూ! నిమ్మపులుసు పిప్పరమెంట్లు తేలేదా నాకు?"

"కరీంనగర్‌కు పోయి పిప్పరమెంట్లు తేకుంటె ఊకుంటవా నువ్వు?" అని పిప్పరమెంట్లు తీసి కొడుకు చేతికిచ్చాడు.

"నువ్వు కొన్నుంచుకొని అక్కలకు, అత్తమ్మకు కొన్నియ్యి" అన్నాడు.

"నాకెందుకన్నయ్యా! నేనేమన్న చిన్నపిల్లనా? శీన్నే తిననియ్యి" అంది అక్కడే నిల్చొనున్న సరస్వతి.

"నీ పెండ్లయి అత్తవారింటికి పోయేవరకు నువ్వు మాకు చిన్న పిల్లవే!" అన్నయ్య మాటలకు సిగ్గుపడింది.

"బాపును కాళ్ళు కడుక్కోనిస్తరా లేదా? చుట్టు మూగితిరి... రాత్రయినకొద్ది నాకు భయంగావట్టె... కాలం మంచిగ లేదు" అంది శాంతమ్మ.

"బస్సులో వచ్చుడేనాయె. భయమేంది?"

భార్య చేతికి సంచీనిచ్చి బావిదగ్గరికెళ్ళాడు అయిలయ్య. కాళ్ళు, చేతులు, ముఖం కడుక్కొని లోపలికొచ్చాడు. పీటమీద కూర్చున్నాడు.

స్టీలు గిన్నెలో అన్నం, పప్పు వడ్డించి భర్తకు కొంచెం దూరంలో కూర్చుంది శాంతమ్మ. అయిలయ్య అన్నం తింటున్నాడు.

"ధర మంచిగ పలికిందా?"

"ఓ తీరుగ మా పడింది. సరెగని శీను బడికి పోయాడా. నేనింట్లలేనని బడికి పోనన్నడా?"

"బడికి పోనని హటమేం జెయ్యలే. శీను మంచిగనే చదువుకునెటట్టున్నడు. కాని ఇంట్ల కరెంటు లేదంటున్నడు. రాత్రి కందీల వెల్తురుకు చదువుకొమ్మంటె కష్టమై

తందంటున్నడు. కరెంటు పెట్టియ్యలేవు"

"వాడు చదివే చదువుకు కరెంటుగావన్నా? నేం జదువుకోలేదా గుడ్డి దీపం వెల్తురుకు. అప్పుడయితె కందీల గూడ లేదు. అయినా కరెంటు పెట్టియ్యాలె. సరస్వతి పెండ్లివరకన్న కరెంటు వచ్చెటట్టు జూడాలె"

అన్నం తినడం పూర్తిచేసి మూతి తుడుచుకుంటూ బయటకొచ్చాడు... అరుగుమీద కూచొని మామిడిపండు తింటున్నాడు శ్రీనివాస్.

"ఓనమాలు పూర్తిగ వచ్చినట్టేనా? " కొడుకుతో అన్నాడు.

"ఇప్పుడు కక్కాల గుణితం నేర్చుకుంటున్న బాపు"

"మంచిగ చదువుకొని పైకి రావాలె బిడ్డ... నువ్వెంత చదువుకున్నా చదివిపిస్త... నాకు చదువుకునే అవకాశం దొరుకలే" కొడుకును దగ్గరకు తీసుకుంటూ అన్నాడు అయిలయ్య.




దేశంలో 'గరీబీ హటావో' నినాదంతో పాటు ఇరవై సూత్రాల కార్యక్రమాల ప్రచారమూ జోరుగా సాగుతోంది. ఆ సూత్రాలేంటో సామాన్యుడికి తెలియకున్నా రేడియోల్లో వాటి హోరు బాగానే ఉంది. మరో దిక్కు అత్యవసర పరిస్థితీ తన ప్రభావాన్ని చూపుతోంది. అరెస్టులవీ జరుగుతూనే ఉన్నాయి.

మరోదిక్కు పశ్చిమ బెంగాల్ నక్సల్ బరీలో ప్రారంభమైన విప్లవోద్యమం, శ్రీకాకుళంలో ఉవ్వెత్తున లేచి, తెలంగాణాలో వేళ్లూనుకుంది. పోరాట ప్రాంతాన్ని విస్తరించుకుంటూ పోతోంది. పోరాటాలవల్ల తెలంగాణా గ్రామాల్లో అనేక మార్పులు చోటుచేసుకుంటున్నాయి. పాత విలువలనెన్నింటినో ధ్వంసం చేస్తున్నాయి.

తెలంగాణాలో పోరాటాలు వేళ్లూనుకుంటున్న సమయంలో డిగ్రీ చదువుతున్నాడు సాంబయ్య. ఇప్పుడు డిగ్రీ, బి.ఎడ్, పూర్తి చేసి ఉద్యోగాన్వేషణలో ఉన్నాడు. డిగ్రీ చదివే రోజుల్నుంచే అతనిపై పోరాటాల ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉంది. అతని సహపాఠులు కొంతమంది చదువులు వదిలిపెట్టి వెళ్ళిపోయారు కూడా. సాంబయ్య పుట్టిపెరిగిన వాతావరణం, ఊరుతో తల్లిదండ్రులతో ఉన్న సంబంధాలు, అతనిలో చోటుచేసుకున్న భయాలు అతన్నటువైపు వెళ్ళనీయలేదు. అయితే అతనిపై ఎంతోమంది చారిత్రక పురుషుల, సంస్కర్తల ప్రభావముంది. ఆ ప్రభావంతో కొంతైనా సమాజానికుపయోగపడాలనుంది. అయితే ఆదర్శాల అమలు దగ్గరికొచ్చేసరి కదెంత కష్టసాధ్యమో అతనికర్థమవుతోంది. పోరాటాలపట్ల సానుభూతితో, ఆదర్శాల వేడితో డిగ్రీ పూర్తిచేశాడు సాంబయ్య.

ఉద్యోగాన్వేషణలో కలుగుతున్న అనుభవాలతో తాను చదివిన చదువు గురించి మననం చేసుకుంటున్నాడు సాంబయ్య. తాను చదువుల ద్వారా ఏవైతే కోరుకున్నాడో అవేవీ తన పదహారేళ్ళ చదువులివ్వక పోవడం సాంబయ్య కాశ్చర్యకరంగానే

ఉంది. ఈ చదువులు తనకు సమాజంలో ఎలా బతకాలో తెలుపక పోవడం సాంబయ్యకు గమ్మత్తుగానే ఉంది. సాంబయ్య తండ్రి పెళ్ళి చేసుకొమ్మని పోరు పెడుతూనే ఉన్నాడు. డిగ్రీలో ఉన్నప్పట్నుంచీ చెబుతున్నా ఎలాగో నెట్టుకొచ్చాడు సాంబయ్య. ఇప్పుడిక తల్లిదండ్రుల ఒత్తిడినుంచి తప్పించుకోవడం సాధ్యం కాదనుకుంటున్నాడు. సాంబయ్య కులంలో చదువుకున్నవాళ్ళు తక్కువే ఉండటంవల్ల అతనికి పెళ్ళి గిరాకీ ఎక్కువే ఉంది.

బి.ఎడ్. పూర్తిచేసి వచ్చిన ఈ నాలుగైదు నెలలనుంచి తండ్రి బలవంతం మరీ ఎక్కువైంది. ఈ స్వల్పకాలంలోనే మూడు నాలుగు సంబంధాలు చూసొచ్చాడు. అయిలయ్య చెల్లెలు సరస్వతిని కూడా చూశాడు. ఆమె గురించి యేం నిర్ణయించుకోలేదు.

మంచంలో పడుకొని తన ఉద్యోగం గూర్చి, తండ్రి బలవంతం చేస్తుంటే పెళ్ళి గురించి ఆలోచిస్తున్నాడు సాంబయ్య.

తండ్రొచ్చి సాంబయ్య పక్కన మంచంలో కూర్చున్నాడు.

"దూరపుదయితె, బాగా చదువుకున్నదయితె మన మాటినుడు కష్టం. అయిలయ్య చెల్లెను చేసుకో. దానికి కొంత చదువుంది. ఉండడం కూడా బాగానే ఉంటుంది. అయిలయ్య నన్నడిగిండు. ఏం జెప్పన్నో చెప్పు మరి? " అన్నాడు లసుమయ్య.

సరస్వతిని చిన్నప్పట్నుంచీ చూస్తున్నాడు సాంబయ్య. వాళ్ళ పరిస్థితి తమకంటె కొంత మెరుగే అయినా తన చదువు చూసి తనకు పిల్లనిస్తానంటున్నారనుకున్నాడు సాంబయ్య. వ్యవసాయ కుటుంబమే అయినా గారాబంగా పెరిగిన సరస్వతి తన కుటుంబంలో ఇమిడిపోతుందో లేదో నన్న అనుమానముందతనికి. ఆ విషయమే తండ్రితో అన్నాడు సాంబయ్య. ఆమెకు కొంత స్వాతిశయమెక్కువనీ తెలుసతనికి.

"ఆ పిల్లేమన్న ఆకాశంనుంచూడిపడ్డదా? ఇక్కడ పుట్టి పెరిగిందేనాయె. కొంచెమంత చదువుకుంది. ఎర్రగ బుర్రగుంది. అంతే కద... నీకేమన్న చదువు తక్కువుందా? రేపోమాపో నీకు నౌకరయితదిగద... ఇంకా పిల్లకున్న అభ్యంతరమేంది? నౌకరయితె మీకు మీరు బతుకుతరు. ఇది మన కన్నివిధాల తగిన సంబంధమే. నువ్వొప్పుకుంటె పెండ్లి పెట్టుకోవచ్చు కట్నం గూడ బాగానే ఇస్తరు. దాని పైసలు దానికున్నయి"

తండ్రికట్నం మాటెత్తేసరికి సాంబయ్యకు కోపమొచ్చింది.

"నాన్నా! నీకు వాళ్ళిచ్చే కట్నం మీదున్న మోజు వాళ్ళ కుటుంబంమీద లేదు" అన్నాడు.

ఆ మాటలతో లసుమయ్య ముఖం మాడిపోయింది.

"అంటే? నువ్వేమొ కట్నం దీసుకోని బుద్ధిమంతునివి. దరమ రాజువు. నేనేమో పైసకాశపడి నీ జీవితం, నాశనం జేసెటోన్ని. అంతేకద బిడ్డ! కోటి తపస్సులు చేస్తె పుట్టినవు నువ్వు. నిన్ను కష్టపడి చదివించిన నేను! నీ చదువు వట్టిగనే అయిందా? "

"నా చదువుకు ఖర్చయిందని కట్నం రూపంలో గుంజుదామా నాన్నా! ఎవరి పిల్లలను వాళ్ళు చదివించుకోవడం మామూలే కదా! ఈ చదువువల్ల దొరికే ఉద్యోగం మనకుపయోగపడ్తుందా? వాళ్ళ కుటుంబానికా? "

కొడుకు మాటలు విని అగ్గిమీద గుగ్గిలమయ్యాడు లసుమయ్య.

"వాడు కట్నమిత్తె తాయిత్తులల్ల పెట్టుకొని చస్తననుకుంటున్నవా నన్ను! నాకొక్క పైసియ్యకు. ఇంత బంగారమో, ఇంకేమన్నో ఇస్తే అవి నీకే గద పనికొచ్చేది. గీ కట్నం సంగతి ఇప్పుడే పుట్టిందా? మునుపట్నుంచున్నదా? పోతే ఆడదాన్ని భర్త జీవితాంతం సాదాల్నా వద్దా? కొంత కట్నమిస్తె

అది తప్పా? " అన్నాడు కోపంగా.

తాను చదువుకున్న చదువు, తానేర్పరచుకున్న ఆదర్శాలు, కాలేజీ డిబేట్లలో కట్నాన్ని ఖండిస్తూ వాదించిన మాటలు, తన భావాలు తండ్రితో కట్నం తీసుకోవడం తప్పని ఒప్పించలేకపోవడం సాంబయ్యకాశ్చర్యకరంగానే ఉంది.

"తండ్రి ఆస్తిలో బిడ్డకు పాలుండదా? అదే కట్నమనుకో. వాళ్ళు కొత్త గిచ్చేదేముంది? మనం మన చెల్లె కివ్వలేదా? "

సాంబయ్యేం చెప్పినా లసుమయ్య వినదలుచుకోలేదు. తన మాటలు కాదంటున్నాడని కొడుకును బూతులు తిట్టాడు.

తననెంతో కష్టపడి చదివించిన తల్లిదండ్రుల నెదిరించి కట్నం లేకుండా పెళ్ళి చేసుకునే ధైర్యం లేదు సాంబయ్యకు. కరీంనగర్‌లో అలాంటి వివాహాలు ఒకటిరెండు చూసినా అలా చేయడమిష్టం లేదతనికి. సరస్వతిని చేసుకుంటానికి పెద్దగా అభ్యంతరాలు కనబడటం లేదతనికి. కాని కట్నం కోసం పీడించడం మాత్రం సరైందికాదనుకున్నాడు.

కొద్దిసేపేం మాట్లాడలేదు సాంబయ్య.

"నాన్నా! సరస్వతిని చేసుకోవడం నాకిష్టమే కాని ఎక్కువ కట్నమని నువ్వు బిగుసుకొని కూర్చోవద్దు. వాళ్ళకిష్టముండి, సంతోషంగా ఎంతిస్తానంటే అంతే తీసుకోవాలి. అట్లయితనే పెళ్ళిచేసుకుంటాను"

"అట్లన్నవు మంచిగుంది. అది రివాజేనని తీసుకోవాలంటున్న కాని వాళ్ళిస్తే నేనప్పులు కట్టుకుందామని కాదు. మీ అమ్మను నేను నూట పదహారు రూపాయల కట్నానికి చేసుకున్ననన్న విషయం మర్చిపోకు."

"నువ్వేం తక్కువకు జేసుకోలే... అప్పుడదే ఎక్కువ" అంది వాకిట్లోకొస్తూ వెంకమ్మ.

"అగో... మీ అవ్వకెట్ల రోషమొచ్చిందో చూడు" అన్నాడు లసుమయ్య.

సాంబయ్య, వెంకమ్మిద్దరూ నవ్వారు.

"సాంబన్నా! నీ లగ్గం ఇదువరకే అయ్యేదుండె. ఇప్పటికే ఆలస్యమైంది. నీతోటోల్లు లగ్గాలు చేసుకోని ఇద్దరు బిడ్డల తండ్రులయ్యింద్రు. గోరంట్ల భూమయ్య, ఎనగంటి రామచంద్రం చిన్నప్పుడు నీతోని చదువుకున్నోల్లే కద! వాళ్ళకిప్పుడిద్దరు పిల్లలు"

"వాళ్ళు చిన్నప్పుడే చదువు బందుజేసి బట్టల వ్యాపారులుగా స్థిరపడ్డరు. వాళ్ళు చేసుకున్నా అర్థముంది. మరి నాకు నౌకరి కాకపాయె. ఉద్యోగమాయేంతవరకాగుతేంబోతుంది? "

"ఉద్యోగం వచ్చేదానికి లెక్కా? పత్రమా? నువ్వన్నట్లు అయిలయ్యను కట్నం గురించి బలవంతం చేయ. వాళ్లెంతిస్తే అంతే తీసుకుందాం. నేను పెండ్లిగూర్చి అయిలయ్యతోని మాట్లాడొస్తా"

ఒప్పుకోక తప్పలేదు సాంబయ్యకు.

ఎవ్వరేం అడగకుండానే పదివేల కట్నమిస్తానన్నాడు అయిలయ్య. అతనికి తన చెల్లెలు సాంబయ్యతో సుఖపడుతుందన్న నమ్మకముంది. త్వరలోనే వరపూజ, లక్ష్మీపూజ చేయాలనుకుంటున్నారు.

"అయినె జీడిత్తోలె నల్లగుంటడు. నేంజేసుకోను" అంది సరస్వతి. ఇంకే అభ్యంతరమూ చెప్పలేదు.

ఆ మాటలు విన్న అయిలయ్య అవాక్కయ్యాడు.

"నేను నల్లగానే ఉంటాను. మీ వదినె నీకంటె తెల్లగా ఉంటుంది. నన్ను చేసుకున్నదా లేదా? శరీరం రంగులో ఏముందమ్మా? అంతా మన ఆలోచనలో ఉంది. సాంబయ్య మంచి ఇంటలీజెంట్. అతనికుద్యోగం తప్పకుండా దొరుకుతుంది. ఉద్యోగం చేస్తూ కూడా అతడింకా చదువుకోగలడు. అతనికి మంచి భవిష్యత్తుంది. ఇవన్నీ ఒకెత్తయితే అతని మంచితనం మరొకెత్తు"

అని రకరకాలుగా చెల్లెలికి చెప్పాడు అయి

లయ్య.

మొదలు తెలిసీ తెలియక ఆ మాటలన్నా సాంబయ్యతో పెళ్ళికి హృదయపూర్వకంగానే అంగీకరించింది సరస్వతి.

వాళ్ళ పెళ్ళి నిశ్చయమైంది.

చెల్లెలుమీద ఐదువేల రూపాయల బంగారం పెట్టాడు. అయిలయ్యా. అరెకరం భూమిచ్చాడు. ఖర్చులకిందికి రెండువేల రూపాయలిచ్చాడు.

ఉన్నదాంట్లో పెండ్లి బాగానే చేశాడు.

ఊళ్ళోనే ఉన్న అత్తవారింట్లో అడుగు పెట్టింది సరస్వతి.

"నీ కొడుక్కు పదివేల కట్నం తీసుకున్నవు. మీ కులంల ఇదెక్కువే... కోడల్ను మంచిగ చూసుకో... చదువుకున్న పిల్ల" అన్నారు ఊరివాళ్ళు లసుమయ్యతో.

"వాళ్ళిస్తె ముళ్ళెగట్టుకున్న కట్నాన్ని. కట్న మిచ్చింద్రట కట్నం. ఉన్నకాడికి పిల్లమీదనే వేసుకున్నరు. నా చేతులనుంచి రెండువేలు ఖర్చయింది" అని గొనిగాడు లసుమయ్య.

★ ★ ★

తనకున్న విద్యార్హతలతో ఉద్యోగ ప్రయత్నాలు చేస్తున్నాడు సాంబయ్య. ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసు, జిల్లా పరిషత్, డి.ఇ.ఓ ఆఫీసుల చుట్టూ తిరుగుతున్నాడు. పెళ్ళయింత ర్వాత ఉద్యోగమెంతవసరమో అతనికి మరింత తెలిసొచ్చింది. ఏ ఊరెళ్ళినా రాత్రి వరకయితే, ఇంటికి తిరిగొస్తున్నాడు. అలసి సొలసి ఇంటికొచ్చిన సాంబయ్యకు సరస్వతిని అక్కున చేర్చుకుంటే ఎంతో సేదతీరిన ట్టుంటుంది.

మరోదిక్కు పెళ్ళయి రెండుమూడు నెలలయ్యేసరికి లసుమయ్య కొడుకును చీదరించుకోవడం మొదలుపెట్టాడు. ఏదైనా ఉద్యోగం పడితే దరఖాస్తు చేయడానికి, ఇంటర్వ్యూలకెళ్ళడానికి డబ్బులడిగితే సాంబయ్య మీద విసుక్కుంటున్నాడు.

"నీకెప్పుడిగ నౌకరొచ్చేది? ఇప్పుడు నిన్నూ, నీ పెండ్లాన్ని సాదాలా నేను? ఉన్న ముత్తెమంత భూమమ్ముడు పాతదిగ" అంటూ గొణుగుతున్నాడు లసుమయ్య.

"ఉద్యోగమయ్యేంతవరకు పెండ్లి చేసుకోనంటే ఎందుకు బలవంతం చేసినవు మరి? ఇప్పుడేమొ ఇలా మాట్లాడుతున్నావు"

అని తండ్రిమీద కోపంగా మాట్లాడాడు సాంబయ్య...

"బాగ బల్సి సేసుకొమ్మన్న. ఆమె, నువ్వు టింగురంగా అనుకుంటుంటే మేం జావాలిగ"

వాళ్ళ మధ్య మనస్పర్థలు మొదలవుతున్నాయి.

కొంత నాగరికంగా ఉంటున్న కోడలు, వ్యవసాయ పనులు చేసే వెంకమ్మ మధ్య కూడా ఘర్షణ మొదలవుతోంది. అత్తతో పాటు వ్యవసాయప్పనులు చేయడం సరస్వతికిష్టముండదు. పశువుల కొఠంలోకి పోయి అలుకు చల్లడానికి పేడ తీసుకరమ్మంటుంది. వెంకమ్మ... పిడకలు చేయమంటుంది. ఇలాంటి పనులేవీ సరస్వతికి నచ్చడంలేదు. తాను వ్యవసాయ కుటుంబాల్లొంచే వచ్చినా కొంత చదువుకున్నది. తన భర్త కాబోయే ప్రభుత్వోద్యోగి. తానలాంటి పనులు చేయాల్సింది కాదనుకుంటుందామె. ఇలాంటి చిన్నచిన్న విషయాలలో అత్తా కోడళ్ళమధ్య స్పర్థలు పెరుగుతున్నాయి. ఇంకొన్ని రోజులయితే అవింకా తీవ్రరూపం దాల్చేవే. కాని పెళ్ళయిన ఆరునెలల్లోనే సాంబయ్యకు నిజామాబాద్ జిల్లా పరిషత్ నుండి ఉపాధ్యాయుడిగా ఉద్యోగమొచ్చింది.

వెంటనే ఉద్యోగంలో చేరాడు సాంబయ్య. భార్యను తీసుకొని వెళ్లి అక్కడే కాపురం పెట్టాడు. ఉపాధ్యాయ వృత్తిని మనస్ఫూర్తిగానే స్వీకరించాడు సాంబయ్య. అయితే సాంబయ్య ఊరివాళ్ళు మాత్రం అతన్ని దెప్పినట్టే అంటున్నారు.

"మనూల్లె చాలామందే పంతుల్లుండిరి. నువ్వుగూడ గీ నౌకరే ఎందుకు దొరికిచ్చుకున్నవు? నీకు సారు నౌకరి దప్ప వేరే నౌకరి దొరుకలేదా? బాగనే చదివినవేమొ? "

"అయ్యో సాంబన్న... గంత జదివి గీ నౌకరే సేత్తున్నవా? "

"సార్లు పిల్లలతోని సిగరెట్లు తెప్పించుకుంటున్నరు. కలిసి ప్యాకాడుతున్నరు. సార్లుకు విలువేడున్నదే. పంతులు నౌకరి గావాలంటే నువ్వప్పుడే డి.ఓ.యల్ చదువుతె ఐదారేండ్లకిందనే ఐపోయేదిగద"

ఊరికి వెళ్లినపుడు రకరకాలుగా అంటున్నారు.

'సాంబయ్యా తొమ్మిదో తరగతిలో ఉన్న సమయంలోనే తెలుగు ఎంట్రెన్స్ చదవమని చెప్పాడు తెలుగుసారు... తెలుగు ఓరియంటల్ కోర్సు చదివితే త్వరగా ఉపాధ్యాయుడిగా చేరవచ్చునన్నాడు. సాంబయ్యతో పాటు పదిమందితో ప్రారంభించాడు. తాను కాలేజీలో చదువుతానని అది మానుకున్నాడు సాంబయ్య. అవి చదివిన వాళ్ళకు ఐదేళ్ళక్రితమే ఉద్యోగాలయ్యాయి' పాత విషయాలను జ్ఞాపకం చేసుకున్నాడు సాంబయ్య.

కాలేజీ చదువులు చదివీ ఈ ఉద్యోగంలోకి రావడం తానో ఆదర్శంతోనే అనుకున్నాడు.

అయితే పల్లెటూళ్లలో ఉపాధ్యాయుడి బాధలాతనికి ఇప్పుడిప్పుడే అనుభవంలోకి వస్తున్నాయి.

ప్రత్యేక తెలంగాణా ఉద్యమం విద్యాలయాల్లో లేపిన అరాచకం, ఆ ప్రాంతాల్లో తలెత్తుతున్న ఇతర ఉద్యమాలు విద్యాలయాల్లో కొంత క్రమశిక్షణా రాహిత్యాన్ని పెంచుతున్నాయి. వీటికితోడు గ్రామాల్లో ఉన్న ఇతర సమస్యలు...

కల్లుతాగుతు ఒక అయ్య కల్లుబోయు... చుట్టతాగుతూ ఒక తాత చుట్టనిచ్చు..

పల్లెటూరు బడిపంతులు ఎదుర్కొంటున్న బాధలను, కవిత్వరూపంలో చెప్పిన పద్యాలను జ్ఞాపకం చేసుకున్నాడు సాంబయ్య.

అయితే తాను ఉపాధ్యాయుడిగా చేరిన ఉద్దేశ్యాన్ని దృష్టిలో పెట్టుకొని అన్నిటినీ దిగమింగుకుంటున్నాడు.

సరస్వతికి మాత్రం తన భర్త ఉపాధ్యాయుడిగా చేరడం ఇష్టంలేదు. ఏ వసతులూ లేని పల్లెల్లో గడపడమామెకిష్టంలేదు. తన భర్తకు వేరే ఉద్యోగం దొరికేంతవరకు అత్తింటి పోరును తప్పించుకోవచ్చని ఊర్కుంది. అతడుద్యోగంలో చేరిన మరునాటినుండే వేరే ఉద్యోగం కోసం ప్రయత్నించమని పోరుపెడుతోంది. సాంబయ్యను బలవంతం చేస్తూ వార్తాపత్రికల్లో వచ్చే ఉద్యోగాలకోసం దరఖాస్తు పెట్టిస్తుంది. అవి దొరికే వరకు చూద్దాంలే అని భార్యనెందుకు నిరుత్సాహపరచాలని కొన్ని ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టాడు సాంబయ్య. కొన్ని రాతపరీక్షలకూ హాజరయ్యాడు.

సింగరేణి కాలరీస్‌లో ఓవర్‌మన్‌గా ఉద్యోగం రావడం చూసి సాంబయ్యేమాత్రం ఆనందపడలేదు. సరస్వతికి మాత్రమెంతో ఆనందంగా ఉంది.

"బడి పంతులుద్యోగంలో ఏం పాడైంది... బతుకలేనోడు బడిపంతులన్నరు. ఎదుగూ బొదుగూలేని జీవితం, జీతం. ఓవర్‌మెన్‌గా చేరితే మంచి జీతమే కాకుండా పైఆదాయం కూడా ఉంటుంది. ఓవర్‌మెనింట్లో సింగరేణి లేబర్స్ పనిచేస్తారు. ఒక్క ప్రమోషనొచ్చి అండర్ మేనేజరయితే కారు కొనుక్కోవచ్చు, మంచి భవిష్యత్తున్న ఉద్యోగం..."

సాంబయ్యకి ఊరివాళ్ళెంతోమంది అలా చెప్పారు.

సరస్వతి కూడా అదేమాటంది. సాంబయ్య తండ్రి, బావమరిది, మిత్రుడి, భార్యనుండి అందులో చేరమని ఒత్తిడి పెరుగుతోంది. అయితే సాంబయ్యకు ఉపాధ్యాయవృత్తిని వదులుకోవడమేమాత్రం

ఇష్టంలేదు. డబ్బు విషయంలో మంచి ప్రాస్పెక్ట్స్ ఉన్న ఉద్యోగమే అయినా ఉపాధ్యాయునిగా తాను చేరిన ఉద్దేశ్యం అది వదిలిపెడితే నెరవేరదనుకున్నాడు.

అందరినుండి ఒత్తిడి తగ్గించుకోవడానికో ఉపాయమాలోచించాడు. అ సమయంలోనే బీహార్‌లోని ధన్‌బాద్ గనుల్లో పెద్ద ప్రమాదం జరగడం సాంబయ్య వాదనను సమర్థించుకోవడానికో కారణమైంది.

"బొగ్గు గనుల్లో ఉద్యోగం ప్రమాదకరమైంది. అందులో భద్రతలేదు. ఓవర్‌మెన్ గనుల్లోకి దిగకతప్పదు. బొగ్గుపెళ్ళలు కూలి ఎంతోమంది మరణించారు. ఏ ఉద్యోగమూ లేనివాళ్ళకో, తక్కువ చదువున్నవాళ్ళకోనైతే అది వేరు. ఉన్న ఉద్యోగాన్ని వదిలిపెట్టి ప్రమాదభరితమైన ఆ ఉద్యోగంలో నేనెందుకు చేరాలి? నేను ఎక్స్‌టర్నల్‌గా పి.జి. చేసి లెక్చరర్ పోస్ట్ సంపాదించుకుంటాను. చస్నాలా బొగ్గుగనుల్లో జరిగిన ప్రమాదం గూర్చి వార్తల్లో చూడటం లేదా? "

రకరకాలుగా చెప్పి ముందు సరస్వతిని ఒప్పించాడు. ఆ తర్వాత తండ్రిని, బావమరిదిని కన్విన్స్ చేశాడు. ఉపాధ్యాయ వృత్తిలోనే ఉండటానికి నిర్ణయించుకున్నాడు.

జీతం మాటెలా ఉన్నా, ఎవరేమనుకున్నా ఉపాధ్యాయవృత్తిలో ఓ రకమైన తృప్తున్నట్టు గ్రహించాడు సాంబయ్య. వివిధ మనస్తత్వాలు, ఆర్థిక అసమానతలు, కులాలు, మతాల చిన్నారులకు చదువు చెప్పడంలో ఎంతో ఆనందాన్ననుభవిస్తున్నాడు. వివిధ ఉద్యమాలు వేళ్ళూనుకుంటూ పాతతరాన్ని యువతరం నెట్టుకుంటూ ముందుకొస్తున్న సమయంలో పల్లెల్లో బడిపంతులుకు సోషల్ వాల్యూ లేకపోవడం అతనికి బాధాకరంగానే ఉంది. అయినా అతనికావృత్తెంతో సంతృప్తినిస్తోంది.

మరికొన్ని నెలలు గడిచాయి. ఇంతలో ఎరువుల కంపెనీలో ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకు రమ్మని కరీంనగర్ ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసునుంచి కాల్ లెటర్ వచ్చింది. పోవద్దనుకుంటూనే ఇంటర్వ్యూకెళ్ళాడు సాంబయ్య. మెరిట్‌లో మొదటివాడుగా ఎంపికయ్యాడు. మరో పదిహేనురోజుల తర్వాత నెలరోజుల్లోగా ఉద్యోగంలో చేరమని అపాయింట్‌మెంట్ ఆర్డరొచ్చింది.

అది చూసి సాంబయ్యకేం సంతోషం కలుగలేదు. సరస్వతి ఆనందానికి మాత్రం హద్దుల్లేవు. ఉపాధ్యాయవృత్తిని వదులుకోవడ మాతనికిష్టంలేదు. ఆ ఉద్యోగంలోనే ఉండడం సరస్వతికిష్టంలేదు. దాదాపందరూ సాంబయ్యను రామగుండంలో చేరమనే అంటున్నారు. ఏంచేయాలో తోచక సాంబయ్య తనలోతను ఘర్షణపడుతున్నాడు.

ఆ సమయంలోనే అయిలయ్య, లసుమయ్య, విజయేందర్‌రెడ్డి సారును వెంటబెట్టుకొని సాంబయ్య దగ్గరికొచ్చారు. తాను తాగకున్నా వచ్చిన వాళ్ళకోసం కల్లు తెప్పించాడు సాంబయ్య. కోడిని కోసి విందు చేశాడు.

ఆ తరువాత తామొచ్చిన అసలు విషయం బయటపెట్టారు వాళ్ళు. "నువ్వా ఉద్యోగంలో చేరడానికి వెనుకముందాడుతున్నావని సరస్వతి నాకుత్తరం రాసింది. అంత మంచవకాశాన్ని ఎందుకు వదులుకోవాలనుకుంటున్నావో నాకర్థం కావడంలేదు. కేంద్ర ప్రభుత్వ యాజమాన్యం కిందున్న కర్మాగారంలో ఉద్యోగమంటే మాటలా? ఈ అవకాశాన్ని నువ్వు జారవిడుచుకోవద్దు..." అన్నాడు అయిలయ్య.

"సాంబయ్యా! నేను ఐదారేళ్ళుగా ఉపాధ్యాయవృత్తిలో ఉన్నాను. ఇందులో జీవితమెప్పుడూ 'గొర్రెతోక బెత్తెడన్నట్టే' ఉంటుంది. నీకే ఉద్యోగమంటేనే ఇష్టమని నాకు తెలుసు. కాని, ఇందులో ఎదుగూ బొదుగుండదు. నీకొచ్చిన ఈ అవకాశాన్ని వదులుకోవడం మూర్ఖత్వమే అవుతుంది.



వెంటనే రామగుండంలో చేరు…" అన్నాడు విజయేందర్ రెడ్డి సారు.

"నాకు నౌకర్ల సంగతి తెలువదికాని ఇప్పుడచ్చింది మంచి నౌకరంటున్నరందరు… నీకిప్పుడిస్తున్న జీతానికి డబుల్ జీతమస్తదంటున్నరు. పెద్దసారు జీతం కంటెగూడ ఎక్కువున్నదట. నేనోసారక్కడికి పోయిన. పెద్దపెద్ద బిల్డింగులు, లైట్లు, దవాఖాన, బళ్ళు అన్నీ ఉన్నాయి. ఈ పల్లె లేం పాడైంది చెప్పు? ఏదో చెప్పి ఓవర్‌మెన్ నౌకరికి పోకపోతివి. ఇంకేమన్న చెప్పి దీన్ని గూడ కాదంటవని వీళ్ళను తీసుకొచ్చిన… మాతోనిరా, పోదాం, ఈ నౌకరికి రాజీనామా పెట్టు" అన్నాడు లసుమయ్య.

అందరూ ఒకే పాట పాడేసరికేం చేయాలో తోచలేదు సాంబయ్యకు. అందరూ ఆర్థికపరమైన ఎదుగుదల గురించే తప్ప తన ఉద్దేశ్యాన్నర్థం చేసుకోక పోవడం బాధగా ఉందతనికి…

"నాకు మొదట్నుంచీ ఉపాధ్యాయ వృత్తంటే ఎనలేని గౌరవభావముంది. ఉపాధ్యాయుడిగా చేరుదామనే నాకొచ్చిన ఇంజనీరింగ్ సీటును వదులుకున్న సంగతి మీకు తెలుసు... ఇప్పుడు ఈ ఉద్యోగాన్నే వదిలి పెట్టమనడం ఏం బాగుంది? "

ఆ మాటలకు విజయేందర్ రెడ్డి చిన్నగా నవ్వాడు.

"వయసు వేడిలో, ఆదర్శాల మోజులో ఏవేవో అంటుంటారు. ఆదర్శాలుండటం తప్పని నేననటం లేదు. అందుకోసం, ఉపాధ్యాయ వృత్తేచేయాలనేం లేదు. మన ఆదర్శాలను ఏ పనిచేస్తున్నా పట్టుదలుంటే నెరవేర్చుకోవచ్చు. ఏవేవో ఆలోచనలతో బడి పంతులుగానే ఉంటానంటే నీ ఇష్టం. కాని నా అనుభవంతో చెబుతున్నాను. ఈ అవకాశాన్ని వదులుకోవడం మంచిది కాదు" అన్నాడు.

ఆ మాటలు ఆలోచనలో పడేశాయి సాంబయ్యను. అతనిలో రకరకాల ఘర్షణ మొదలైంది. సూటుకేసులో భద్రంగా దాచి పెట్టున్న అయిదేళ్ళనాటి ఇన్‌లాండ్‌లెటర్ తీసుకొచ్చాడు. విజయేందర్‌రెడ్డి చేతికిచ్చాడు దాన్ని.

"ఇది నేను బి.యస్సీలో చేరిన మొదట్లో నాకింజనీరింగ్ సీటు వచ్చినప్పుడు నా మిత్రుడు పురుషోత్తమరావుకు రాసిన ఉత్తరం. అప్పుడతను హైదరాబాద్ నిజాం కాలేజీలో డిగ్రీ చేస్తున్నాడు. ఈ ఉత్తరాన్ని భద్రంగా ఉంచి రెండేళ్ళక్రితం నాకిచ్చాడు. చదవండి" అన్నాడు సాంబయ్య.

కరీంనగర్
.....1971

ప్రియమిత్రులు పురుషోత్తమరావుగారికి
నమస్కారములు

నేను వద్దంటున్నా వినకుండా నా సర్టిఫికెట్లు ట్రూ కాపీలన్నీ తీసుకెళ్ళి నువ్వే ఇంజనీరింగ్ సీటుకోసం దరఖాస్తు చేశావు. నీ స్నేహశీలతకు కృతజ్ఞతలు. నాకు బి.ఇ.లో సీటు వచ్చినందుకు సంతోషంగానే ఉంది. మంచి స్నేహితుడిగా నువ్వు నాకు చేస్తానన్న ఆర్థికసహాయానికై కృతజ్ఞుడినై ఉంటాను.

కాని నీ మనసుకు నొప్పి కలిగించే నిర్ణయం తీసుకున్నాను. నేను ఇంజనీరింగ్‌లో చేరడం లేదు. అందుక్కారణం మా ఇంటి ఆర్థిక పరిస్థితి కాదు. అవసరమయితే సాయం చేయడానికి నీలాంటి మంచి మిత్రుడుండనే ఉన్నాడు. మా తల్లిదండ్రులను వదిలి హైదరాబాద్‌లాంటి దూర ప్రదేశంలో ఉండడం ఇష్టం లేకున్నా నేను రాక పోవడానికి కారణం అదీ కాదు.

నీకు తెలుసు, నాకు మొదట్నుంచీ కొన్ని ఆలోచనలున్నాయని. విద్యారంగంలో చేతనైనంత చేయాలన్నది నా ఆకాంక్ష. ఎవరో వచ్చి ఏదో చేస్తారని ఎదురు చూడవద్దన్నారు. ఎడ్యుకేషన్ డిపార్ట్‌మెంటులో పని చేద్దామనే నేను ఇంజనీరింగ్‌లో జాయిన్ కావడంలేదు. అందుకోసం నేను ఏ ఇతర ఉద్యోగమూ చేయను. బి.యస్సీ పూర్తిచేసి బి.ఎడ్. చేస్తాను. ఉత్తమ ఉపాధ్యాయుడిగా సేవచేస్తాను. నీకు ఆశాభంగం కల్గిస్తున్నందుకు మన్నించగలవు.

మన స్నేహమెప్పటికీ కొనసాగుతుంది.

అభినందనలతో-

మీ మిత్రుడు
సాంబడు

ఉత్తరాన్ని చదివి వినిపించాడు విజయేందర్‌రెడ్డి... అయిలయ్య, లసుమయ్య నవ్వారు.

సరస్వతి ముఖం కందగడ్డలా మారింది. ఏవేవో ఆలోచనలతో అపురూపమైన ఇంజనీరింగ్ సీటును వదులుకున్న సాంబయ్యలో ఆమెకో అమాయకుడు కనబడ్తున్నాడు. 'పిచ్చోడు' తనలో తాననుకుంది.

'భర్త ఆదర్శాల పేరుమీద అవకాశాలను వదులుకుంటే, పల్లెల్నే పట్టుకొనుంటే తనకు

మెరుగైన జీవితం లభించడం కష్టం. పల్లెల్లో ఉంటే తన పిల్లలకు మంచి పాఠశాలల్లో చదివించడం సాధ్యంకాదు. పట్నాల్లో ఇంగ్లీషు మీడియం పాఠశాలలు పెరుగుతున్నాయి. పల్లెల్లోనయితే కనీసం ఇంగ్లీషు మీడియంలో చదివించడం కూడా వీలు కాదు. తన భర్త పల్లెలో చేసే ఉద్యోగంతో దొరికే జీవితాన్ని తాను భరించలేదు. తన భర్త ఎరువుల కంపెనీలో జాయినయితే ఇంతకంటే మంచి జీవితం లభిస్తుంది. భర్తను ఈ ఉద్యోగం వదిలేట్టు చేయాలి" నిర్ణయించుకుంది సరస్వతి.

మాట్లాడే సమయంకొరకెదురు చూస్తోంది.

"నేనెందుకా చదువును వదులుకున్నానో మీకర్థమైందికదా? మరి నన్నిప్పుడీ ఉద్యోగం వదులుకొమ్మనడం బాగుందా? " అన్నాడు సాంబయ్య.

భర్త దిక్కు రుసరుసా చూసింది సరస్వతి.

"సాంబయ్యా! నువ్వు పుస్తకాల పురుగువు. నీ సంగతి నాకు బాగా తెలుసు. నువ్వు పుస్తకాలను నమ్ముతావు. నీపై నువ్వు పుస్తకాల్లో చదివిన వీరేశలింగం, రాజారామ్‌మోహన్‌రాయ్ లాంటివాళ్ళ ప్రభావముంది. అయితే పుస్తకాల్లో చదివే జీవితానికి నిజజీవితానికీ మధ్య తేడా ఉంటుంది. అది లేకుండా బతికేంత పట్టుదల, ధైర్యం నీకు లేవు. ఆ విషయం నీకు తెలియదు" అన్నాడు విజయేందర్‌రెడ్డి.

తనను విశ్లేషించి చెప్పిన విజయేందర్ రెడ్డి దిక్కే చూస్తున్నాడు సాంబయ్య.

అతడేం మాట్లాడకుండా తననుతాను విశ్లేషించుకుంటున్నాడు.

"నువ్వు ఉద్యోగంలో చేరి ఎన్నాళ్లైంది? " అడిగాడు రెడ్డి.

"ఆరు నెలలైంది"

"ఉపాధ్యాయుడిగానే ఉండాలనుకున్నావా డివి వేరే ఉద్యోగాలకెందుకు ప్రయత్నించావు? రెండు మూడు ఇంటర్వ్యూలకెందుకెళ్ళావు? "

"సరస్వతి ఒత్తిడి చేయడంవల్ల"

"మరిప్పుడు కూడా సరస్వతి ఉద్యోగం వదులుకోమంటుందికదా"

సాంబయ్య దగ్గర సమాధానం లేదు.

"సరస్వతి బలవంతం చేస్తుందన్నదో సాకు మాత్రమే. నీలోనూ ఉపాధ్యాయ ఉద్యోగంకంటే మంచుద్యోగం సంపాదించుకోవాలన్న కోర్కె అంతర్లీనంగా ఉంది. లేదా నేనేఉద్యోగమైనా సంపాదించుకోగలనన్న ఛాలెంజింగ్ స్వభావముంది. ఓ రకమైన ఇగో ఉంది"

తనలోకి ఎక్స్‌రే కళ్ళతో చూస్తున్న విజయేందర్‌రెడ్డికేం చెప్పాలో తోచడంలేదు సాంబయ్యకు.

"సాంబయ్యా! నీ లేఖను బట్టి, నీ మాటలను బట్టి నువ్వు విద్యారంగాన్నేదో ఉద్ధరించాలని వచ్చానన్నావు. మరీ ఆరునెలల్లో నువ్వేం సాధించావు. నువ్వు చేస్తున్నది గౌరవప్రదమైన ఉపాధ్యాయ వృత్తేకదా. మరి ఊరి దొరలకు నమస్కారం చేయకుండా బతకగలవా? వాళ్ళకెదురుగా ఒక్క మాటైనా అనే ధైర్యముందా నీకు? పోనీ... నువ్వు విద్యార్థులకు చేసిందేంటి? "

విజయేందర్‌రెడ్డికి జవాబు చెప్పడానికి తడబడ్డాడు సాంబయ్య.

"ఈ స్వల్పకాలంలో చేసేదేముంటుంది? అయినా విశ్రాంతి లేకుండా పనిచేస్తున్నాను. ట్యూషన్ ఫీజు తీసుకోకుండా ఇంటికొచ్చిన పిల్లలకు చదువు చెపుతున్నాను. నా పోర్షన్ పూర్తి చేసుకుంటున్నాను. ఇంకేం చేయాలి? "

పాఠం అప్పచెప్పినట్టున్న సాంబయ్య మాటలకు నవ్వాడు విజయేందర్‌రెడ్డి.

"నువ్వు చేసేది తప్పని నేననడంలేదు. నువ్వు చేసినట్టు చాలామంది చేస్తున్నారు. అలా చేస్తే విద్యావ్యవస్థ బాగుపడ్డట్టేనా?

అట్లని నువ్వు చేస్తున్న మంచిపనిని కాదన డంలేదు. ఈమాత్రమైనా నువ్వు కొత్త మురి పెంలో చేస్తున్నావు. ఇంకొద్ది రోజులయితే నువ్వు ఫీజు తీసుకోకుండా ట్యూషన్లు చెప్పవు. నువ్విలాగే ఉంటానని భీష్మించు కొని కూర్చున్నా పరిస్థితులు కూర్చోనివ్వవు" అన్నాడు విజయేందర్‌రెడ్డి.

"భవిష్యత్తులో ఏదో చేస్తానని ఊహించు కోవడం దేనికి? ఏమవుతుందో ఎవరు మాత్రమెలా చెప్పగలరు? "

"పంతుల్లెవ్వలిప్పుడు వర్థిగలేరు. ఏవేవో దందాలు చేస్తున్నారు. నువ్వు ఏదో సేత్తన నుకోకు" అన్నాడు లసుమయ్య.

"అక్కన్నైతే మన ఊరుకు దగ్గరవు తుంది. సారు నౌకరి ఇంత దూరంలో చేయడమెందుకు చెప్పు? " అన్నాడు అయి లయ్య.

"ఉద్యోగానికి దగ్గర దూరమేంటి? కావా ల్సుంటే నేను సమయం చూసుకొని కరీంన గర్ జెడ్.పి.కి బదిలీ చేయించుకుంటాను"

"సాంబయ్యా! ఉద్యోగం చేయడమనేది మంచి భవిష్యత్తు కోసమేకదా. నీకొస్తున్న జీతానికి రెండింతలు జీతమొస్తుంటే దాన్ని చేయననడం తెలివితక్కువతనం గాదా? అదీ మన జిల్లాలో ఊరుకు దగ్గర్లో? "

"జీతమే ముఖ్యమనుకుంటే నేను ఎమ్మే చేసి లెక్చరరవుతాను. దానికో మూడు నాలుగేండ్లు పట్టవచ్చు"

"రేపటి కోడికన్నా ఈరోజు గుడ్డే నయమ న్నారు. రేపేమవుతుంది ఎవరికీ తెలి యదు. నువ్వు పి.జి. పాసయి డిపార్ట్‌మెం టల్ ప్రమోషన్‌మీద లెక్చరరయ్యేసరికి ఎన్నేండ్లు పడుతుంది? ఆ పొజిషన్ ఇప్పుడే వస్తుంటే కాదనుకోవడమేం బాగుం టుంది. అదృష్టమందలమెక్కిస్తానంటుంటే నొసలు కట్టెలు మోస్తానన్నట్టు చేస్తున్నావు నువ్వు. అప్పుడేమో ఇంజనీరింగ్ వదులుకు



న్నావు. మొన్నటికి మొన్న ఓవర్‌మెన్. ఇప్పుడు ఇది వదులుకుంటాననడం బాగా లేదు. మూర్ఖంగా నేను బట్టిన కుందేలుకు మూడే కాళ్ళన్నట్టు పట్టుకొనుండకు" అన్నాడు కొంత గట్టిగానే విజయేందర్‌రెడ్డి.

ఆ ఊరి హెడ్మాస్టరూ అదే మాటన్నాడు.

సాంబయ్యను ఉపాధ్యాయుడిగానే ఉండ మనమనేవాళ్ళెవరూ లేరు. అయితే సాంబ య్యకు ఈ ఆరునెలలకాలంలో పిల్లలతో ఏర్పడిన అనుబంధాన్ని వదులుకోవడమిష్టం లేదు.

"ఉపాధ్యాయ వృత్తిలో జాబ్ శాటిస్‌ఫ్యాక్ష నుంటుంది. మంచి జీతమన్న ఒకేఒక కార ణంతో దీన్ని వదులుకోవడం నాకు నచ్చడం లేదు"

ఎవరెన్ని చెప్పినా 'అప్పాటి మాటనూ చెప్పాక మానను' అన్నట్టు చేస్తున్న భర్త మీద కోపమొస్తోంది సరస్వతికి. ఉన్నం తలో మంచి జీవితాన్ని కోరుకోకుండా మారుమూల పల్లెల్లో బతుకుతానంటున్న భర్తపైకి అస్త్రాలు ప్రయోగించడానికి సిద్ధమ వుతోంది.

"సాంబయ్యా! నీకీవృత్తి కొత్త కాబట్టి ఇలా మాట్లాడుతున్నావు. నువ్వెంత మంచి ఉద్దే శంతో పనిచేసినా అది బూడిదలో పోసిన పన్నీరయ్యే అవకాశమే ఉంది. నేనెంతో అనుభవంతో చెబుతున్నాను. ఈ పల్లెల్లో పనిచేస్తే ఉద్యమాల ప్రభావమూ పడక తప్పదేమో. నువ్వా పరిస్థితులను తట్టుకో లేవు. తట్టుకోగల ధైర్యముంటే నీ విద్యార్థి దశలోనే అందులోకి పోయేవాడివేమో. ఇక్కడ నీ బతుకు ఎక్కడేసిన గొంగడక్కడ న్నట్టే ఉంటుంది. అక్కడేదో బాగుంటుందని కాదుగాని ఇంతకంటె నయమే. నువ్వింకా ఇక్కడ ఉంటానంటే అది నీ ఇష్టం" అన్నాడు విజయేందర్‌రెడ్డి.

తాను పుస్తకాల్లో చదివిన వెంపటాపు సత్యం, ఆదిభట్లకైలాసం లాంటివాళ్ళు మదిలో కదిలారు సాంబయ్యకు. తనకంత ధైర్యంలేదు. ఉంటే విజయేందర్‌రెడ్డి సార

న్నట్టు చేసేవాడేమో. తాను ఆదర్శ ఉపాధ్యాయుడిగా ఉండాలనుకుంటున్నాడు కాని ఉద్యమాల్లో దుముకాలనుకోవడంలేదు.

తానింకా అక్కడే ఉంటానని వాదించడానికి తన దగ్గర ఆయుధాలేవీ ఉన్నట్టు కనబడటంలేదు సాంబయ్యకు. తననర్థం చేసుకోకుండా అందరూ మంచుద్యోగమనేదాన్నే దృష్టిలో పెట్టుకొని మాట్లాడటం అతనికి నచ్చడంలేదు. అతడేదో మాట్లాడబోయేంతలో సరస్వతంది,

"ఈ మురికిలో ఏ వసతులూ లేని కొంపల్లో నేనుండను. ఈ అవకాశాన్ని వదులుకుంటే బాగుండదు. ఈ నౌకర్లో ఏంపాడయిందని ఇంతదూరంలో ఉండటం? మన ఊరికి దగ్గర మంచి నౌకరొస్తే కాదని అందరికీ దూరంగా ఇక్కడ ఉండడమెందుకు? ఇక్కడికైతే నేను రాను"

"అయితే కరీంనగర్‌కు మ్యూచువల్ పెట్టుకుంటా. లేదా జోన్‌లో జరిగే డి.ఎస్.సి.లో ఉద్యోగం అక్కడే సంపాదించుకుంటాను"

తన ఇంటి దగ్గర ఉద్యోగం అనే అస్త్రం అలా నిష్ఫలం కావడం సరస్వతికి నచ్చలేదు.

"ఈ ఉద్యోగం పాడుగాను. ఇందులో ఏముందని దీన్ని పట్టుకుని పాకులాడుతున్నారు? మనకేమన్న ఆస్తిపాస్తులున్నయా? ఊళ్లున్న కొద్దిపాటి భూమి పెద్ద మనుషుల తిండితిప్పలకే సరిపోతుంది. సారు నౌకరి జేసుకుంట ఏం సంపాదించుతననుకుంటున్నరు? నా పిల్లలను బిచ్చపొల్ల లెక్క పెంచుడు నాకిష్టంలేదు. వాళ్ళను చదువుకున్నంత చదివియ్యాక ఇక్కడుంటే అంతే సంగతులు. మీరీ ఉద్యోగానికి రాజీనామా చేసి రామగుండంలో చేరకుంటే నేను నూతిలో దునికి చస్తా"

సరస్వతి ప్రయోగించిన అస్త్రంతో షాక్ తిన్నాడు సాంబయ్య.

"బావా! నేను రెండుసార్లు ఆ కాలనీకి పోయాను. అన్ని వసతులున్న ఇల్లు. దవాఖాన, బళ్లు, అన్నీ ఉన్నాయి. కుమార్ దగ్గరికి పోయినప్పుడన్నీ చూపించాడు. నువ్వు దేశోద్ధరణ కార్యక్రమాలు చేయదలుచుకుంటే ఎక్కడున్నా చేయొచ్చు. నువ్వు మరేం ఆలోచించకుండా అక్కడ చేరడమే మంచిది" అన్నాడు అయిలయ్య.

అదే మాటలను సమర్థించాడు హెచ్.ఎమ్. ప్రకాశయ్య.

ఆరోజుండి వాళ్ళంతా వెళ్ళిపోయారు.

వారంరోజులు విపరీతమైన సంఘర్షణ పడ్డాడు సాంబయ్య. పరిస్థితుల నాకళింపు చేసుకున్నాడు. అందరి వాదాలను, సలహాలను మననం చేసుకున్నాడు. సరస్వతి పట్టుదలనూ జ్ఞాపకం చేసుకున్నాడు.

అన్నీ ఆలోచించుకొని ఎరువుల కంపెనీలో చేరడానికి నిర్ణయం తీసుకున్నాడు.

మరోవారం తర్వాత తానెంతో అభిమానించే ఉపాధ్యాయ వృత్తికి రాజీనామా చేశాడు. ఎరువుల కంపెనీలో ఉద్యోగిగా చేరాడు.



పార్లమెంట్ ఎన్నికల ప్రకటన వెలువడింది. కాంగ్రెసేతర పార్టీలన్నీ కలిసి ఒకే

పార్టీగా ఆవిర్భవించాయి. కొంతమంది నాయకులింకా జైళ్ళలోనే ఉన్నారు. జైళ్ల నుంచే నామినేషన్లు దాఖలు చేశారు కొందరు. మరో స్వాతంత్ర్య నినాదంతో జయప్రకాశ్ నారాయణ దేశమంతటా పర్యటిస్తున్నాడు. ఎమర్జెన్సీ ఘోరాలను వివరిస్తూ ప్రజలను చైతన్యవంతులను చేయడం, సంజయ్‌గాంధీలాంటి వారి అధికార దుర్వినియోగం ఇంకెన్నో కారణాలవల్ల కాంగ్రెస్ ఓడిపోయింది. దక్షిణాది రాష్ట్రాల్లో కాంగ్రెస్‌కు కొన్ని సీట్లొచ్చినా కేంద్రంలో జనతా ప్రభుత్వమేర్పడింది. ఎనభైమూడేళ్ల వయసులో మురార్జీదేశాయ్ ప్రధానమంత్రిగా ఢిల్లీ పీఠమెక్కాడు.

ఉత్తరాదిలో కాంగ్రెస్ తుడుచుకుపోతే ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం ఒక్క సీటు తప్ప అన్నీ కాంగ్రెస్‌కే వచ్చాయి. ఆంధ్రుల తీర్పును గూర్చి రకరకాల వ్యాఖ్యానాలు చేస్తున్నారు. ఊరందరిదీ ఒక దారయితే ఉలిపికట్టెదొక దారి. 'ఆంధ్రులు అంధులు. మదరాసీలు మళ్ళీ కాంగ్రెస్‌కే ఓటేశారు' అని ఉత్తరాదిలో ఎద్దేవా చేస్తున్నారు.

జనతా అధికారంలోకి రాగానే ఎమర్జెన్సీ పోయింది. దేశమంతా తేలికగా ఊపిరి పీల్చుకుంది. జైళ్లలో మగ్గుతున్న రాజకీయ ఖైదీలు, ఎమర్జెన్సీ ఖైదీలు విడుదలయ్యారు.

మరోదిక్కు తెలంగాణా గ్రామాల్లో పోరాటాల ఉద్ధృతి పెరుగుతోంది. పెద్ద చదువులు చదివినవాళ్ళు కూడా ఎంతో మంది ఉద్యమాల పట్ల ఆకర్షితులై చదువులు వదిలిపెట్టి వెళ్ళిపోయారు. విప్లవం గూర్చి గోడలపై అనేక నినాదాలున్నాయి. అన్నల బహిరంగసభల్లో జనాలు తండోపతండాలుగా పాల్గొంటున్నారు. కూలీరేట్లు, పాలేర్ల జీతాలు పెరిగాయి. దొరల వెన్నులోంచి వణుకు పుట్టుకొస్తోంది. భూస్వాములపై దాడులూ జరుగుతున్నాయి. దొరతనాలకు క్రమక్రమంగా బీటలేర్పడుతున్నాయి. ఈ పోరాటాలు రజాకారు పోరాటాలకంటె విస్తృతమైన పరిధిని కల్గివుంటున్నాయి.

కార్మికవర్గంలో విప్లవకర ట్రేడ్ యూనియన్లు బలం పుంజుకుంటూ తమ భావాలను ప్రచారం చేసుకుంటున్నాయి. ఈ ట్రేడ్ యూనియన్‌వాళ్ళు ఎమర్జెన్సీ దౌర్జన్యాలనూ, ప్రజలపై జరిగిన దమననీతినీ పాటలు గట్టి పాడుతున్నాయి.

మరోదిక్కు ప్రజాపోరాటాలపై ప్రభుత్వ ఉక్కుపాదం బిగుసుకుంటూనే ఉంది. ఉత్తర తెలంగాణ జిల్లాల్లో క్రమక్రమంగా యుద్ధవాతావరణ మేర్పడుతోంది.

మిత్రుడి పెళ్లికి నిజామాబాద్‌కు వెళ్ళి తిరిగొస్తున్నాడు సాంబయ్య. బస్సులో కూర్చున్న సాంబయ్య కళ్ళముందెన్నో విషయాలు తిరుగుతున్నాయి.

కాలేజ్ విద్యార్థిగా ఉన్నప్పుడు తనకెన్నో ఆదర్శభావాలుండేవి. వరకట్నాన్ని చీల్చిచెండాడేవాడు డిబేట్లలో. పైసా కట్నం లేకుండా పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. కాని అందర్నీ ఎదిరించి అంత ధైర్యం చేయలేకపోయాడు. ఉపాధ్యాయుడిగానైనా స్థిరపడదామనుకుంటే అదీ సాధ్యంకాలేదు. తానిప్పుడు ఫ్యాక్టరీలో ఉద్యోగి అయ్యాడు. జీతం బాగానే ఉంది. జీవితం సుఖవంతంగానే గడుస్తున్నట్టనిపిస్తోంది. ఉద్యోగుల కోసమే కట్టబడిన ప్రత్యేకమైన కాలనీలో హాయిగానే ఉన్నట్టనిపిస్తుంది. తన భార్య సరస్వతికి ఆ జీవితం మరింత హాయిగా ఉంది.

అయితే తాను క్రమక్రమంగా 'కెరియర్' అనే ఊబిలోకి కూరుకుపోతున్నాడా? తన కాలేజ్ జీవితంలోని ఆదర్శాలనన్నిటినీ మరిచిపోతున్నాడా?

తననుతానే ప్రశ్నించుకున్నాడు సాంబయ్య.

తాను చదువుకుంటున్నప్పుడు కాలేజీలో, పాఠశాలలో కోఎడ్యుకేషనుండేది. చాలా మందికి కాలేజీ జీవితం రంగుల కలలాగే అనిపించేది. ఊళ్లలో తల్లిదండ్రులు కష్టపడి

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టలోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

సెప్టెంబరు చతుర నవల మాట్లాడే బొమ్మలు

---

సమీక్షకుని పేరు : ______________________

చిరునామా ______________________

______________________

______________________

డబ్బు సంపాదించి పంపిస్తుంటే ఆడుతూపాడుతూ చదువుకునేవారు. అమ్మాయిలతో స్నేహం కోసం తహతహలాడేవారు. ఒక్కోసారి తలలు బద్దలు కొట్టుకునేవారు. వామపక్ష విద్యార్థి యూనియన్లు అప్పుడప్పుడే చోటుచేసుకుంటుండేవి. అవి బలపడింతర్వాత ఇలాంటి పోట్లాటలు తగ్గాయి. అయితే మరో రకం దాడులు ప్రారంభమయ్యాయి.

చదువుతోపాటు కోకరికులర్, ఎక్స్ట్రాకరికలర్ ఆక్టివిటీలుండేవి. వక్తృత్వ పోటీలు, వ్యాసరచన పోటీల్లో విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొనేవారు. తాను పదహారేళ్ళు చదువులోనే గడిపాడు.

మరీ పదహారేళ్ల చదువు తనకేం నేర్పింది? వామపక్ష విద్యార్థి యూనియన్ల వాళ్ళంటున్నట్టు ఇవి డిగ్రీల కొరకు చదివే చదువులేనా? కేవలం పొట్టకూడు సంపాదించుకోవడానికుపయోగపడే చదువులేనా? చదువుల ప్రయోజనమింతేనా?

తన పెళ్లయి, ఉద్యోగమైన తర్వాత తనకు, తల్లిదండ్రులకు మధ్యదూరం పెరుగుతోంది. క్రమక్రమంగా ఈ అగాధం ఎక్కువవుతోంది. తన తల్లిదండ్రులు సమీపంలోనున్న చెల్లెకు దగ్గరవుతున్నారు. ఈ అగాధాన్నెలా పూడ్చాలో తనకర్థంకావడం లేదు. తన ఇన్నేండ్ల చదువు ఇలాంటివాటికి పరిష్కారాలను నేర్పనేలేదు. తన చదువు జీవితానికి ఉపాధి కల్గించేదేకాని ఎలా జీవించాలో చెప్పలేదు. సమస్యలనెలా ఎదుర్కోవాలో అసలే చెప్పలేదు.

ఏదేమైనా చదువురాని కుటుంబంలోంచి వచ్చిన తను చదువువల్ల లభించిన ఉద్యోగంవల్ల ఓ తీరుగా బతుకుతున్నాడు. తన పిల్లలను మరింత బాగా చదివించాలి. ఆనంద్ వయసిప్పుడు ఒక సంవత్సరం. ఇంకొక సంతానం బాబైనా పాపయినా ఆపేయాలి. వాళ్ళను బాగా చదివించాలి. ఇప్పుడు చదువుల్లో పోటీ పెరుగుతోంది. ఇంకో దశాబ్దకాలంలో ఈ పోటీ మరింత పెరుగుతుంది. తన పిల్లలను ఉన్నతస్థితిలో చూడాలని సరస్వతి తపన. తన తపన కూడా అంతే.

తనలో క్రమక్రమంగా బతుకుభయం ప్రవేశిస్తోందా? తాను మెల్లమెల్లగా మధ్యతరగతి భయాల ఊబిలోకి కూరుకుపోతున్నాడా?

బస్సు కోరుట్ల దాటి కరీంనగర్ దిక్కు పరుగులు తీస్తోంది.

ఈ రూట్లో చాలాసార్లు ప్రయాణం చేశాడు సాంబయ్య. నిజామాబాద్, కరీంనగర్ల మధ్య చక్కటి పంటభూములున్నాయి. ఆ నేలంతా వ్యవసాయిక నేలే. బీడీలు చేయడంలాటి చిన్న పరిశ్రమలు తప్పితే పల్లెలన్నీ పారిశ్రామిక వాసనకు దూరంగా ఉంటాయి. పచ్చని పంటపొలాలు దర్శనమిస్తాయి. స్త్రీలు, పిల్లలు ఇండ్లలోనే బీడీలు చేస్తారు. ఎంతో కొంత సంపాదించుకుంటారు. ఈ ప్రాంతంలోని స్త్రీ ఆదాయం భారతదేశంలోని సగటు స్త్రీ ఆదాయంకంటే ఎక్కువ.

అయితే పచ్చనిపంట పొలాల్లో నేడు తుపాకులు మొలుస్తున్నాయి. జగిత్యాల పల్లెలిప్పుడు మండుతున్నాయి. యువతరం ఉద్యమాలపట్ల ఆకర్షితులై ఆందోళనలు చేస్తున్నారు.

జగిత్యాల పల్లెల గూర్చి ఆలోచిస్తుండగానే బస్సు కరీంనగర్ బస్టాండు చేరుకుంది.

బస్సు దిగాడు సాంబయ్య.

'రేపెలాగూ సెలవుదినమే. ఈరోజు ఊరికెళ్లి అమ్మా నాన్నలను, అయిలయ్యను చూసి రేపు సాయంత్రం వరకు ఇంటికి వెళ్ళిపోవచ్చు. ఎలాగూ ఇంత దూరమొచ్చాను కదా' అనిపించింది సాంబయ్యకు.

తమ ఊరికెళ్లే బస్సు గురించి ఎంక్వయిరీలో అడిగాడు. ఇంకో గంటైనా ఎదురుచూడాల్సుంది.

ఈలోగా మిషన్ హాస్పిటల్ దగ్గరుంటున్న పురుషోత్తమరావు దగ్గరికి పోయి వద్దామనుకున్నాడుగానీ, పోయొచ్చేసరికి బస్సు వెళ్ళిపోతుందేమోనని ఆ ప్రయత్నం మానుకున్నాడు. బస్టాండులోనే అటూ ఇటూ తిరుగుతూ సమయం గడిపే ప్రయత్నం చేస్తున్నాడు.

"హల్లో... సాంబయ్యా" అంటూ దగ్గరికొచ్చాడు సంజీవరెడ్డి.

"నమస్తే..." ప్రతినమస్కారం చేశాడు సాంబయ్య. ఒకరికొకరు చేతులు ఒకరు కలుపుకున్నారు.

ఒకర్నొకరు కౌగలించుకున్నారు.

డిగ్రీలో సహపాఠులు వాళ్లు. చదువయిపోయింతర్వాత కలుసుకోవడమిదే.

'అలా టీ తాగుతూ మాట్లాడుకుందాం పా..." అన్నాడు సంజీవరెడ్డి. ఇద్దరూ వెళ్ళి క్యాంటీన్‌లో ఓ మూలకు కూర్చున్నారు.

డిగ్రీలో తమ క్లాస్‌మేట్స్ గూర్చి ఒకర్నొకరడుక్కున్నారు.

"సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగం కొట్టేశావు. మొత్తంమీద బాగానే సెటిలవుతున్నావన్నమాట" అన్నాడు సంజీవరెడ్డి.

"ఉద్యోగం ఓ.కె. ఊరికి దూరంగా ఉంటుందని నిజామాబాద్‌లో టీచర్ ఉద్యోగం వదిలిపెట్టి రామగుండంలో జాయినయ్యాను. జీతం ఫర్వాలేదు. పెళ్లి కూడా అయింది. ఇప్పటికైతే ఓ బాబు. నువ్వేం చేస్తున్నావు? మన మిత్రులందరికీ ఉద్యోగాలు వచ్చినట్టేనా? "

"మన మిత్రుల్లో చాలామంది ఏదోవిధంగా సెటిలయ్యారు. మన ఫిలాసఫర్ విజయసారథి బి.ఎడ్. చేసి ఉపాధ్యాయుడిగా చేరాడు. ప్రస్తుతం హుస్నాబాద్‌లో పనిచేస్తున్నాడు. చక్రపాణి, వేణుమాధవ్ మంచిర్యాలలో పనిచేస్తున్నారు. మీకు దగ్గరేకదా. మనతో చదువుకున్నవాళ్ళు కొందరు అన్నల్లో కలిసిపోయారు. వాళ్ల పేర్లను పేపర్లలో చూస్తూనే ఉన్నాం. మరి నీ టీచర్ కలేమయింది? దానికోసం ఇంజనీరింగ్‌నే వదులుకున్నావుకదా! అయినా మంచి అవకాశమొచ్చినప్పుడు ఆదర్శమని ఏదో అని పాకులాడితే ఆ తర్వాత మిగిలేది శూన్యమే"

"ఆ... అనుకున్నవన్నీ జరగడం కొద్దిమంది అదృష్టవంతులకు మాత్రమే సాధ్యమవుతుంది. పెళ్ళిళ్లయి, ఉద్యోగాలవీ అయింతర్వాత ఎవరికి వారే యమునాతీరే అన్నట్టుంటుంది. ఒకర్నొకరు కలుసుకోవడం తక్కువ. ఈ నాలుగైదేళ్లుగా మిత్రులను కలుసుకున్నది లేనట్లే! ఇంతకీ నువ్వేం చేస్తున్నావో చెప్పనేలేదు"

"ఆ ఉద్యోగాలు... అణా పావలాలకోసం పాకులాడటాలు... ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు... ఇవేకదా ఉద్యోగమంటే. నాకు మొదట్నుంచీ ఉద్యోగం చేయడమిష్టంలేదు. అందుకే కంట్రాక్టర్ పనులు మొదలుపెట్టాను. అందులోనే స్థిరపడాలనుకుంటున్నాను. ఇప్పటివరకయితే ఫరవాలేదు. పోచంపాడ్ కెనాల్ కింద చిన్న పనులతో ప్రారంభించాను. క్రమక్రమంగా పెద్ద కంట్రాక్టులు తీసుకుంటున్నాను. నాకిదే బాగుందనిపిస్తోంది"

"నీకేంది? డబ్బున్నవాడివి. వడ్డించిన విస్తరిలాంటిది నీ జీవితం. నువ్వు త్వరలోనే ఏ వన్ కంట్రాక్టరువవుతావు. డబ్బుతోపాటు తెలివితేటలున్నాయి నీకు. దూసుకుపోయే స్వభావముంది. కొంత రిస్కున్నా ఉద్యోగిలా ఎదుగూ బొదుగూ లేకుండా ఉండదు"

"ఆమాట నిజమేకాని అందులో ఉన్న రిస్కు ఉండనే ఉంది. రిస్కు నెదుర్కోందే పైకి రావడం కష్టం. నేనుద్యోగం కోసం ప్రయత్నం కూడా చేయదలుచుకోలేదు. సరేగాని ఇప్పుడు కూడా ఏవేవో ఆదర్శాలంటూ వల్లిస్తున్నావా? లేక డెవలప్ అవడానికి ప్రయత్నిస్తున్నావా? "

కాలేజీ జీవితం జ్ఞాపకం వచ్చి సాంబయ్య ముఖం చిన్నబోయింది.

అతడేం మాట్లాడలేదు.

"ఆదర్శాలు ఉండొద్దని కాదుగాని కొంతైనా ప్రాక్టికల్‌గా ఆలోచించమనే నేను చెప్పేది. మన పిల్లలు పెరిగేవరకు ఉద్యోగాలు దొరకడం చాలా కష్టమవుతుంది. రోజురోజుకూ పోటీ పెరుగుతోంది. చదువుకుంటున్న వాళ్ళ సంఖ్య పెరిగినంతగా ఉపాధి అవకాశాలు పెరగడంలేదు. అందుకే పోటీ తీవ్రతరమవుతోంది. నీ పిల్లల్ని ప్రొఫెషనల్ కోర్సులు చదివేట్టు చూడు. లేదా నువ్వే బాగా సంపాదించు..."

సంజీవరెడ్డి మాటల్లో నిజమున్నా భవిష్యత్ భయాన్ని ఇంజెక్టు చేస్తున్నట్టనిపించింది సాంబయ్యకు.

"ఏం ముందుచూపోయ్ సంజీవరెడ్డి. ఇరవై ఏండ్ల తర్వాతి విషయాల గూర్చి ఇప్పుడే చెబుతున్నావు. అప్పటికప్పుడు చూసుకోవచ్చులే. అయినా నాకైతే అంతగా భయపడాల్సిన పనేం లేదనిపిస్తుంది. ప్రతి మనిషికీ తినడానికి కడుపు మాత్రమే కాదు పనిచేయడానికి రెండు చేతులుంటాయన్న విషయం మరిచిపోకూడదు. కష్టపడి పని చేస్తే బతకలేకపోవడమనేదేంలేదు. కాకపోతే వైట్‌కాలర్డ్‌గా బతకాలనుకున్నప్పుడే వచ్చే చిక్కంతా"

"కబుర్లకేం. చెప్పడానికి బాగానే ఉంటాయి. నువ్వుద్యోగం చేస్తున్నావు కదా. నీ పిల్లలను వ్యవసాయం చేస్తూ బతుకమనగలవా? రేపు నువ్వు మీ ఊళ్ళో ఇల్లు కడతావో, కరీంనగర్‌లోనో నేను చూడనా? ఏ తల్లిదండ్రులకైనా తమ పిల్లలు ఉన్నతంగా బతకాలనుంటుంది కదా. దానికి సాధనం నీలాంటివాళ్ళకు చదువేకదా"

"కాదని నేనంటున్నానా? కానీ ఆలూ లేదు చూలూ లేదూ, అల్లుడి పేరు సోమలింగమన్నట్టనిపిస్తున్నాయి నీ మాటలు. జీవితంలో ఇంకా ఏవిధంగానూ స్థిరపడలేదు. పిల్లల గూర్చి చెపితివి. అంటే ఈ జాగ్రత్తలన్నీ నువ్వు ముందే పాటిస్తున్నావన్న మాట..."

"అన్నమాటేంటి? ఉన్నమాటే. దేనికైనా ఓ ప్లానుండాలన్నదే నా ఉద్దేశ్యం. నీకు కొంత భాషాభిమానమెక్కువే. మాతృభాష మాతృభాషంటావు. ఆ అభిమానంతో నీ పిల్లల్ని తెలుగుమీడియం పాఠశాలల్లో వేసేవు. ఇప్పుడు ఇంగ్లీషు మీడియం పాఠశాలలు చాలా వస్తున్నాయి. కొన్ని రోజులయితే తెలుగుమీడియం బళ్ళ దిక్కు ఎవరూ చూడరు"

"మొత్తంమీద మంచి ఉద్యోగం అనే విషయాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని చదివించాలంటావు. సరే పిల్లల్ని బడికి పంపే వరకు చూడొచ్చులే" అని లేచి నిల్చున్నాడు సాంబయ్య.

సంజీవరెడ్డే బిల్ చెల్లించాడు. ఇద్దరూ బయటకొచ్చారు.

"వస్తా సాంబయ్యా! కరీంనగర్ వచ్చినప్పుడు మా ఇంటికిరా. మంకమ్మతోటలో ఎస్.వి.టి.సి. పక్కనే మా ఇల్లు" అని వెళ్ళిపోయాడు సంజీవరెడ్డి.

మరి కొద్దిసేపట్లోనే సాంబయ్య ఊరెళ్ళే బస్సొచ్చింది. బస్సెక్కి కూర్చున్నాడు. అతని పక్కనే కూర్చున్న అరవై ఏళ్ళు దాటిన నర్సింలు... కనురెప్పల కడ్డంగా చేయి పెట్టుకొని సాంబయ్యను పరీక్షగా చూశాడు.

"నువ్వు లసుమయ్య కొడుకువు కదా బిడ్డా. మంచి గున్నవా? " అన్నాడు.

"మంచిగనే ఉన్న తాత. ఎక్కడికో వచ్చినవు? "

"పానం బాగలేకుంటే భూమిరెడ్డి దవాఖాన్ల చూపించుకుందామనొచ్చిన... మోకాళ్ళ కీళ్ళ నొప్పులు, కాళ్ళు, చేతులు లేవ నిస్తలేవు. నడుం గుంజుడు... బిడ్డా..."

బస్సు బయల్దేరింది.

"వయసుతోపాటు సమస్యలొస్తయి

తాతా. భయపడొద్దు"

"భయమెందుకు మనుమడా? ఎన్నేండ్లున్నా సావు దప్పదుగద... ఊరు పొమ్మంటూ కాడు రమ్మంటున్న కాలం..."

"అట్లని చావురావాలని ఎవరైనా కోరుకుంటరా తాత. నూరేండ్లుదాటిన మనిషి గూడ, ఎంత చేతగాకుంటయినా ఇంకా బతుకాలనే అనుకుంటరు. కాదంటావా తాత? "

"చిన్నోనివైనా పెద్ద విషయమే చెప్పినవు. కానీ కాలమంతెట్లనో వస్తుంది? పోరగాండ్లు తల్లిదండ్రులనే బరువనుకుంటున్నరు. ఒగల్నొగలు పట్టించుకుంటలేరు. ఇగనా అసోంటి ముసలోల్లు చావు రావన్నని కోరుకోకేంజేస్తరు? "

నర్సింలు మాటలతో మనసు చివుక్కుమన్నది సాంబయ్యకు.

"అవునుతాతా! ఎవర్నెవరు పట్టించుకోని కాలమొస్తోంది. వ్యవసాయం వృత్తిగా ఉమ్మడి కుటుంబాలు ఉండటంలేదు. ఇప్పుడు బతుకుదెరువుకోసం మనుషులు ఊళ్ళు విడిచి వెళ్ళిపోతున్నరు. చదువుకొని నౌకర్లు దొరికి కొందరు వెళ్ళిపోతున్నరు. ఒకర్నొకరు పట్టించుకోకుంటవుతుంది"

"నువ్వు నవ్వులాటకంటున్నవేమొకాని మన్మమడ నీ మాటలు నిజమే. ఎక్కడోల్లక్కడ రెక్కలొచ్చినమోలె చెంగోబిల్లంటున్నరు. రోజులల్ల వెయ్యిలు, లక్షలు సంపాయించన్నని చూస్తున్నరు. అవ్వంటలేరు. అయ్యంటలేరు"

చివరిమాట తననుద్దేశించి అనడం లేదుకదా అనుకున్నాడు సాంబయ్య.

"ఏదో తాత. ఎప్పటికాలమప్పుడే నలుగురితోని నారాయణని బతకాలి. ఒకరిమీదే డిస్తె వచ్చేదేంటి? "

"అవు బిడ్డా. నువ్వు బుద్ధిమంతునివి. చిన్నప్పట్నుంచి చూస్తలేనా నిన్ను. సరెగని మీ అవ్వయ్యలను మంచిగ చూసుకో. ముసలోల్లయింద్రు. వాళ్లకు నీమీద మనసు లేదు నిజమే. అంత మీ చెల్లెకే చెందన్నని మాసేత్తంద్రు... అయినా నీ ధర్మాన్ని మర్సిపోకు"

తన ఇంట్లో వస్తున్న పరిణామాలను చూస్తూనే ఉన్నాడు సాంబయ్య. తమ కూతురు కష్టపడుతున్నట్టు తన కొడుకు ఉద్యోగంతో కోడలు సుఖపడ్తున్నట్టు భావిస్తున్నారు తల్లిదండ్రులు. అందువల్ల తమ మధ్యదూరం పెరుగుతోంది. తరాలమధ్య దూరం రోజురోజుకూ ఎక్కువవుతోంది. సరస్వతికీ తన తల్లిదండ్రులంటే చులకన భావమే. సహజంగా మెత్తటివాడైన తాను ఎవరినీ ఏమనలేకపోతున్నాడు.

తన చదువు కుటుంబ సమస్యలకు గల మూలాల గూర్చే మాత్రం చెప్పలేదు. వాటికి పరిష్కారాలనూ చూపలేదు. తాను చదువుకోవడంవల్లనే కుటుంబానికి దూరమవుతున్నాడా? ఈ చదువుల్లో పల్లెలకు దూరం చేసే లక్షణముందా?

సాంబయ్యలో అనేక ప్రశ్నలు.

"నువ్వు చెప్పింది నిజమే తాత. నా ధర్మాన్ని నేను మర్చిపోను. నా తల్లిదండ్రుల సొమ్ము ఎంత బాకుంటే అంతే వస్తుంది నాకు. ఏ మాత్రం ఆస్తిపాస్తులు లేని వాళ్ళెంతమందిలేరు...? బాకీలు పంచుకున్న వాళ్ళూ ఉన్నారు కదా"

"అవుబిడ్డ...కాని ఓ సంగతి మర్చిపోవద్దు. బతికున్నప్పుడు తిండికి చంపి, అనాదరణ జేసి చచ్చినంక బ్రమ్మాండంగ కర్మ జేస్తరు చూడు. అదెందుకు చెప్పు? వాట్ని చచ్చినోడు చూస్తడా? బతికున్నప్పుడే మంచిగరుసుకోవాలే"

ఆ వృద్ధుడు అనుభవంతో అన్నమాటలు సాంబయ్యను ఆలోచింపజేస్తున్నాయి.

ఇంతలో వాళ్ళూరు రానే వచ్చింది. బస్సాగింది.

రాత్రయింది. ఇంటికి వెళ్ళాలనుకుంటూనే సాంబయ్య అత్తవారింటికెళ్ళాడు. అరుగు మీద మంచంలో కూర్చొనున్న శ్రీనివాస్,

ఉపకారికి నుపకారము-విపరీతము గాదు సేయ వివరింపంగా

అపకారికినుపకారము-నెపమెన్నక సేయు వాడె నేర్పరి సుమతీ! పద్యం గట్టిగా చదువుతున్నాడు.

సాంబయ్యను చూసి చదవడమాపి లేచి నిల్చున్నాడు.

"బాపూ...! మామయ్యొచ్చిండు..." అని ఇంట్లో కురికాడు.

భోజనం ముగించి మూతి తుడుచుకుంటున్న అయిలయ్యా గబగబా బయటకొచ్చాడు. శాంతమ్మ చెంబుతో నీళ్లు తెచ్చి వాకిట్లో నిల్చోనున్న సాంబయ్యకిచ్చింది.

"కాళ్ళు కడుక్కుంటానికి చెంబుతో నీళ్ళివ్వడం నీకింకా జ్ఞాపకముండటం గొప్ప విషయమే. ఇది మనకు తరతరాలుగా వస్తున్న ఆచారం. కాని, కాళ్లు చేతులు కడుక్కుంటానికవి సరిపోవు. సబ్బు తెచ్చియ్యి, బావిదగ్గర గోలెంల నీళ్లున్నయో లేదో నేను జూస్త. లేకుంటే చేదిపోస్త..." అని బావిదగ్గరికెళ్ళాడు అయిలయ్యా. అనుకోకుండా బావ రావడం అయిలయ్యకెంతో ఆనందంగానే ఉంది.

శాంతమ్మ సబ్బుకోసం లోపలికెళ్ళింది. హాండ్‌బ్యాగ్‌లోంచి అరటిపళ్ళ పొట్లం తీసి శ్రీనివాస్‌కిచ్చాడు సాంబయ్య. లుంగీ కట్టుకున్నాడు. టవల్ తీసి భుజం మీదేసుకున్నాడు. శాంతమ్మ తెచ్చిచ్చిన సబ్బు తీసుకుని బావిదగ్గరికెళ్ళాడు.

బొక్కెనతో నీళ్ళు చేది గోలెంలో పోశాడు అయిలయ్య. కాళ్ళు, చేతులు, ముఖం కడుక్కున్నాడు సాంబయ్య.

బావా, బావమరుదులిద్దరొచ్చి అరుగు మీద వాల్చున్న మంచంలో కూర్చున్నారు.

"చెల్లె బాగున్నదా బావ...?"

"బాగానే ఉంది..."

"ఆనంద్ మంచిగున్నడా?"

"వాని పేరే ఆనంద్‌కదా! ఆనందంగానే ఉన్నాడు"

శాంతమ్మ వంటప్రయత్నాల్లో ఉంది.

"రాత్రయింది. ఇప్పుడేం చెయ్యకుమనక్కయ్యను. కరీంనగర్‌లో టిఫినవీ చేసొచ్చాను. ఆకలేం లేదు. ఏదుంటే అది తిందాం"

ఏమాత్రం అల్లుడి దర్జా, ఫోజులు పెట్టని బావగారంటే అయిలయ్యకెంతో ప్రేమ, గౌరవం. పెళ్ళయినప్పట్నించీ ఏరోజూ ఇదివ్వమని అదివ్వమని అడుగలేదు. తమకు తోచిందిస్తే తీసుకున్నాడు. లేకుంటే అదీ లేదు. తన చెల్లెల్ని బాగా చూసుకుంటున్న బావపై ఎనలేని గౌరవాభిమానాలున్నాయి అయిలయ్యకు...

"ఇంటల్లుడివి. పప్పుచారుతో నెట్ల అన్నం బెట్టుమంటవు బావ. రెండు కోడిగుడ్లుడికిస్తుంది. పది నిమిషాల్లో అయిపోతుంది"

"నాకెందుకో ఇలాంటివి నచ్చవు బావా! అల్లుడయితే కొమ్ములుంటాయా చెప్పు? కుండలగలదేదో తినాలి కాని అనవసర ఖర్చులెందుకు?"

"అందరూ నీలాగే ఉండరు బావా. నీకు తాగడంలాంటి ఏ ఇతర అలవాట్లూ లేవు. ఎప్పుడన్నా మీరు మా ఇంటికొస్తే కోడ్ని కోయడమో, మాంసం వండడమో తప్ప మేం పెడుతున్న ఖర్చేముంది? ఆ మాత్రం కూడా చేయవద్దంటే ఎట్లా? మా తృప్తి కోసమన్నా చెయాలిగదా?"

వాళ్ళిద్దరు మాట్లాడుకుంటుండగానే వంటయిందని శాంతమ్మ పిలిచింది.

సాంబయ్య లోపలికెళ్ళాడు. పీటమీద 'సకులంముకులం' పెట్టుకుని కూర్చున్నాడు. అతని ముందున్న మరో పీటమీద కంచం పెట్టి అన్నం, కూర వడ్డించింది శాంతమ్మ.

కంచాల్ని లేపి ఆ పీటను పక్కకు జరిపాడు సాంబయ్య.

"మీరు డైనింగ్ టేబుళ్ళమీద తినెటోల్లయితిరి. ఈ పల్లెకొంపల్ల గవన్నేడుంటయి. సరస్వతి టేబుల్ కొనిపించిందటగద..."

"నాకైతే పీటమీద విశ్రాంతిగా కూచొని

ముందు పళ్లెం పెట్టుకుని తింటేనే మంచిగనిపిస్తుంది. ఒకర్ని చూసొకరు డైనింగ్ టేబుళ్ళ కలవాటవుతున్నారుగాని ఎందుకక్కయ్యా అవన్నీ నేలమీద కూచొని తింటేనే దేశీయంగా ఉంటుంది" అన్నాడు అన్నంముద్ద నోట్లో పెట్టుకుంటూ.

"అన్ని వసతులున్న కాలనీల ఉంటున్నా నీ మనసు పల్లెలమీదనే ఉంటుంది, మిమ్ములను చూస్తుంటే నా స్వంత తమ్ముణ్ని చూసినట్టే ఉంటుంది"

శాంతమ్మ ఆత్మీయత సాంబయ్యను చలింపచేసింది.

"మరి స్వంత తమ్ముణ్ని మీరనొచ్చా అక్కయ్యా..."

శాంతమ్మ కొద్ది క్షణాలేం మాట్లాడలేదు.

"సరస్వతి బాగుందా? చిన్నతనంలో సంతానమైందాపిల్లకు? మంచిగ చూసుకుంటుందా బాబును. మీ అమ్మ కొద్దిరోజులుంటే బాగుండేదికాని వాళ్ళిద్దరికి పడదు. నాకేమో తీరదాయె..."

"సరస్వతి బాబును బాగానే చూసుకుంటుంది..."

భోజనం ముగించి అరుగుమీదికొచ్చి అయిలయ్య పక్కన మంచంలో కూర్చున్నాడు సాంబయ్య.

శ్రీనివాస్‌ను పిలుచుకొని దగ్గర కూర్చోబెట్టుకున్నాడు.

"బాగా చదువుతున్నావా...?" అడిగాడు.

తలూపాడు శ్రీనివాస్.

"ఇప్పుడెన్నో తరగతి?"

"మూడు..."

"ఎలా చదువుతున్నాడు?" అయిలయ్యనడిగాడు.

"నాకైతే వీన్ని బాగానే చదివించాలనుంది. వానికేమో చదువుమీది కంటే ఆటలమీదే ధ్యాసెక్కువ. వెంటబడి చదివించాలంటే నాకు సమయం దొరుకుతుందా? నాకు తీరిచస్తదా? ఆడపిల్లలకయితే మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తే అయిపోతుంది. మగపిల్లవాడికి చదువు, ఉద్యోగం ముఖ్యంకదా"

"చిన్నపిల్లవాడేకదా! ఇప్పుడే అంత వర్రీ కావాల్సిన అవసరం లేదు. వాడు బాగానే చదువుకుంటాడు" అన్నాడు అయిలయ్యతో.

"ఏంశీనూ! బాగా చదువుకోవడం లేదా? నీ చదువు గురించి మీనాన్న ఆందోళన పడుతున్నాడు. కష్టపడి చదవాలి. మొన్న మొన్నటి వరకూ మనలాంటి కుటుంబాల్లో చదువుకునే అవకాశాలే తక్కువ ఇప్పుడిప్పుడే చదువుల అవసరాన్ని గుర్తించి ఎక్కువ మంది చదివిస్తున్నారు. అయితే చదువులు క్రమక్రమంగా ఖరీదైనవవుతున్నాయి"

పసివాడైన శ్రీనివాస్‌కు ఆ మాటలర్థమేమీ కానట్టున్నాయి.

"అవును బావా! మనూరి విషయానికొస్తే మీతోని చదువుకున్న చాలామంది స్వతంత్రం తర్వాత పుట్టినవాళ్ళే. మనలాంటి కుటుంబాల్లో చదువుకున్నవాళ్ళు కొద్దిమందే ఉన్నా బుద్ధిగా చదువుకున్నారు. ఏదో ఉద్యోగం సంపాదించుకున్నారు. పోకడలకు పోయిన దొరలకు చదువంటలేదు. ఇప్పుడు దాదాపు అన్ని కులాల్నుంచి అవకాశమున్న వాళ్ళు చదువుకుంటున్నారు. చదువుకున్న వాళ్ళెక్కువవుతున్న కొద్దీ చాలా కుటుంబాల్లో ఆచార వ్యవహారాలు, బంధుత్వాలలో మార్పులు వస్తున్నట్టనిపిస్తున్నయి"

అయిలయ్య విశ్లేషణను చూసి ఆశ్చర్యపోయాడు సాంబయ్య.

"అవును... మనం కొంతకొంత మారుతున్నమాట నిజమే. కాని, మనం కోస్తా ఆంధ్ర ప్రాంతం వాళ్ళతో పోల్చుకుంటే చాలా వెనుకబడే ఉన్నాం. వాళ్ళు ఉద్యోగాల కోసం ఎంత దూరమైనా వెళ్తారు. మనకు ఊరు చుట్టూరానో, జిల్లా దాటకుండానో ఉండాలి. మన ఆడవాళ్ళూ అంతే! ఇంట్లో పెద్ద పెద్ద కబుర్లు చెప్పే మీ చెల్లెలు ఒంటరిగా మీ

ఊరికి ఒక్కసారైనా వచ్చిందా? "

"అవును, దానికి రావాల్సిన అవసరమే ముంది. అవన్నేమో కాని నాకు శీను చదువు గురించే ఆరాటముందిప్పుడు. వాన్ని బాగా చదివించాలి. కాని, ఇక్కడ చదువంతంత మాత్రమే. కరీంనగర్‌లాంటి చోట ప్రవేట్ బళ్ళో వేద్దామంటే అంత ఖర్చు భరించడం నావల్లకాదు..."

"ఏంశీను, నువ్వు బాగా చదవడం లేదా...? మీ బాపుకు నీ చదువు రంది పట్టుకుంది. పుత్రోత్సాహంబు పద్యం వచ్చు కదా! నువ్వెందుకు మంచిగా చదువుకోవడం లేదు? "

"మంచిగనే చదువుకుంటున్ననంకుల్. నాకు మంచి మార్కులే వస్తున్నయి"

"అంకుల్, ఆంటీల సంస్కృతి ఇక్కడి దాకా వస్తోందా బావా! చాలా ఏండ్లనుంచి నన్ను చూస్తోంది గదా అక్కయ్య. ఈ ఇంటికి అల్లున్ననో లేక చదువుకొని ఉద్యోగం చేస్తున్నాననో నన్ను మీరు అంటుంది. అలా పిలువవద్దని చెప్పాననుకో. నామట్టుకు నాకు మామయ్య, అన్నా, తమ్మీ అని వరుసలు పెట్టుకొని పిలువడంలో ఉన్న అనుబంధం, ఆప్యాయత మరి దేంట్లోనూ కనబడదు. అంకుల్, ఆంటీ పిలుపులు మనుషులను దూరంచేస్తున్నట్టనిపిస్తాయి"

"అవును బావా! చదువుకున్నవాళ్ళు పెరుగుతున్నకొద్దీ కృత్రిమత్వం పెరుగుతోందేమోననిపిస్తుంది. ఒరే శీనూ! మామయ్యను అంకుల్ అని పిలువుమని ఎవరు చెప్పారు? " అన్నాడు అయిలయ్య.

"నాకెవ్వలు చెప్పలేదు నాన్నా! అంకుల్ అన్నా, మామయ్యన్నా ఒక్కటేకదా అని నేనట్టపిలిచిన..."

"సరేకాని మీ బళ్ళో చదువెలా ఉంది? "

"చాలామంది సార్లు రోజూ కరీంనగర్ నుంచొస్తరు మామయ్యా! రోజూ లేటే, ఎవ్వరు సరిగ్గా చెప్పరు"

"ఇంకొంతమంది ఊరివాళ్ళే, చుట్టుపక్కలవాళ్ళే ఉన్నరు. చాలామందికి ఇల్లుకంటే గుడి పదిలం బడికి రావడం మొక్కుబడికే. వాళ్ళకు ఇంటిపనులే ముందు కావాల్సింది"

"పోనీ వచ్చినవాళ్ళైనా బాగా చెబుతారా? "

"చెప్పేవాళ్ళు చెప్పుతరు, లేనివాళ్ళులేదు. మా సార్లు పిల్లగండ్లతోనే సిగిరెట్లు తెప్పించుకుంటరు, పాకాడతరు, నేజూసిన..."

"అవును బావా! శీనన్నది నిజమే. తాళ్ళళ్ళకుపోయి కల్లుదాగే సార్లు గూడ కొందరున్నరు. కొందరు బాగానే చెప్పినా పిల్లలు వినరు"

"సార్ల నిర్లక్ష్యం, వ్యాపార మనస్తత్వం, పిల్లల్లోని అరాచకత్వం ఇవన్నీ చదువులను పాడుచేస్తున్నాయంటావు"

"ఊరు గూడా నాయకుడులేని తండోలయింది. మరి శీనును కరీంనగర్‌లో ఏదైనా ప్రవేట్ బళ్ళో వేయమంటావా? "

"అన్ని ఖర్చులు నువ్వు భరించలేవు. నీ స్థితి నాకు తెలియందికాదు. ఇద్దరాడపిల్లలు పెళ్ళిళ్ళకెదుగుతున్నారు. పోగా పిల్లలను చిన్నతనంలో తల్లిదండ్రులనుంచి దూరంగా ఉంచకూడదు. అక్కడున్న సమస్యలక్కడున్నాయి. నువ్వే కొంత శ్రద్ధ తీసుకో వీలైనప్పుడు. శీను కొంతెదుగుతే వానికే శ్రద్ధ పెరిగి బాగానే చదువుకుంటాడు. పోగా శీను ఇక్కడుంటే అప్పుడప్పుడు పనికుపయోగపడతాడు గదా"

"ఆ మాటా నిజమే..." అన్నాడు అయిలయ్య.

"బాగా రాత్రయింది. ఎంతసేపని మాట్లాడకుంటుంటరు? శీను కూరుపట్లు కుక్కుతండు. సాంబన్న ఎక్కన్నుంచి వస్తున్నడో ఏమో? అలిసిపోలేదా? పొద్దుగాల మాట్లాడుకోవచ్చు పడుకోండ్రి" అంది శాంతమ్మ.

"నీకు మీ తమ్ముని మీదున్న సానుభూతి నామీద లేదు. నేను పొద్దంతా ఎద్దు ముడ్డి

పొడిచే పనిచేస్తేనేమో అలిసిపోలేదు. బస్సులో కూర్చొని వచ్చిన మీ తమ్ముడేమో అలసిపోయిండా?" అన్నాడు అయిలయ్య నవ్వుతూ.

ఇద్దరికీ మంచాలు సర్దింది శాంతమ్మ.

శ్రీనివాస్ తండ్రి మంచంలో పడుకున్నాడు. అయిలయ్య కూతుర్లిద్దరూ గుర్రు కొట్టి నిద్రపోతున్నారు.

అయిలయ్య, సాంబయ్య పక్కపక్క మంచాల్లో పడుకున్నారు. వాళ్ళెంతసేపు మాట్లాడుకుంటున్నా వాళ్ళమధ్య మాటలు తరగడంలేదు. ఆత్మీయులైన ఆ బావాబావ మరదుల మధ్య మాటలకు కొదువలేదేమో!

"సరేగానిబావా! నేను వ్యవసాయం చేస్తూ బాగా బతుకుతున్నానని చెప్పడంలేదుకాని నువ్వు కూడా ఊళ్ళో కొంత భూమి కొను. ఎప్పటికైనా భూమి విలువ భూమికే ఉంటుంది. ఎంతుద్యోగమున్నా భూముండటం మనలాంటివాళ్ళకవసరమే" అన్నాడు అయిలయ్య.

"నాకూ భూమంటే ప్రేమే బావా! ఇంకొంత భూమి కొనాలనే ఉంది. కాని ఊళ్ళో భూమి కొనడం మీ చెల్లెలికిష్టంలేదు. మా అమ్మానాన్నలకు కూడా ఇష్టమున్నట్టు కనబడదు"

"భూమితో పడుతున్న పాట్లను అనుభవిస్తుండటంవల్ల మీ నాన్న నిన్ను భూమికి దూరంగా ఉంచాలని చూస్తున్నాడేమో! నిజానికి భూమిలో లాభమేంలేదు. కేవలం వ్యవసాయంతో బాగా సంపాయించిన్నవాళ్ళే కొంత సంపాదించుకున్నారు..."

"నువ్వన్నదాంట్లో నిజం లేకపోలేదు. కాని, మన ఊరి కాపుదనపోల్లను చూడు, వాళ్ళలో చాలామంది ఒకప్పుడు దొరలకు పాలేర్లుండి బతికినవాళ్ళే. ఇప్పుడొక తీరుగా బతుకుతున్నారా? లేదా? కొందరయితే ఒక రిద్దరు పాలేర్లను కూడా పెట్టుకున్నారు.. తమ పిల్లల్ని మంచి చదువులు చదివించుకుంటున్నారు. వాళ్ళంతా వ్యవసాయం చేసుకుంటూనే బతికారు. ముఖ్యంగా చిటాటుకాపులు"

"వాళ్ళేదో గొప్పగా బతుకుతున్నారనుకుంటే పొరపాటే. వాళ్ళేమాత్రంగానైనా బతకడానికి వెనుక ఎంత తపన, వేదనుందో నాకు తెలుసు. వాళ్ళు ఏండ్ల తరబడి తపస్సులా చేసిన శరీరకష్టం వాళ్ళనో స్థితికి తీసుకువచ్చింది. వాళ్ళలో ఇంటిల్లిపాదీ ఒళ్ళు దాచుకోకుండా మట్టిలో మట్టయి పని చేస్తూనే ఉంటారు. ఇప్పటికీ అంతే! తమ చెమటనంతా నేలకే అంకితం చేశారు. అన్ని సరదాలను వదులుకొని పండుగ, పబ్బం అనకుండా పనికే అంకితమై కష్టించారు. ఈరోజు కడుపునిండా తిండైనా తినగలుగుతున్నారు. తన పిల్లల్ని చదివించుకోగల్గుతున్నారు. అయినా వాళ్ళకున్న కొన్నెకరాల భూమి నమ్మినా కరీంనగర్‌లో ఒక కుంట ఇంటిజేగ రాదన్న విషయం మరిచిపోవద్దు. ఉద్యోగి బాగా సంపాదిస్తున్నాడని అనడంలేదుగాని ఓ వ్యవసాయదారుడి ఆదాయం ఆఫీసులో చెపరాశి ఆదాయంకంటే కూడా తక్కువేనన్నది నిజం..."

"నేనా విషయం కాదనడంలేదు. కాని మన ఊరి దొరలు కొందరు భోగలాలసతకు, దురలవాట్లకు మరిగి సర్వం పోగొట్టుకుంటే మరికొందరు ఉద్యమకారుల ధాటికి తట్టుకోలేక ఊళ్ళొదులుతున్నారు. మన పట్వారి కొడుకుల్లో ఒక్కడు కూడా పేరుకొచ్చే సూచనలు కనబడటంలేదు. అయ్యకు పుట్టిన నలుగురు పరమ భాగవతులన్నట్టుంది వాళ్ళ సంగతి. సరెకాని బావా, మనం ఎక్కడ మొదలుపెట్టి ఎక్కడికొచ్చాం?"

"మాట్లాడుతూ పోతుంటే ఎన్నో విషయాలు దొర్లడం మామూలే"

"నిజమే. కాని మానాన్న నన్ను ఊరికి దూరంగా ఉండమనడం నువ్వన్నట్టు భూములవల్ల లాభం లేకపోవడంవల్ల కాద

నుకుంటాను. మా చెల్లికి మా భూమి ఉపయోగపడాలన్న ఉద్దేశ్యంవల్లనేమో" అన్నాడు సాంబయ్య.

"ఆమాట నిజమేకాని మీరేమనుకోనంటే ఓ నిజం చెబుతాను. ఉద్యోగరీత్యా ఊరికి దూరంగా ఉన్న మీరు మీ తల్లిదండ్రులను ఆపదలో ఆదుకోవడం కొంత ఇబ్బందే అవుతుంది. అదే మీ చెల్లె పక్కఊర్లోనే ఉంటుంది కాబట్టి వాళ్ళకన్ని విధాలుగా అందుబాటులో ఉంటుంది. మా చెల్లేమో లోకం పోకడలను అర్థంచేసుకున్నదికాదు. ఏ విషయాన్నైనా కుండబద్దలు కొట్టినట్టే అనేస్తుంది. ఆమె మీవాళ్ళను హృదయపూర్వకంగా తనవాళ్ళుగా స్వీకరిస్తుందనుకోను. అలాంటప్పుడు మీ వాళ్ళకు మీ చెల్లెను తోడునీడగా ఉంటే ఉండనివ్వండి. మీ నాన్న సొమ్ము తింటే తింటుంది. అయినా మీకున్నది పెద్ద ఆస్తేంకాదుగదా! నాకు తెలిసినంతవరకు మీ నాన్న ఆస్థిలోంచి మీకు పెద్దగా రాదనుకుంటాను. పరిస్థితులను చూస్తే అలా అనిపిస్తుంది."

ఆ మాటలు సాంబయ్యకు బాధాకరంగానే ఉన్నా అందులోని సత్యం మాత్రం కళ్ళ ముందు కదులుతోంది.

"పోనియ్ బావా! వస్తే వస్తుంది లేకుంటే లేదు"

"మీ జాగ్రత్తలో మీరుండండి. ఎన్నో సమస్యలకు కాలం పరిష్కారం చూపుతుంది బాగా రాత్రయింది. పడుకుందామిగ. తెల్లవారితే పంద్రాగష్టు. రేపుండిపో..."

"రేపెలాగూ సెలవుదినమే. అందుకే ఉండిపోదామనే వచ్చాను, మళ్ళీ దసరా వరకు రావడం కుదరదు"

"మీరెప్పుడొచ్చినా, రాకున్నా దసరా, సంక్రాంతి పండుగల కయితే తప్పకుండా రావాలి. ఇవి మనకు పెద్ద పండుగలు. బతుకమ్మ పండుగ అన్నిటికంటే పెద్ద పండుగ..."

"మీరు రావద్దన్నా ఆ పండుగలకు తప్పకుండా వస్తాము. ఈ పండుగలప్పుడు పాత మిత్రులెందర్నో కలుసుకోవచ్చు కడుపు నిండా మాట్లాడుకోవచ్చు"

అయిలయ్య మాట్లాడుతూనే నిద్రలో కొరిగాడు.

"తానెందుకు కుటుంబానికి దూరమవుతున్నాడు? తన చదువే తనను కుటుంబానికి దూరం చేస్తోందా? అమ్మానాన్న వాళ్ళ తరం, తమతరంలోని అంతరాలు తమ మధ్య దూరాన్ని పెంచుతున్నాయా? ఈ సమస్య తానొక్కడిదేనా? తనలాగే చాలా మందే ఉన్నారా? "

రకరకాలుగా ఆలోచిస్తూ ఆగస్టు పదిహేనవ తేదీ ప్రవేశించి అరగంటదాటిన తరువాతకాని నిద్రపోలేదు సాంబయ్య.

తెల్లవారకముందే బావా, బావమరుదులిద్దరు నిద్రలేచి మాట్లాడుకుంటూ చెరువు దిక్కెళుతున్నారు.

కాలకృత్యాలు తీర్చుకోవడానికిప్పటికీ ఊరి బయటికెళ్లడమే ఉంది. కొందరు సంపన్న కుటుంబాలవాళ్లు ఇంటి పక్కన మరుగుదొడ్లు కట్టుకున్నారుకాని శ్రామిక కుటుంబాలవాళ్లు చెంబు పట్టుకొని ఊరు బయటకెళ్లడమే చేస్తుంటారు.

సాంబయ్య, అయిలయ్య కాలకృత్యాలు ముగించుకుని చెర్లో స్నానం చేశారు. ఇంటికొచ్చేసరికి శాంతమ్మ అటుకులు పోపు చేసుంచింది. ఈలోగా పిల్లలు తయారై బడికిపోయారు. అయిలయ్య ఇంట్లో రోజూ టిఫిన్ చేసుకోరు. మూడు పూటలా అన్నమే తింటారు. సాంబయ్య లాంటివాళ్లు ఇంటికొచ్చినప్పుడు మాత్రం టిఫిన్ చేస్తారు.

టిఫిన్ చేసి టీ తాగారిద్దరూ!

"బావా! ముందు మీరు మీ ఇంటికెళ్లి మీ అమ్మానాన్నలతో మాట్లాడిరండి. ఆ తర్వాత బడి దిక్కుపోతే స్వాతంత్ర్య దిన వేడుకలవీ చూడవచ్చు నేను నాగలి కట్టుకొని

పోతాను. భోజనాల సమయం వరకు మాత్రం మీరిక్కడికే రండి. రాత్రి మీ ఇంట్లో భోంచేయొచ్చు. కోణ్ని కోపిస్తున్నా. ఈ రోజు పనికి పోకుండా ఉందామంటే ఉండి చేసేదేముందనిపిస్తోంది. పైగా పను లున్న కాలం. నాట్లు చివరి దశకొచ్చినయి. మనకు పోచంపాడు కాలువనీళ్లు తొందర గానే వస్తాయంటున్నారు. అవొస్తే మన బాధలు కొంతైనా పోతాయి" బారెడు జోళ్లు, ముల్లుకర్ర చేతిలోకి తీసుకుంటూ అన్నాడు అయిలయ్య.

"మనకు సంవత్సరంలోపునే పోచంపాడు నీళ్లు వస్తాయంటున్నారు. మెట్‌పల్లి, కోరుట్ల దిక్కొచ్చాయి. మనది తెలంగాణ నడిగడ్డ ప్రాంతం. ఒకవిధంగా మనం అదృష్టవంతు లమే అనుకోవచ్చు. కోస్తా ప్రాంతం వాళ్ల కున్న వరదలు, తుఫాన్ల బెడద మనకు లేదు" అన్నాడు సాంబయ్య.

అయిలయ్య ఎడ్లను విడుచుకొని పోవడా నికి కొట్టం దిక్కు వెళ్లాడు.

సాంబయ్య డ్రస్ చేసుకుని ఇంటికెళ్లాడు. మంచంలో కూర్చొని చుట్టతాగుతున్న లసు మయ్య ముఖం మాడ్చుకున్నాడు. ఊళ్లోకి రాత్రనగా వచ్చిన కొడుకు రాత్రంతా అత్తవా రింట్లో ఉండి ఇప్పుడు తన దగ్గరికి రావడం కోపంగా ఉందతనికి.

తండ్రి పక్కనే మంచంలో కూర్చున్నాడు సాంబయ్య.

"మేం యాదికున్నమా బిడ్డా?" నిష్ఠూ రంగా అన్నాడు లసుమయ్య.

"చదువుకున్న పెండ్లామాయె. బంగార మోలె చూసుకునే బామ్మరిదాయె. బంగ్లా లుండె నౌకరాయె. ఇగ మనమేడ యాది కుంటం"

తల్లి మాటలు సూటిగా తగిలాయి సాంబ య్యకు.

"అమ్మా! ఇలాంటి సూటిపోటి మాటలని నన్నెందుకు బాధపెడ్తారు? బస్సొచ్చేసరికి రాత్రయింది. ఇంట్లో ఉండేది మీరిద్దరే నాయె. రాత్రి నా కోసం వంటనీ అదనీ తిప్పలు పడతారని అయిలయ్య ఇంటికి పోయాను. దీనికి మీరు కథలల్లితే నేనేం చేసేది?"

కొడుకు కోపానికి రావడం చూసి లసు మయ్య, వెంకమ్మ కొంత తగ్గారు "ఎంతైన పెండ్లయిందంటె పెండ్లాం బెల్లం తల్లిదండ్రు లల్లమైపోతరు. ఇదిప్పుడు లోకంల నడు స్తున్న రీతి"

"అమ్మా! లోకం రీతే అదయినప్పుడిగ నన్ను అనవలసిన అవసరమేముంది. అంద రితోపాటు నేనున్నట్టేకదా"

"అనవలసిన అవసరమేం లేదు బిడ్డ! కాని నోరాగది గద. మా బాధలు మావి. మా కడుపుకోత మాది. నిన్ను కోటొక్క తవుసులు పట్టి కన్నం బిడ్డ. ముగ్గురు పిల్ల గండ్లు పురుట్లనే పోతె సాంబయ్యని పేరు వెట్టినం. ఒక్కనివే కొడుకువని వొళ్లెవెట్టు కొని సాదుకున్నం. ప్రేమగ పెంచుకున్నం. మా నుంచి కాకున్నా చదివించినం. అయి తేమైంది బిడ్డ. ఇయ్యాల్ల మేం నీకు కానోల్ల మైనం... ఈనగాచిన చేనును నక్కలపాలు చేసినట్టవుతుంది బిడ్డ ముసలోల్ల పని" అన్నాడు లసుమయ్య.

తల్లిదండ్రుల మాటలు శూలాల్లా తాకుతు న్నాయి సాంబయ్యకు. కొద్ది సేపాప్యా యంగా మాట్లాడి వాళ్లనోదార్చాడు.

తర్వాత కుశల ప్రశ్నలవీ వేశాడు లసు మయ్య. కోడలు గూర్చి మనుమణ్ని గూర్చి అడిగారిద్దరు.

అన్నిటికీ ఓపికగా సమాధానం చెప్పాడు సాంబయ్య. కాలమంతెట్లనో ఉన్నది బిడ్డ. బట్టగాల్చి మీదేసే కాలం. నీ పని నువ్వు జూసుకో. ఎవ్వల జోలికి పోకు"

ఓ దిక్కు నిష్ఠూరంగా మాట్లాడటం, మరో దిక్కు తన బాగోగుల గూర్చడగటం... తల్లి దండ్రులనెలా అర్థం చేసుకోవాలో తెలి యడం లేదతనికి. కొద్దిసేపేవేవో మాట్లాడు

కున్నారు.

"ఊరవతలికి పాయఖానకు పోవుటానికి మీ నాయనకు కష్టమైతంది. ఓ పాయఖాన కట్టించలేవు బిడ్డ. ఏ పాటి పైసలైతయి. రాత్రయితె పెంటబొందల్నే పోతండు" అంది వెంకమ్మ.

ఉన్న పొలంపై వస్తున్న ఆదాయాన్నేం చేస్తున్నారని అడగాలనుకొని తల్లిదండ్రులు బాధపడ్తారని ఊర్కున్నాడు సాంబయ్య.

"సరేనమ్మా! చూస్తాను" అన్నాడు.

"అంబటాల్లయింది. కాళ్లుసేతులు కడుక్కోపో... అన్నం తిందాం. నువ్వొచ్చినవని పొద్దున్నే తెల్సింది. గుడ్డుకొచ్చిన కోడ్ని దొరుకవట్టి కోయిమన్న చాకలి కొమరయ్యను. అప్పటికే కోళ్ల నిడ్సిపెట్టింది మీ అమ్మ. దాన్ని దొరకవట్టుటానికి గంటసేపైంది. వాడంత తింపింది కోడి. కూరుడుకుతుంది, కొంచెమాగి తిందాం"

తనకోసం అయిలయ్య కోడ్ని కోస్తాడంటే ఇంకా నిష్టూరాలాడుతారని సరేనన్నాడు సాంబయ్య. అయిలయ్యకేదో విధంగా సర్ది చెప్పవచ్చనుకున్నాడు.

"అదుగో జెండావందనం ఊరేగింపొస్తోంది. నేను బడి దగ్గరిదాక పోయొస్తా. వచ్చింతర్వాత తింటా. తొందరగానే వస్తా" అని లేచి నిల్చున్నాడు. బజార్లోకొచ్చి నిల్చున్నాడు.

బోలో స్వతంత్ర భారత్‌కీ జై
జై బోలో మహాత్మాగాంధీకి జై
జై బోలో పండిట్ నెహ్రూకి జై

నినాదాలతో పాఠశాల విద్యార్థులు స్వాతంత్ర్య దినోత్సవ ఊరేగింపు జరుపుతున్నారు.

మూడు రంగుల జెండ ముచ్చటైన జెండ
ధర్మచక్రముతోడ తేజరిల్లెడు జెండ...

పాటలు పాడుతూ నడుస్తున్నారు విద్యార్థులు.

అన్నలు సాతంత్ర్య దినాన్ని బహిష్కరించమని పత్రికల్లో ఇవ్వటం జ్ఞాపకం చేసుకున్నాడు సాంబయ్య.

ఊరేగింపులో పిల్లలతోపాటు నడుస్తున్న తిరుపతయ్య సారు సాంబయ్యను చూసి దగ్గరికొచ్చి నిల్చున్నాడు. నమస్కారం చేశాడు.

ప్రతి నమస్కారం చేశాడు సాంబయ్య.

"ఎప్పుడొచ్చారు సార్?" అన్నాడు.

"రాత్రే"

"రండి బడిదాక పోదాం. ఇక్కడ చేసేదేముంది?"

ఊరేగింపు పాఠశాలను చేరుకుంది. ఊరి పెద్దలు కొందరు సర్పంచ్, పట్వారీ, పోలీసు పటేలు, విద్యాకమిటీ ప్రెసిడెంట్ మరి కొందరు అక్కడికొచ్చారు.

సర్పంచ్‌తో జెండా నెత్తించారు. స్వాతంత్ర్యదిన ప్రాముఖ్యతను గూర్చి, స్వాతంత్ర పోరాటంలో నాయకుల బలిదానాల గూర్చి, గాంధీ పాత్ర గూర్చి మాట్లాడుతున్నారు వక్తలు.

సర్పంచ్‌లేచి నిల్చొని మాట్లాడటం ప్రారంభించాడు.

"ఎంతోమంది త్యాగాల ఫలితం మన స్వాతంత్రం. స్వాతంత్ర్య పోరాట కాలంలో గాంధీజీ ఎదురులేని నాయకుడై నిలిచాడు. అహింసను ఆయుధంగా స్వీకరించి స్వాతంత్ర్య పోరాటాన్ని నడిపించాడు. అయితే ఆ గాంధీగారే హత్యకు గురయ్యాడు.

ఇప్పుడున్న పరిస్థితులను చూస్తే గాంధీగారి ఆత్మ క్షోభించక మానదు. తీవ్రవాదం పురివిప్పి నాట్యం చేస్తోంది. బుద్ధుడు పుట్టిన నేలలో, గాంధీ పెరిగిన భారతావనిలో హింస రాజ్యమేలుతోంది. యువతరం ఈ పరిస్థితుల గూర్చి శ్రద్ధ వహించాలి"

సర్పంచ్ ఉపన్యాసం సాగుతోంది. పదవ తరగతి విద్యార్థి లేచి నిల్చున్నాడు. "ఉన్నోల్లు హింస జేస్తె మంచిదేనా సార్.. లేనోల్లు తిరుగబడితది హింసనా?"

అన్నాడు.

ఆ మాటలకందరూ నోళ్లు తెరిచారు. పదవ తరగతి విద్యార్థంత లోతుగా ఎలా మాట్లాడగలిగాడో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు సాంబయ్య

ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండానే కూర్చున్నాడు సర్పంచ్‌గారు.

"ఇప్పుడు మన పాఠశాల పూర్వ విద్యార్థి సాంబయ్య మాట్లాడుతారు"

హెడ్ మాస్టరనగానే నిల్చోక తప్పలేదు సాంబయ్యకు.

"మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి ముప్ఫయ్యేళ్లు దాటింది. అనంత కాలంతో పోలిస్తే ఈ మూడు దశాబ్దాలు పెద్ద కాలమేం కాకపోవచ్చు కాని దేశంలో కొంతవరకైనా మౌలిక మార్పులవీ రావడానికి ఈ కాలం తక్కువేం కాదు. కొన్ని మార్పులొచ్చినా కుల, మత, ప్రాంతీయ, భాషా భేదాలు రోజురోజుకూ తీవ్రతరమవుతుండటం శోచనీయమే. ప్రతి రాష్ట్రంలో ఏదో సమస్య తలెత్తుతూనే ఉంది. వీటన్నిటినీ మనం జాగ్రత్తగా గమనించాలి.

"ఒకప్పుడు నేనీ పాఠశాల విద్యార్థినే. స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలంటే ప్రజల్లో, విద్యార్థుల్లో అప్పుడెంతో సంబరముండేది. అందరూ పాల్గొనేవారు. 15 ఆగష్టు, 26 జనవరి అందరినీ కలిపివుంచే పండుగలు, క్రమక్రమంగా ఈ పండుగలంటే ఉత్సాహం తగ్గుతున్నట్టనిపిస్తోంది. ఇందుక్కారణం స్వాతంత్ర్య ఫలాలు అందరికీ అందకపోవడంకావచ్చు. స్వాతంత్ర్యంవస్తే ఎన్నో జరుగుతాయని ఊహించుకున్న జనాలకు చాలా వరకు ఆశాభంగమే జరిగినట్టనిపిస్తుంది. అందుకేనేమో ఈ నిర్లిప్తత. అయినా స్వాతంత్ర్యం స్వాతంత్ర్యమే. ఎంతోమంది త్యాగఫలం. భావిభారత పౌరులైన విద్యార్థులు మన జాతీయ నాయకులను ఆదర్శంగా తీసుకొని ముందుకు పోవాలి. రేపు మీలోంచే గాంధీ, నెహ్రూ, టాగూర్, భగత్ సింగ్‌లంతటి వాళ్ళు రావచ్చు. మన స్వతంత్రం..."

ఓ విద్యార్థిలేచి నిల్చోగానే మాట్లాడటమాపాడు సాంబయ్య. " స్వతంత్రం స్వతంత్రమని పరవశించిపోతున్నరు. మనకు స్వతంత్రమచ్చిందా సారు. తలలు మారినయికాని తలరాతలు మారినయా...? "

హైస్కూల్ విద్యార్థినుంచి అంత సీరియస్ మాటలు రావడానికి గల మూలాలు ఆ ప్రాంతంలో జరుగుతున్న పోరాటాలేనన్న విషయం అర్థం చేసుకున్నాడు సాంబయ్య. పోరాటాల ప్రభావాన్ని అంచనా వేశాడు.

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే కూర్చున్నాడు.

ఆ విద్యార్థి కూడా మళ్ళీ ఆ ప్రశ్న అడగలేదు.

దేశంలోని పరిస్థితుల గూర్చి, దేశభక్తి గూర్చి చదువుల ప్రాముఖ్యత గూర్చి తెలుగు ఉపాధ్యాయుడు ఉపన్యసించాడు. విద్యార్థుల్లో చిన్నగా కలకలం మొదలయినా తన ఉపన్యాసాల్ని కొనసాగించాడు.

ప్రధానోపాధ్యాయుడు లేచి అందర్నీ ఉద్దేశించి మాట్లాడసాగాడు.

"స్వతంత్రం వచ్చిందో రాలేదో, ఈ చదువులు కూడు పెడతాయో లేదో చర్చించుకోవాల్సిన వేదిక ఇదికాదు. యువతరం, ఇప్పుడిప్పుడే యౌవనదశలోకి అడుగుపెడ్తున్న విద్యార్థులు ఓ విషయాన్ని జ్ఞాపకముంచుకోవడం మంచిది. మీలో ఉరకలు వేస్తున్న ఆవేశాన్ని తప్పుమార్గం పట్టించవద్దు. మనం నేలవిడిచి సాము చేయకూడదు. మనదేశ పరిస్థితులను, సంస్కృతీ సంప్రదాయాలను, దేశ వాతావరణాన్ని దృష్టిలో పెట్టుకొని మనకేది సరిపోతుందో నిర్ణయించుకోవాలి. ఏదేమైనా మీలో కొందరు ఇంత చిన్న వయసులోనే అంత పెద్ద విషయాల గూర్చి ఆలోచిస్తూ తీవ్రవాద భావజాల ప్రభా

# పఠనముత్యాలు

★ పార్టీ విధానాల నీడలో దేశభక్తి సమాధి అవుతుంది.

—సెయింట్ సీరే

★ వివేకం వుంటే వేరే రక్షణలేవీ అక్ఖరలేదు.

—జువెనెల్

★ ప్రతీకారం నేలబారు మనుషుల క్షణికానందం.

—జువెనెల్

★ పొరపాటు చేశానని ఒప్పుకోవడానికి సిగ్గుపడకూడదు.

—పోప్

★ మంచిపనులకు సదుద్దేశాలు చెట్లకు వేళ్లవంటివి.

—జె.టేలర్

★ తిరుగుబాట్లను ఎవరూ సృష్టించరు. వాటి పునాదులు గతంలో వుంటాయి.

—వెండెల్ ఫిలిప్స్

★ యోగ్యులు అధికారంలో వున్నప్పుడే దేశంలో శాంతి భద్రతలు వుంటాయి.

—పిథాకస్

★ అంతరంగం అందంగా వుంటే ఆచరణ అర్థవంతంగా వుంటుంది.

—సోక్రటీస్

★ మనస్సులో సమదృష్టి లోపించిననాడు ఇక తన పతనం ప్రారంభమయిందని గ్రహించవలెను.

—తిరుక్కురళ్

★ దుర్బుద్ధి తాను నింపిన విషపాత్రలో సగం తానే తాగుతుంది.

—సెనెకా

★ మంచిపని వాయిదావేయడంవల్ల దాని ప్రయోజనం దెబ్బతింటుంది.

—బార్టన్ పెర్రీ

★ ఇతరులు చేసిన పనివలన మీకు కష్టం, నష్టం కలిగితే ఆ పనిని మీరు ఇతరుల పట్ల చేయకండి.

—మహాభారతం

★ ఇతరుల స్వేచ్ఛను నిరాకరించే వ్యక్తులు తాముకూడా స్వేచ్ఛకు అనర్హులే.

—అబ్రహాం లింకన్

★ అవినీతికి పాల్పడిన వారికి చివరికి మిగిలేది ఆవేదన, అవమానాలే.

—సిమ్సన్. సి.

★ జనం ఎవరిని చూసి భయపడతారో వారిని ఎన్నడూ ప్రేమించలేరు.

—అరిస్టాటిల్

—సేకరణ : కొట్టగడ్డ వెంకట్రావు

వంలో పడుతున్నారు. మీరిలా చేస్తున్నం దుకు సంతోషించాలో, విచారించాలో నాకర్థం కావడంలేదు. దయచేసి విద్యార్థులుగా నున్న సమయంలోనైనా మీరితర విషయాల జోలికి పోకండి. చదువుపైన్నే దృష్టి నిలుపండి. మీపై ఎన్నో ఆశలు పెట్టుకున్న మీ తల్లిదండ్రుల ఆశలను వమ్ము చేయకండి. మీకు చదువు తప్ప మరేజోలీ ఉండకుంటేనే మంచిదని నా అభిప్రాయం.

"ఎందుకో నాకిప్పుడు ఎన్నో సంబంధాలు భగ్నమవుతున్నాయనిపిస్తోంది. ఇంతకు ముందు ప్రజల్లో ఉండే సహజీవనానికి భంగం కలుగుతుందేమో ననిపిస్తోంది. భావిభారత పౌరులైన మీ చేతుల్లోనే ఉందీ దేశం"

కలగా పులగంగా ఎన్నో విషయాలు మాట్లాడి విరమించుకున్నాడాయన. తర్వాత కొబ్బరిముక్కల ఫలహారం, మిఠాయి వచ్చిన వాళ్లందరికీ పంచాడు. గ్రామాల్లో వస్తున్న మార్పులు, మారుతున్న విలువలు, ఆలోచనా విధానాల గుర్చి ఆలోచిస్తూ ఇంటికెళ్లాడు సాంబయ్య.

బావిదగ్గరికి పోయి కాళ్లు చేతులు కడుక్కొచ్చుకున్నాడు. తండ్రితో కలిసి భోజనం చేశాడు.

పక్కూర్లో ఉంటున్న చెల్లెలొస్తే చాలాసేపు మాట్లాడాడు. పాత మిత్రులను కలుసుకొని మాట్లాడాడు.

మధ్యాహ్నం దాటింతర్వాత అయిలయ్య ఇంట్లో భోజనం చేశాడు. తండ్రి దగ్గరికొచ్చాడు.

ఈ వయసులో ప్రశాంతంగా ఉండమని ఎన్నో విధాలుగా చెప్పాడు.

"నాన్నా! నేను పోతున్నా బస్సొచ్చే టైమయింది" అన్నాడు.

"ఈ రాత్రికుండి రేపు పోదువు బిడ్డ" అంది వెంకమ్మ.

"ప్రొద్దున బయల్దేరితే డ్యూటీకి అందను. రాత్రి వరకక్కడికి చేరుకోవాలి"

తల్లిదండ్రుల్తో, అత్తవారింట్లో చెప్పి బయల్దేరాడు సాంబయ్య. సాంబయ్య ఇల్లు చేరే సరికి రాత్రి ఎనిమిది గంటలయింది.



ముల్లుకర్ర, పగ్గం అరుగుమీద పారేసి వాల్చున్న మంచంలో కూర్చున్నాడు అయిలయ్య. పొద్దంతా పనిచేయడంవల్ల అలసిపోయిన శరీరాన్ని మంచంలో వాల్చాడు.

మంచం దగ్గరికొచ్చింది శాంతమ్మ.

"బాగలిసి పోయినట్టున్నవుగద! కొంతసేపు పండుకుంటన్నావా" అంది.

"పని మనకెప్పటికున్నదేనాయె. అలసిపోకుంటేమైతది కాని నాతో నేమన్న పనుందా? " లేచి కూర్చుంటూ అన్నాడు అయిలయ్య.

"ఏం లేదుగని గా రామచంద్రం సారెందుకో రమ్మన్నడు. ఓసారి పోయిరా. సాతగాకుంటె రేపుపో"

"సారు దగ్గరికి పోవుటానికి సాతనవుడు మాటేందికాని నన్నెందుకు రమ్మన్నడే సారు? నాతోనేం పని? "

"మన శీనును తీసుకొని రమ్మన్నడట. వాని చదువు గురించేమన్న మాట్లాడ్త డేమొ? "

"అయితె పోవాలి. ఆ సారు చాలా మంచోడు. బడి కోసమెన్నో చేసిండు. ఆ సారువల్లనే ఊరుకు హైస్కూలొచ్చింది. ఆయనకెప్పుడు పిల్లల చదువుల దృష్టే. శీనేడి పిలువు. పొయ్యొస్త. ఈ రోజాదివార మని ఆటకు పోయిండా? "

"అంతేకద! పిల్లలకు ఆటమీదున్న మనసు చదువు మీదేడుంటది? పిలుచుకస్త శీనును" అని.

"శీనూ ఓ శీనూ" కేకేస్తూ బయటకెళ్లింది శాంతమ్మ. ఐదు నిమిషాల్లో కొడుకును వెంటబెట్టుకొనొచ్చింది.

కొడుకును తీసుకొని రామచంద్రం సారింటి దిక్కు నడుస్తున్నాడు అయిలయ్య.

మూడు బజార్లు కలిసే చోటుకు చేరుకున్నాడు. అక్కడ వేపచెట్టు నానుకొనున్న గద్దె మీద చాలామంది కూర్చున్నారు. కొంత మంది నిల్చొనున్నారు.

పద్మశాలీ కులస్థుల పంచాయితీ జరుగబోతోంది. పంచాయితీకి సంబంధించినవాళ్లు, చేసేవాళ్లే కాకుండా పంచాయితీని చూడటానికొచ్చినవాళ్లూ అనేక మందక్కడున్నారు.

"కొడుకును వెంటబెట్టుకొనెటో పోతున్నవయిలయ్యా" కాపు శివారెడ్డి మాటలు విని ఆగాడు అయిలయ్య.

"మా శ్రీనివాసును తీసుక రమ్మన్నడు రామచంద్రం సారు. అటేపోతున్న"

"పోదువు కానట్ల కూసో. గీ పంచాయితీ గమ్మతుంటది"

"వీళ్లు బురికి పిట్టలోలె లేస్తరు. ఏక్దమ్న దిగిపోతరు"

"వీళ్లకోపం వరిగడ్డి మంటోలుంటది. వరిగడ్డి అంటుకోంగనే గుప్మని మంటలేస్తది చూస్తుండంగనే తగ్గుతది"

"ఎట్లయితేందికాని ఈ ఇరవై ముప్పయ్యేండ్లలో ఎంతో కొంత బాగుపడిన వాళ్లలో వీళ్లొకరు. చేనేత సంఘాలని, నవారు సంఘాలని ఇంకేవేవో అని పెట్టి సంపాయించుకున్నరు. కొందరేమొ ఆదిలాబాద్ దిక్కుపోయి సంపాయించుకున్నరు"

"ఎంత బాగుపడ్డా అట్ల పైకొచ్చింది తక్కువే. అప్పటికే కొంత చదువున్నవాళ్లు పైరవీలు చేసుకుంటూ బతికేవాళ్లు అలాంటి సంఘాలతో బాగుపడ్డరు. మగ్గం నేసుకుంట ఉండెటోల్లు అట్లనే ఉన్నరు"

"ఇగో నేనొక్కటి చెప్పుతున్న గిది నిజం. వృత్తని దాన్నే పట్టుకొని ఊగులాడకుంటున్నవాళ్లు బట్టపొట్టను చావు లేకుంట మా బతికింద్రు కాని పెద్దగ పైకి రాలేదు. దందాలు చేసినోల్లే నాలుగు పైసలు సంపాయించుకున్నరు. బట్టలు నేసినోనికంటె అమ్ముకున్నోడు బాగుపడ్డడు. బాగుపడ్తండు. వడ్లు పండించినోనికంటె వ్యాపారం చేసినోల్లు బాగుపడ్డట్టు మొగ్గం గుంటని పట్టుకేడ్సినోల్లు మొగ్గం గుంటల్నే ఉన్నరు" అన్నాడు అక్కడే ఉన్న శంకర్రావు.

"ఆ మాట నిజమే"

"మీ ముచ్చట్లు మీరేనా? పంచాయితి గానిస్తరా? " పద్మశాలీల కుల పెద్దనగానే ముచ్చట్లాపారందరూ.

"ఇంతకీ పంచాయితీ దేన్ని గురించి? " శివారెడ్డినడిగాడు అయిలయ్య.

"ఇంకదేన్ని గురించుంటది? తాగుడు గురించన్న, బొక్కల గురించన్న. ఇప్పుడీ పంచాయితి బొక్కకూర గురించి"

"ఇదెట్లయితదో నాకెరికే" అని కొడుకును తీసుకొని అక్కణ్నుంచి వెళ్లిపోయాడు అయిలయ్య.

అరుగుమీద వాల్చున్న మంచంలో కూర్చొని ఏదో పుస్తకం చదువుతున్నాడు రామచంద్రం సారు. అయిలయ్యను చూసి పుస్తకం మూసి మంచంమీద పెట్టాడు.

"నమస్తే సార్" అని నిల్చున్నాడు అయిలయ్య. ప్రతినమస్కారం చేశాడు సారు.

"ఇటొచ్చి కూచో" అన్నాడు. రామచంద్రంకు కొంచెం దూరంలో మంచం పట్టె మీద కూర్చున్నాడు అయిలయ్య. శ్రీనివాస్

తండ్రి నానుకొని నిల్చున్నాడు.

మంచంమీదున్న పుస్తకాన్ని చూశాడు అయిలయ్య.

తాను విద్యార్థిగా ఉన్న గత దశాబ్దంలో డిటెక్టివ్ నవలల జోరు బాగా ఉండేది. చాలామంది వాట్ని పుస్తకాల నడుమ పెట్టుకొని చదివేవారు. కరీంనగర్‌లో చదువుకుంటున్న వాళ్లు ఊళ్లోకి తెచ్చేవారు. తానూ కొన్ని చదివే వాడు.

ఆ డిటెక్టివ్ నవలల ప్రవాహం 70లలో మారింది. ఇప్పుడు రచయిత్రుల నవలలు బాగా నడుస్తున్నాయి. ప్రేమకథల, నవలల కాలం నడుస్తోంది. ఆరడుగుల ఎత్తు హీరోల నవలల అమ్మకం బాగా జరుగుతోంది. గ్రామ పంచాయతీ గ్రంథాలయాల్లోనూ ఇవే నవలలు. వీటితోపాటు బెంగాలీ నవలలు కొన్నున్నాయి.

ఆ నవలను చూసి అయిలయ్య పాత జ్ఞాపకాలెన్నో సుళ్లు తిరిగాయి.

"ఏం అయిలయ్యా! ఏదో ఆలోచిస్తున్నట్టున్నావు? "

"ఏం లేదు సార్. ఏవో పాత జ్ఞాపకాలు"

"ఈ నవల్లోలా కలల్లోకైతే పోవడంలేదు కదా"

"అంత వెసులు బాటెక్కడిది సారు. ఇప్పుడు పుస్తకాలు కూడ చదవడమా? ఒకప్పుడు బాగానే చదివేవాన్ని. డిటెక్టివ్‌లతో సహా"

సరేగాని నీకేమొ నీ కొడుకును బాగా చదివించాలనుంది. నువ్వు చదువులో బాగానే ఉండేవాడివి. మీ శీను బాగా చదువుకుంటున్నాడా? వాని చదువు గూర్చి నీకు తృప్తిగా ఉందా? "

"ఓ తీరుగ చదువుతున్నట్టనిపిస్తుంది కాని నాకయితె తృప్తిలేదు. ఇంకా చదవాలి. మీలాంటివాళ్లు కొంత ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకోవాలి సార్. నాకెలాగూ సాధ్యం కాలేదు"

"ఆ విషయం మాట్లాడుదామనే నిన్ను పిలిచాను"

"చెప్పండి సార్... మావాడి చదువుకోసం నన్నేం చేయమన్నా చేస్తాను. నాక్కావాల్సింది వాడు బాగా చదువుకొని పైకి రావడం"

"నీ తపన నాకు తెలుసు అయిలయ్యా! కాని ఇప్పుడు కాలం మునుపట్లా లేదనిపిస్తోంది. రకరకాల ప్రభావాలు పిల్లలపై పడుతున్నాయి. మునుపట్లా ఉపాధ్యాయులను గౌరవించడమూ లేదు. చెబితే వినే వాళ్లే కరువయ్యారు"

"చిన్న పిల్లలు కదాసార్. వీళ్లు అంత దూరం పోలేదనుకుంటాను"

"వీళ్ల గురించే కాదు నేను చెప్పేది టోటల్‌గా కొంత క్రమ శిక్షణా రాహిత్యం వచ్చింది. ఉపాధ్యాయుల మీదికి మర్లవడే విద్యార్థులూ ఉన్నారు. దానిక్కారణం కొంత ఊరి రాజకీయాలు కావచ్చు నేను బడికోసమెంత తపన పడ్డానో నీకు తెలియంది కాదు. అయినా ఊరికి చేసిన ఉపకారం పీనుక్కు చేసిన శింగారమే అన్నట్టయింది. నా మీద ఊరి రాజకీయాలెంత పని చేస్తున్నాయో నీకు తెలుసు. అవన్నీ దృష్టిలో పెట్టుకొని నామీద తిరుగబడుతున్నవాళ్లూ ఉన్నారు.

"ఇవన్నీ నీకెందుకు చెబుతున్నానంటే నువ్వు నీ కొడుకు మీద ఎన్నో ఆశలుపెట్టుకున్నావు. పైకి రావాలని కోరుకుంటున్నావు. అయితే చదువును భగ్నం చేసే ఎన్నో శక్తులున్నాయి. శ్రీనివాస్‌ను గురించి కొంచెం జాగ్రత్తగా ఉండమనే నేను కోరేది"

సారు మాటలకు ఆశ్చర్యం కల్గింది అయిలయ్యకు.

"ఏం జరిగింది సార్... మా వాడేమన్న తిరుగబడుతున్నాడా? చెపుతే వినడంలేదా? పాడు స్నేహాలేమన్న చేస్తున్నాడా? "

ఆందోళన చెందుతూ అన్నాడు.

"అలాంటిదేం లేదు. పసిమనసు...

తెలిసీ తెలియని వయసు. మంచేదో చెడేదో తెలుసుకోలేని పసితనం. కొద్ది రోజులు దొరపిల్లలతో స్నేహం చేశాడు. హరిజన పిల్లల దగ్గర కూచోనన్నాడు. రెండు దెబ్బ లేసి అలాంటి ఆలోచనలు వద్దని చెప్పాను. చిన్న పిల్లలకు ఇలాంటి విషయాలు తెలి యొద్దని ఎంత జాగ్రత్తలు తీసుకుంటున్నా వీటి ప్రభావం పడుతూనే ఉంది"

"ఇన్ని జరుగుతున్నాయా? ఇవన్నీ నాకు తెలియవు సార్? "

శ్రీనివాస్ తలవంచుకొని నిల్చున్నాడు.

"మొన్ననేమొ రిజిస్టర్‌లో నా పేరెందుకు వెనుకుండాలని అడిగాడు. మొదట్నుంచి మన బళ్లో ఫీజులు చెల్లించే అగ్రకులాల వాళ్ల పేర్లు ప్రతి తరగతిలో పైనరాయడం, ఆ తర్వాత ఇతర్ల పేర్లు రాయడం నీకు తెలుసుకదా? "

ఇది సరైంది కాదన్నమాట నిజమే. కాని అలాగే నడుస్తుంది. మెరిట్‌ను బట్టి రాద్దా మంటే కొందరింకా వద్దనే అంటున్నారు. ఇలాంటి విషయాలను శీనులాంటివాడు పట్టించుకోవడం దేనికి? అది వాడి బుర్రలో పుట్టిన బుద్ధేనా? మరేమైనా ఉందా అని నా భయం"

కొడుకుదిక్కు ప్రశ్నార్థకంగా చూశాడు అయిలయ్య.

"నా సోపతికాల్లు అడుగుమంటే అడిగిన. మరి మంచిగ మార్కులొచ్చేవాళ్ల పేర్లను వెనుక రాయడమెందుకు చెప్పు? " అన్నాడు శ్రీనివాస్.

"శీనూ! రామచంద్రం సారు నాగ్గూడ గురువే. ఈసారు మన బడికోసం ఎంతో చేశాడు. సారేది చెప్పినా విను. అయినా చక్కగా చదువుకోవాలిగాని వేలెడంత కూడా లేని నీకీ విషయాలన్నెందుకు? "

ఏంమాట్లాడకుండా తలవంచుకున్నాడు శ్రీనివాస్.

"అయిలయ్యా! శీను తప్పులు చేశాడని నేను చెప్పడంలేదు. ప్రశ్నలు వేయడం తప్పనీ నేననడంలేదు. కాని తాను తెలివిక లవాణ్ణని ప్రదర్శించాలని కొన్ని అతి తెలివి ప్రశ్నలేస్తున్నాడు. తికమక పెట్టాలని చూస్తున్నాడు. నెలరోజుల క్రితమనుకుంటా నేను చరిత్రపాఠం చెబుతున్నాను. పురుషో త్తముడు మహాపరాక్రమవంతుడైన రాజు. గొప్ప వీరుడు. అతని పేరు చెపితే పిట్టలు కూడా నీళ్లు ముట్టేవి కావని చెప్పాను. శీను ఏం ప్రశ్నడిగాడో తెలుసా? అతడు గొప్ప రాజని మనుషులకు తెలుసుకాని పక్షులకేం తెలుసు సార్? అవెందుకు నీళ్లు ముట్టయి? చెప్పినా వాటికర్థం గాదుకదా! అన్నాడు. నేనాశ్చర్యపోయాను. ఇప్పుడే ఎదుగుతున్న వయసు. మన చుట్టూ ఉన్న పరిస్థితులు తెలుసుకదా. ప్రశ్నలు వేసే క్యూరియాసిటీ ఉంటే మంచిదే. కాని ఈ ప్రశ్నలే భవిష్యత్తులో ఎలా పరిణామం చెందుతాయోనన్న భయం. వాణ్ణి పట్టిం చుకో. కొంత జాగ్రత్తగుండు. అందుకే పిలి చాను. నీవు నాకాత్మీయుడివనే ఈ చొరవ తీసుకున్నాను. వాడు చదువులో ఆవరేజ్. చదువుమీద మరికొంత శ్రద్ధ చూపుతే రాంకు రాకున్నా ఫస్టుక్లాసులో తప్పకుండా పాసవుతాడు. బాగా చదివించు" అన్నాడు సారు.

"సారునలాంటి ప్రశ్నలడిగావా శీను"

"మా తెలుగుసారు హేతువాదం గూర్చి చెప్పాడు. అందుకే ఆ ప్రశ్నడిగాను. నాకు వేరే విషయాలేం తెలియవు.

"సారు చెప్పినట్టు విను. పిచ్చి పిచ్చి ప్రశ్న లేయకు"

తలూపాడు శ్రీనివాస్.

కొద్దిసేపు పాఠశాల విషయాలు, ఊరి విషయాలు మాట్లాడుకున్నారు రామచంద్రం సారు, అయిలయ్య.

కొడుకును తీసుకొని ఇంటికెళ్తున్నాడు అయిలయ్య. మూడు బజార్ల దగ్గరికి చేరేస రికి పంచాయతీ పూర్తిచేసుకొని వెళ్ళిపోతు

న్నారు పాలీలు.

"ఏమైందే శివన్న పంచాయితీ"

శివారెడ్డినడిగాడు అయిలయ్య.

"ఏమయ్యేదేముంది? వాళ్ళిద్దరు బావ, బావమరుదులేనాయె. ఒకరి చేతుల్ల ఒకరి చేయి కలిపింద్రు. అందరు కలిసి తాళ్లళ్ళకు పోతంద్రు"

ఆ మాటలకు నవ్వాడు అయిలయ్య.

కొడుకును వెంటబెట్టుకొని ఇంటికెళ్ళాడు.

ఎంత పనున్నా ఎదుగుతున్న కొడుకు గూర్చి కొంతైనా పట్టించుకోవాలనుకున్నాడు అయిలయ్య. అతనిమీద ఏ ప్రభావాలు పడకుండా చూడాలని ఆలోచిస్తూ ఇల్లు చేరుకున్నాడు. అయిలయ్యకు కావాల్సింది తన కొడుకు బాగా చదువుకోవడమే.

★ ★ ★

స్వాతంత్ర్యం వచ్చినప్పట్నుండీ రాష్ట్రంలో ఒక పార్టీ పాలన ఉంది. ఇతర రాష్ట్రాల్లో కొద్దికాలం ఇతర పార్టీలు వచ్చినా తెలుగు ప్రజలు మాత్రం కాంగ్రెస్‌నే కోరుకున్నారు. కేంద్రంలో అధికారంలో ఉన్న జనతా మిశ్రమ పార్టీల ప్రయోగం ఐదేళ్ళు నిండకుండానే విఫలమైంది. ముప్పయ్యేళ్ల తర్వాత వచ్చిన కాంగ్రెసేతర ప్రభుత్వం మూడేళ్లలోనే కూలిపోయింది. మళ్ళీ పార్లమెంటుకు ఎన్నికలు ప్రకటించారు. బహుముఖ పోటీ అనివార్యమైంది. ఇందిరాగాంధి దేశమంతటా సుడిగాలిలా పర్యటించింది. ఆమె ప్రధానిగా కాంగ్రెస్ పార్టీ అధికారంలోకొచ్చింది. రాష్ట్రం కూడా కాంగ్రెస్ ఏలుబడిలోనే ఉంది.

తెలంగాణ గ్రామాలు అగ్నిగుండాల్లా మండుతున్నాయి. దొరల అధికారాలకు బీటలు పడుతున్నాయి. ముఖ్యమంత్రులు మారడాలు, ఎన్‌కౌంటర్‌లు, మతకలహాలు జరుగుతూనే ఉన్నాయి. నీ బాంచెన్ కాల్మొక్తా అంటూ బతికిన ప్రజలే అగ్నికణాలై విజృంభిస్తున్నారు. విద్యాలయాల్లో అన్ని రాజకీయ పార్టీలకు సంబంధించిన విద్యార్థి యూనియన్లతోపాటు రకరకాల కమ్యూనిస్టు పార్టీల విద్యార్థి యూనియన్లు ప్రారంభమయి బలం పుంజుకుంటున్నాయి. మరోదిక్కు బి.జె.పి.వాళ్ల యూనియన్ కూడా బలపడుతోంది.

దాదాపు అన్ని పార్టీల వాళ్లు తమ రాజకీయాల కోసం విద్యార్థులను పావులుగా ఉపయోగించుకోవడం చాలాకాలంనుంచే ఉంది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమకాలం నుంచి అది మరీ ఎక్కువైంది. అయితే విప్లవ కమ్యూనిస్టు పార్టీల యూనియన్లపట్ల విద్యార్థులెక్కువగా మొగ్గుచూపడం మొదలయ్యేసరికి రాజకీయనాయకుల గుండెల్లో రైళ్లు పరుగిడుతున్నాయి. వాళ్లిప్పుడు కొత్త పాట పాడుతున్నారు.

"విద్యార్థులకు రాజకీయాలొద్దు. విద్యనార్జించే విద్యార్థి రాజకీయాలజోలికి పోతే విద్యార్జనకు భంగం కలుగుతుంది. చదువే ధ్యేయంగా బతకాల్సిన వాళ్ళకు రాజకీయాలెందుకు? అందుకే విద్యార్థులంతా రాజకీయాలకు దూరంగా ఉండాలి. చదువుపై మనసులను లగ్నం చేయాలి. ఆవేశపూరిత నిర్ణయాలు తీసుకుంటూ తీవ్రవాదంవైపు మొగ్గు చూపకూడదు" అంటూ ప్రతి సభలోనూ చెబుతున్నారు నాయకులు.

"విద్యార్థులకు రాజకీయాలొద్దా? ఏ రాజకీయాలు వద్దని మీరనేది? మీరు కోరుకుంటున్న రాజకీయాలైతే ఫర్వాలేదుకదా. మీకు పావులుగా ఉపయోగపడేదైతే మంచిదే, అలాంటివాట్ని మీరే ప్రోత్సహిస్తారు. విద్యార్థుల్ని బలిపశువుల్ని చేస్తారు. తెలంగాణ ఉద్యమంలో రెండువందల యాభైమంది విద్యార్థుల్ని బలితీసుకున్నారు. ఆంధ్ర ఉద్యమంలో మరికొంతమందిని. ఓ దిక్కు ఇలా విద్యార్థుల్ని బలిపశువుల్ని చేస్తూనే విద్యార్థులకు రాజకీయాలొద్దనడంలో మీకున్న చిత్తశుద్ధి ఏపాటిది? పాఠశాలలను, కళాశాలలను ఎన్నికల కురుక్షేత్రాల్లా మారుస్తూ

విద్యార్థులకు రాజకీయాలనడంలో అర్థమే ముంది? వీళ్ళు వద్దంటున్న రాజకీయాలె లాంటివో విద్యార్థులు గుర్తించాలి" అంటూ వామపక్ష విద్యార్థి యూనియన్ల నాయకులు వాళ్ళ ఉపన్యాసాలను ఖండిస్తున్నారు.

విద్యార్థిలోకంలో అరాచకమో, చైతన్యమో తెలియని పరిస్థితులున్నాయి. ఈ పరిస్థితు లను, కొడుకు చదువును గూర్చి ఆలోచిస్తూ ఇంటికెళ్తున్నాడు అయిలయ్య. కొఠంలో ఎడ్లని కట్టేసి మేతేసి ఇంటికెళ్తున్నాడు.

ముఖ్యమంత్రులు మారుతున్నా, ఎన్ని సార్లు ఎన్నికలొచ్చినా, ఉద్యమాలొస్తున్నా తనలాంటి వ్యవసాయదారుడి బతుకుల్లో పెద్దగా మార్పు లేకపోవడం గమనిస్తు న్నాడు. ఎన్నాళ్లైనా ఎక్కడేసిన గొంగళి అక్కడేనన్నట్టే ఉండడం చూస్తున్నాడు.

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః

వెంకటస్వామి ఇంట్లోంచి పిల్లలగొంతు వినబడుతోంది. బజార్లోంచి నడిచిపోతున్న అయిలయ్యను పిలిచాడు వెంకటస్వామి.

"నమస్కారం పంతులుగారూ" అని నిల్చున్నాడు అయిలయ్య.

ప్రతినమస్కారం చేశాడు వెంకటస్వామి.

"అలా కూర్చో పోదువుగాని" అరుగుమీద కూచోని కాళ్లు కిందికి చాపుకున్నాడు అయి లయ్య.

కాకు బులుపాల గిలకిస్తే ర్కల్
కాకు నకార పొల్లిస్తే ర్కన్

ఓ విద్యార్థి ముందు చెబుతుంటే ఇంకొం దరంటున్నారు. నలుగురైదుగురు పిల్లలు ఎక్కాలు బట్టీ పడుతున్నారు.

ముప్పయైదేళ్లుగా కానిగిరిబడి చెప్పుకుం టూనే పొట్టపోసుకుంటున్నాడు వెంకట స్వామి. అయిలయ్య కూడా కొద్దిరోజులతని దగ్గర చదువుకున్నాడు.

"ఒరేయ్ పిల్లలూ! బయటకెక్కువగా విన రావద్దు. మెల్లగా చదువుకోండి. కొద్ది నిమి షాలే"

గద్దించినట్టని తన చేతిలో ఉన్న కట్టెను ఝళిపించాడు వెంకటస్వామి.

పిల్లలంతా మెల్లగా చదువుకుంటున్నారు.

"పంతులుగారూ మీరింకా బలపాల గిలక నకార పొల్లుగూర్చి చెబుతున్నారా, వాటిని ప్పుడు ఎవరూ వాడటం లేదుగదా"

"వాటిని ఇప్పుడెవరూ వాడటంలేదు. వాటి అవసరం కూడా అంతగా లేదు. అయినా అలవాటుగా చెబుతున్నాను. సర్కారు బళ్లలోనయితే వీట్ని గూర్చి దాదా పుగా పట్టించుకోవడం లేదు. ఇప్పుడు మునుపటి చదువులెక్కడియి? పేజీలకు పేజీలు రాయించేవాళ్లు. బట్టీ పట్టించేవాళ్లు. అరసున్నాలు, కామాలవీ రాయడం తప్పు పోయినా తన్నేవారు. ఇప్పుడు పెద్ద పెద్ద పండితులకు కూడా అరసున్న ప్రయోగం తెలియదు. ఇప్పుడు గురువు బ్రహ్మ కాదు"

"ఎప్పటికాలమప్పుడు పంతులుగారూ. ఇప్పుడు భాషలకంటే ఎక్కువగా లెక్కలు, సైన్సులు చదువుతున్నట్టనిపిస్తుంది నాకు. ఇంకా ముందుముందు చదువులెట్లా మారు తాయో తెలియకుండా ఉంది. ఇప్పటికి కూడా మీ దగ్గరికింతమంది పిల్లలొస్తున్నా రంటే గొప్ప విషయమే"

"ఇప్పుడు పెద్ద పెద్ద నౌకర్లలో ఉన్న మన ఊరివాళ్లలోని చాలామంది నా శిష్యులే. నైజాం కాలంనుంచి కానిగిరిబడి నడుపుతున్న! మనూరికి సర్కారు బడి రాక ముందు ఊళ్లున్నది నాదొక్కబడే"

"అవును, చాలామంది మీ దగ్గరే అక్షరా భ్యాసం చేయించుకున్నారు. అప్పుడు శిక్ష లెంతో కఠినంగా ఉండేవి. కోదండమెక్కించి కింద కంపపెట్టడం, గోడకుర్చీలేయించడం, వంగబెట్టడం, ఎండలో నిలబెట్టడం, నూర్ల కొద్ది బస్కీలు తీయించడం లాంటివెన్నో ఉండేవి. సారంటె భయం, భక్తీ రెండుం

దేవి. అవి లేంది చదువెలా వస్తుంది? ఇప్పుడు చూడండి. పరిస్థితులెలా ఉన్నాయో? రామచంద్రంసారు వెంకటేశంను కొట్టాడని తల్లిదండ్రులు సారును తిట్టిరి. ఊళ్ళో రాజకీయాలతోని ఆయనను అవమానం జేసిరి. వెంకటేశం చేతికి నిమ్మపులుసు రాసుకోనచ్చె. వాటిమీద కొడితె చేతులు వాచె"

"పిల్లలు తెలివిమీరిపోతున్నరు. సారు బడికెంతో సేవచేస్తే ఆయనకు దక్కింది బదిలీ కావడం"

"ఆయనకు బదిలీ కావడం మంచిదే అయింది. సుల్తానాబాద్‌లో ఉంటున్నాడు. కలపదుకాణం పెడ్తున్నాడు. ఉద్యోగానికి రాజీనామా చేసినా చేయొచ్చంటున్నారు"

"ఎలాగూ ఆయనకు రిటైర్‌మెంట్ దగ్గర్లోనే ఉంది. సరెగని అయిలయ్యా. మీ చెల్లెకెంతమంది పిల్లలు? "

"బాబు... పాప"

"మీ బావ మంచిగున్నడా? "

"ఆయనకేంది? బాగానే ఉన్నాడు. ప్రభు



త్యోద్యోగం. అన్ని వసతులున్న ఇల్లు. మా చెల్లె అదృష్టవంతురాలే. కాని దానికెప్పుడూ తనకంటె పైవాళ్లతో పోల్చుకోవడమే అల వాటు. తండ్రిలేని పిల్లని దాన్ని గారాబంగా పెంచాను నేను. దానాలోచనలేమో ఆకాశం మీదనే"

"అయిలయ్యా. నువ్వు మొదట్నుంచీ అంతే. ఏవీ దాచుకోవు. మీ చెల్లే అయినా నిజం చెప్పావు. అయినా ఒకర్ననేదే ముంది? కాలమే అట్లుంది"

"అవును పంతులుగారు" అని లేచి నిల్చు న్నాడు అయిలయ్య.

"పొద్దు నడినెత్తిమీదికొచ్చింది. బాగా ఆక లవుతుంది. పొయ్యొస్త పంతులుగారు" అన్నాడు.

"నాగటికి పోయేటప్పుడన్నం తిన్లేదా? "

"చద్దన్నం మా తినిపోయిన. కాని పనిజే స్తుంటే ఏందిన్నా భస్మమైపోతది. వ్యవసా యప్పని చేసెటోనికి రాల్లు గూడ అరుగు తయి" అని పోబోయాడు.

"సరెగని అయిలయ్యా. నాలుగైదు లేత పచ్చికంకులు తెచ్చియ్యి, కాల్చుక తినుటానిక యితయి. మునుపు పంతులని ఎవ్వలు పడితె వాళ్ళు తెచ్చిచ్చేవాళ్లు. ఇప్పుడు నోరు తెరిచడిగినా ఇచ్చేవాళ్ళే కరువయింద్రు. ఇంక నయం, మనూరు కస్బారుకు దగ్గ రుంటే అక్కడికే కొంచపోయి అమ్ముకుందు రేమొ నాకిస్తె ఏమొస్తదనుకునేవు"

"నేనలా అనుకుంటనా పంతులు. మా శీనుతోని ఈరోజే పంపుతాను. నిజమే పంతులు మీరన్నది. ఇంతకుముందు చేల్ల కుపోతే పచ్చిపల్లికాయ, కంకులకీ తంపులు పెట్టి కాల్చిచ్చేవాళ్ళు. తోటలో కెడితే కూరగా యలవీ ఉచితంగా ఇచ్చేవారు. ఇప్పుడలా ఎవరూ ఇవ్వడం లేదు. పట్టణాలకు తీసు కెళ్ళి అమ్ముకొచ్చుకుంటున్నారు. రోజు పాల వ్యానచ్చి పాలు తీసుకుపోతుంది. అందు కోసం ఇంట్లో బర్లున్నా తాగుటానికి పెరు గుండదు. అందరు పైస వెనుకపెడ్తున్నట్ట నిపిస్తుంది. అయినా మీలాంటివాళ్లడిగినా ఇవ్వలేనంత స్వార్థపరులేం కాదనుకుం టాను"

"కొడుకు బాగా చదువుతున్నాడా? "

"ఫర్వాలేదు"

అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు అయిలయ్య.

అతడింటికి చేరేసరికి శ్రీనివాస్ గంగయ్య, నర్సమ్మలతో హాస్యమాడుతూ నవ్వుతుండటం చూశాడు. వాళ్ళమీద పడి ఎగురుతున్నాడు.

"ఎప్పుడొచ్చింద్రు మామా? " అన్నాడు అయిలయ్య.

"ఓ గంటయింది. మనుమనితోని మాట్లా డ్తున్నం. బాగానే ఉషారయిండు పిల్లగాడు. దసరా పండుగొస్తుంది గదా. పండుగకు నా బిడ్డను, పిల్లలను తీసుకపోదామనొ చ్చినం"

"బడికి నిన్నట్నుంచే సెలవులటగద" అంది నర్సమ్మ.

"ఇంకా పండుగకు తీసుకపోవడమేంటి మామా! మా పిల్లలే పెద్దవాళ్ళవుతున్నారు. నా బిడ్డ పెండ్లికెదిగింది. నీ బిడ్డనింకా చిన్నపిల్లనుకుంటున్నవా? తీసుకుపోకుంటేం బోతుంది? "

"మేం బతికున్నంతవరకు తీసుకపోతం. అటెనుక దాని అన్నలు తీసుకపోతరన్న నమ్మకమేంలేదు. అది ఎందరు పిల్లలకు తల్లయినా మాకు బిడ్డే. మాతరంవాళ్లున్నం తవరకు ఇసోంటి తీసుకపోవడాలు నడు స్తయి. బతుకపండుగకు ఆడపిల్లలను తల్లి గారింటికి తోలుకపోవుడు మనకు మామూలే కద? " అన్నాడు గంగయ్య.

"మీరందరేమో అక్కడికెళ్ళితే నేనొక్కన్ని ఇక్కడుండాలా? "

"నిన్నిక్కడ ఎవ్వలుండుమన్నరు? మీ అవ్వ చనిపోయి యాడాదన్న కాలేదుగద. మీకెట్లయిన పండుగ లేదుగద. మీకు పండుగ లేకుంటే మీ చెల్లె రాదుగద...

మరిగ నువ్వొక్కనివి ఇక్కడుండేం జేస్తవు? మాతోనే నువ్వు రా, పండుగయిపోయెదాక ఉండిరావచ్చు" అన్నాడు గంగయ్య.

"నిజమే బిడ్డ. నువ్వు గూడ వచ్చేయ లేవు. ఇక్కడేం జేస్తవు? " అంది నర్సమ్మ.

"బాపూ! మనం అమ్మమ్మ వాళ్ళింటికి పోదామే" అన్నాడు శ్రీనివాస్.

అరుగుమీదున్న అయిలయ్య కూతుర్లూ అదేమాటన్నారు. వాళ్ళ మాటలకు నవ్వొచ్చింది అయిలయ్యకు.

"భలేవాళ్లున్నారు. ఇల్లుకు తాళంబెట్టి నేను మీతో రావన్నా? నేనొస్తె వ్యవసాయ ప్పనుల సంగతేంటి? ఎడ్లనెవరు చూసుకోవాలి? వచ్చి ఆరాంగ తినుకుంట కూచోవల్నా" అన్నాడు నవ్వుతూ.

"పనులెప్పుడున్నయేనాయె. ఎన్నేండ్లున్నా ఏ కాలంలనైనా మనకు తీరిపాటైతదా? ఎట్లనో తీరిక జేసుకోవాలె. ఓ పాలేరుండనే ఉండె. ఈ వారంరోజులు వాడే చూసుకుంటడేముంది? " అన్నాడు గంగయ్య.

"నేనొచ్చి పొద్దుమాపు అన్నం తినుకుంట, ఏంపని జెయ్యకుంట వారంరోజులుండాలా? భలెటోనివున్నవు మామ. నీ బిడ్డను, పిల్లలను తోలుకపో. వీలైతె బతుకమ్మ పండుగనాడొస్త, లేకుంటె దసరనాడే వస్త. పండుగనాడుండి తెల్లవారి పిల్లలను తీసుకొని రావచ్చు. రేపుండి ఎల్లుండి పిల్లలను తీసుకపో"

"ఎల్లుండి దాకెందుకు? పండుగ దగ్గరికొచ్చింది గద. రేపే పోతం. నువ్వయితే పండుగకన్న తప్పకరా"

"సరే" అని భోజనం చేయడానికింట్లోకెళ్ళాడు అయిలయ్య.

భోజనం చేసి బయటకొచ్చేసరికి శ్రీనివాస్ తాతమీద కూర్చొని అమ్మమ్మ చెబుతున్న కథ వింటున్నాడు. కథయింతర్వాత చిలిపోడైన మనుమనితో అమ్మమ్మ ఇలా అంది.

"కొడుకూ కొడుకూనైతె.. కోడామే పెట్టిస్తు...

బిడ్డా కొడుకూనైతివీ మనుమాడా...

బిడ్డా కొడుకూ నైతివీ" అంది నర్సమ్మ.

"నాకు మా తెలుసిది. మనుమడు ఆమెతో నేమన్నడో తెలుసా అమ్మమ్మ. 'తండ్రీ తల్లీవైతే తలువాలే పోసుకుందూ. తల్లీ తల్లీవైతివే అమ్మమ్మ!' అని ఇది మా నాయనమ్మ బతికున్నప్పుడు చెప్పింది" అన్నాడు శ్రీనివాస్.

"శీనూ? పెద్దవాళ్ళతో మాట్లాడే విషయాలివేనా? " అని కోపగించాడు అయిలయ్య.

అందులో తప్పేముందో శ్రీనివాస్‌కర్థంకాలేదు.

"నాకేమెరుక. నానమ్మ చెప్పింది చెప్పిన" అన్న శ్రీనివాస్‌ను దగ్గరకు పిల్చుకున్నాడు అయిలయ్య.

"రేపు నువ్వు అమ్మమ్మ ఇంటికి పోతావు గద. కొన్ని పుస్తకాలు తీసుకపో. రోజు కొద్దిసేపైన చదువుకోవచ్చు"

"సెలవుల్ల గూడ చదువుడేనా? నేనేం జదువ. అమ్మమ్మ ఊళ్ళె నేను పూర్తిగాడుకునేదే. నేను పుస్తకాలు కొంచవోను"

"గా తాతిల్లల్ల ఏం జదువుతడు తియ్యి. మంచిగాడుకుంటడు? " మనవన్ని సమర్థిస్తూ అన్నాడు గంగయ్య.

"సరేకాని శీనూ? క్వార్టర్లలో మార్కులెన్నొచ్చాయి నీకు? "

చెప్పడానికి సందేహించాడు శ్రీనివాస్.

మరోసారడిగాడు అయిలయ్య.

"అన్నిట్లో కలిపి మూడు వందలిరువై"

"అంటే...? ఆరువందలకు మూడువందలిరువై. ఇవేమన్న మార్కులేనా? నూటికరభై మార్కులైనా రాకుంటేమన్నట్టు? నువ్వింకా బాగా చదవాలి. ఈ మార్కులు సరిపోవు. నువ్వు కష్టపడి చదువుతే ఇంతకంటెక్కువ మార్కులే వస్తాయి. అప్పుడప్పుడు విజయేందర్‌రెడ్డి సారు దగ్గరికి పంపిస్తున్నానుకదరా! ఇంత తక్కువ మార్కులెందుకొస్తున్నాయి? " అన్నాడు

అయిలయ్య.

శ్రీనివాసేం మాట్లాడలేదు.

ఆ ఊరి చదువుమీద పెద్దగా నమ్మకం లేదు అయిలయ్యకు. పరిస్థితుల ప్రభావం వల్ల తానందుకోలేకపోయిన పెద్ద చదువులు కొడుక్కైనా అందించాలనుకుంటున్న అయిలయ్యకు శ్రీనివాస్‌కా మార్కులు రావడం బాగనిపించడంలేదు. అతను చదువుకునే రోజుల్లో పల్లెల్లోచదువులు బాగుండేవి. పట్టణాలకు పంపిస్తే ఏ దురలవాట్లు కలవాటుపడతారోనన్న భయముండేది. ఇప్పుడు పట్టణాల్లో పెరుగుతున్న ప్రైవేటు పాఠశాలల్లో చదువులు బాగా ఉంటున్నాయంటున్నారు.

కొడుకు చదువు గురించి ఆరాటంగానే ఉంది అయిలయ్యకు. కాని, కొడుకు "బాపూ... ఓ బాపూ! విజయేందర్‌రెడ్డి సారింట్లో డైనింగ్ టేబులుంది. కుర్చీలున్నాయి. సారు కొడుకు నా తరగతే. కుర్చీల్లో కూచొని అన్నం తింటుంటే మంచిగనిపిస్తది" లాంటివి అంటూ ఉంటాడు.

ఊళ్లలోనే పట్టణ సంస్కృతి మెల్లమెల్లగా దిగుమతి కావడం చూస్తున్నాడు అయిలయ్య.

"శీనూ! వ్యవసాయం, ఉద్యోగం రెండూ ఉన్నాయి సారువాళ్ళకు. మనకున్నదొక్క వ్యవసాయమే. మనకెలా వీలవుతుందవన్నీ కొనుక్కోవడానికి. మనమవన్నీ కొనుక్కునే స్థితిలో లేం. కొన్నా మనకున్న పెంకుటింట్లో అవన్నీ వేసుకోవడమెలా వీలవుతుంది? సారువాళ్లు బంగ్లా కట్టుకున్నారు. అందులో ఏవైనా వేసుకోవచ్చు అయినా నేలమీద కూచొని చకులం ముకులం పెట్టుకొని కూర్చుండి అన్నం తింటేనే హాయిగుంటుంది" అన్నాడు అయిలయ్య.

"మనకు లేకుంట ఉన్నయే మంచిగనిపిస్తయి. నేను కొంచెమంతసేపు ఆడుకోనుపోత బాపు" అని ఉరకబోయాడు శ్రీనివాస్.

"పోదువుగాని గాబొట్లకోడిని దొరుకపట్టాలె. కోళ్లనిటు కొట్టుకరా. మీ తాత వచ్చిండుగద. కోన్ని కోద్దాం"

"కల్లు గూడ తెప్పిస్తవు గద బాపు..."

"తెప్పించాలె... చుట్టమొచ్చినప్పుడు తెప్పించకుంటెట్ల? "

శాంతమ్మ అరుగుమీదికి వస్తూ భర్త మాటలు విన్నది.

"బత్తిని ధర్మపురి ఇటువస్తే కల్లు మా చెప్పిన.. నువ్వేం జెప్పకు..." అంది భర్తతో శాంతమ్మ.

"మంచిపని జేసినవు. గౌండ్లింటికి పోయే పనితప్పింది" అని లేచి నిల్చున్నాడు అయిలయ్య.

తండ్రీకొడుకులిద్దరు బొట్ల కోడిపుంజును దొరకబట్టడానికి ప్రయత్నిస్తున్నారు. విత్తులు చల్లుతూ 'కొక్కోకో...' అని పిలుస్తూ శాంతమ్మ కూడా వాళ్ళకు సహకరిస్తోంది. చేతికందినట్టే అందుతూ తప్పించుకుంటోందా కోడిపుంజు. పందిరెక్కుతుంది. గోడెక్కి కూచుంటుంది. అరుగు, వాకిలి, పొరుగిండ్ల తింపుతూనే ఉంది. వాళ్ళను ముప్పుతిప్పలు పెడుతోంది. దాని వెంట వాళ్ళంతా అటూఇటూ పరుగెత్తుతున్నారు. అరగంట ప్రయత్నిస్తే కాని ఆ కోడి దొరుకలేదు. దానికాళ్ళకు దారంకట్టి గంప కిందుంచాడు అయిలయ్య.

"శీనూ! చాకలి కొంరయ్యకు చెప్పిరాపో, వచ్చి కోన్ని కోస్తడు"

"ఇప్పుడింట్ల దొరుకడు కొంరయ్య, ఎప్పుడో చాకలి రేవుకు పోయిండు. వచ్చేవారకు మాపటాల్లయితది. నేను మా కోస్త తియ్యి..." అంది శాంతమ్మ.

"కోన్ని కోసుటానికి మీ అమ్మకు సాయం జెయ్యి. కొద్దిసేపయిన తర్వాత..."

"మా చేస్తాను బాపూ" అని ఆడుకోవడానికురికాడు శ్రీనివాస్.

కొంచెం సేపు విశ్రాంతి తీసుకుందామని

మంచంలో కొరిగాడు అయిలయ్య. అయితే ఎంత ప్రయత్నించినా అతని కంటిమీదికి కునుకు రావడంలేదు.

అతనిలో ఎన్నో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

తన పిల్లల్ని ముగ్గుర్నీ చదివించాలనుకున్నాడు తాను. కాని ఆడపిల్లలిద్దరూ తొమ్మిదవ తరగతి తర్వాత చదువుకుంటానికి మొగ్గుచూపలేదు. రజస్వలయిన పిల్లలను బడికి తోలడమెందుకని శాంతమ్మా వద్దంది. వాళ్ళు చదువుకుంటానంటే తాను చదివించే వాడే. కాని తమకు చదువులో ఆసక్తి లేదన్నారు వాళ్ళు. ఇక మాన్పించక తప్పలేదు. ఓ తీరు సంబంధాలు చూసి ఇద్దరి పెళ్ళిళ్ళు చేయాలని ప్రయత్నిస్తున్నాడు తాను.

ఒక్కగానొక్క కొడుకునైనా బాగా చదివించాలనుకుంటున్నాడు కానీ వాడికేమో సగటు మార్కులు మాత్రమే వస్తున్నాయి. తాను వ్యవసాయ పనుల్లో మునిగితేలుతూ కొడుకు చదువు గురించేం పట్టించుకోగలడు? మరో దిక్కు తమ ప్రాంతంలో జరుగుతున్న పోరాటాల ప్రభావం కొంతైనా పిల్లలపై పడుతూనే ఉంది.

మరి తాను తన కొడుకును గుంటూరులోనో, విజయవాడలోనో రెసిడెన్షియల్ పాఠశాలలో చదివించగలడా? తన వల్ల కాదు. పోనీ బావ దగ్గర శీను నుంచితే? బావ ఉద్యోగం చేస్తూనే ఎమ్మే పాసయ్యాడు. మంచివాడు. కాని బావను మరింత ఆడిపోసుకుంటారు జనం. మరిన్ని విమర్శల పాలవుతాడు. తన నుంచి ఏమాశించని బావను ఇబ్బందుల్లో పెట్టడం బాగుండదు. శీను ఊళ్లోనే చదువుకోవడం తప్పదు. తాను వీలైనంతగా బాగా చదివించే ప్రయత్నం చెయ్యాలి.

తాను దేశానికి స్వాతంత్ర్యం రావడానికి కొంతముందే పుట్టాడు. స్వతంత్ర భారతదేశంలోనే పెరిగాడు. తన దేశీయుల పాలనలోనే జీవిస్తున్నాడు. తన కెలాంటి దురలవాట్లూ లేవు. ఎవరైనా చుట్టమొస్తే తప్ప ఇంట్లోకెప్పుడూ కల్లు కూడా తెచ్చుకోడు. తాను భూమినే నమ్ముకున్నాడు. తన కుటుంబమంతా రాత్రింబవళ్లు వ్యవసాయ పనుల్లోనే మునిగితేలుతున్నారు. అయినా తాను తండ్రి నుంచొచ్చిన భూమిని కూడా కాపాడుకోలేకపోతున్నాడు.

ఏడెనిమిదేళ్లుగా తమ ప్రాంతంలో భూపోరాటాలు జరుగుతున్నాయి. అవి రోజురోజుకీ ఉధృతమవుతున్నాయి. పోరాటాల్లో ఎంతోమంది యువకులు బలవుతున్నారు. వీటితో పాలేర్లజీతాలు, కూలీరేట్లు పెరిగాయి. దొరతనాలు తగ్గాయి. కాని తన లాంటి చిన్న వ్యవసాయదారుడి పరిస్థితిలో మార్పులేదు. పోరాటాలవల్ల చిన్న వ్యవసాయదారులకు లాభమే జరిగుంటే వ్యవసాయదారుల పతనమాగిపోవాల్సింది. కానలా జరగడం లేదు. తనలాంటి రైతుల బతుకులు కొనబోతే కొరివి అమ్మబోతే అడివి లాగే ఉంది.

గ్రామాల్లో చాలా వ్యవసాయాలు దెబ్బతింటున్నాయి. వ్యవసాయాలు వదిలి వలసపోతున్నారు జనాలు. మరోదిక్కు భూస్వామ్య కుటుంబాలవాళ్లు ఉద్యమకారులకు భయపడి ఊళ్లొదిలి పోతున్నారు. మరి భవిష్యత్తులో ఊళ్లెలా ఉండబోతున్నాయి. ఇది భూస్వామ్య దేశమో, వలస దేశమో, పెట్టుబడిదారీ దేశమో తనలాంటి వాళ్లకవసరం లేదు. తనకా సిద్ధాంతాల గొడవలక్కర్లేదు. కాని తనలాంటి రైతుల పతనమాగిపోవాలి. పైరవీకారులే బతికే దుర్మార్గం పోవాలి.

గ్రామాల్లో విచిత్రమైన పరిస్థితులను చూస్తున్నాడు తాను. ఓ దిక్కు అన్నలకు మద్దతు. మరోదిక్కు అన్నలకు వ్యతిరేక ప్రభావం అయినా అన్నలు తమ కార్యక్రమాలు చేస్తూనే ఉన్నారు.

ఓ రోజు మంది మార్బలంతో బేంకు అప్పులను వసూలు చేసుకోవడానికి వచ్చారధికారులు. రైతులను బెదిరిస్తున్నారు. బాకీలు చెల్లించకుంటే ఏవి దొరికితే అవి తీసుకుపోతామని భయపెడ్తున్నారు. బాకీలు కట్టలేని పరిస్థితుల్లో ఉన్న రైతులు అంగలారుస్తున్నారు. ఇంతలో ఇద్దరు యువకులొచ్చారక్కడికి. బాంకాఫీసర్‌ను నిలదీశారు.

నువ్వు పొట్టకూటికోసం ఉద్యోగంలోకి వచ్చిన వాడివేకదా! ప్రభుత్వం కొమ్ముకాయడానికెందు కమితోత్సాహం చూపుతావు? మీ సహకార బ్యాంకులున్నది రైతులను పీడించడానికా! కరువు కాటకాల బారిన పడిన రైతులిప్పుడు అప్పులు చెల్లించే స్థితిలో లేరు. అయినా మీరు బలవంతం చేస్తున్నారు. ఇదేనా మీరు చేస్తున్న సహకారం? వాళ్ల దగ్గర్నుండి బలవంతంగా అప్పులు వసూలు చేస్తే మీరుండరు. మీ బ్యాంకులుండవు. రైతుకు పంటవచ్చినప్పుడు బాకీలు చెల్లిస్తాడు. ఇచ్చేవాళ్ల దగ్గర తీసుకోండి. లేకుంటే లేదు. జాగ్రత్త" అన్నాడు యువకుడు.

వచ్చిన యువకులెవరో ఊహించిన బాంకధికారులు జీపులో వెళ్లిపోయారు. వాళ్లకెదురు ఒక్క మాటకూడా అన్లేదు.

అంటే వాళ్లు రైతులకు వ్యతిరేకులు కాదు. అయినా ఉద్యమాలున్నా రైతులెందుకు వలస పోవాల్సివస్తోంది? తండ్రి చనిపోయిన తర్వాత తాను వ్యవసాయం చేసుకుంటూనే బతకాలనుకున్నాడు. తనకున్న కొద్దిపాటి చదువుతో వచ్చిన విజ్ఞానంతో వ్యవసాయాన్ని అభివృద్ధి చేయాలనుకున్నాడు. తనవంతు కృషి చేస్తున్నాడు. చిన్నతనంలోనే పెళ్లయినా శాంతమ్మ తనకన్నివిధాలా సహకరిస్తోంది. అయినా వ్యవసాయాలు పతనమవుతూనే ఉన్నాయి. ఇంతకుముందులా కాకుండా ఇప్పుడు చెర్లోకి శ్రీరామ్‌సాగర్ నీళ్లొచ్చాయి. అయినా తమ వ్యవసాయాలు బాగుపడతాయా?

ఎంతలేదన్నా మునుపటికంటె కొంత మెరుగ్గానే ఉంటాయి. నీటివసతి తమ ప్రాంతానికి రావడం తమకెంతో సంతోషాన్నిచ్చింది. భవిష్యత్తులో ఏం జరుగుతుందో చూడాలి.

"ఏంటేదో బాగాలోచిస్తున్నట్టున్నవు. ఓ కునుకుదీస్తె అయిపోయేదిగద. అలసట పోయేది. పొద్దువోతుంది. నాగలిగట్టవా ఏంది? " భర్త మంచం దగ్గరికొస్తూ అంది శాంతమ్మ.

"నాగలి గట్టకుంటేడ నడస్తది? పోతున్న" అని లేచి పశువుల కొట్టం దిక్కు నడిచాడు అయిలయ్య.

★ ★ ★

ఇప్పటికీ మనం చదువుతున్న చదువు ఆంగ్లేయుడైన మెకాలే ప్రవేశపెట్టిన విద్యావిధానం. ఇది గుమాస్తాలను తయారు చేయడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. ఈ విద్యావిధానంలో మార్పులు రావాలి. ఈ బానిస విద్యావిధానం పోయి శాస్త్రీయ విద్యావిధానం రావాలి అని విప్లవకరపార్టీల విద్యార్థి యూనియన్లవారు ప్రచారం చేస్తున్నారు. ప్రతి సభలోనూ చెబుతున్నారు. కరపత్రాలు తీస్తున్నారు. గోడలపై రాస్తున్నారు. కాలేజీల్లో, పాఠశాలల్లో ఈ విద్యార్థి యూనియన్ల బలం బాగానే ఉంది. భూపోరాటాలవీ తెలంగాణా జిల్లాలవరకే పరిమితమైనా విద్యార్థి యూనియన్లు మాత్రం రాష్ట్రమంతటా ఉన్నాయి. వీళ్లు శాస్త్రీయ విద్యావిధానం యొక్క ఆవశ్యకతను నొక్కి చెపుతున్నారు. మరో దిక్కు అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ కూడా బలపడుతోంది. ఉద్యమకారులు ఓ దిక్కు పోలీసులను మరో దిక్కు వీళ్లను ఎదుర్కోవాల్సివస్తోంది. కళాశాలలు కురుక్షేత్రాలుగా

మారుతున్నాయి.

విరసం ఆవిర్భావం తర్వాత దశాబ్దకాలం విప్లవ సాహిత్యం విరివిగానే వచ్చింది. ఈ సాహిత్యం ద్వారా ఉద్యమాలను సమర్థించడం జరుగుతోంది. అయితే ఈ సాహిత్యం అనేక కారణాలవల్ల జనాలదాకా చేరింది తక్కువే. మేధావి వర్గంలో కళాశాల విద్యార్థుల్లో మాత్రం దీని ప్రభావం బాగానే ఉంది.

మరోదిక్కు విరసం దశాబ్దంలోనే ఆరడుగుల ఎత్తున్న హీరోలు, పడవంతటి కార్లలో తిరిగే నాయికానాయకుల కథల సాహిత్యమూ వచ్చింది. కాల్పనిక భ్రమలతో యువతరాన్ని ఊహల్లో ముంచెత్తే నవలల జోరు బాగానే ఉంది. ఆ నవలలు సినిమాలుగానూ వచ్చాయి.

ఇప్పుడు తెలుగు నవల ఊహల్లో తేలిపోయే సాహిత్యం కౌగిలినుండి బయటపడుతోంది. దాని స్థానంలో సైన్సు ఫిక్షన్ పేరుమీద భూతప్రేత పిశాచాల నవలలు చోటుచేసుకుంటున్నాయి. వీటి ప్రభావం పాఠకలోకంపై బాగానే ఉంది. దాదాపన్ని వారపత్రికల్లోనూ భూతాల సీరియల్లు ప్రారంభమయ్యాయి. మరిచిపోతున్న మూఢ విశ్వాసాలు మళ్ళీ తెరమీదికొస్తున్నాయి. మరోదిక్కు ప్రజాసాహిత్యమూ వస్తోంది. విప్లవకర పార్టీలు విడిపోతూ తమ పార్టీల కనుబంధంగా తలొక పత్రిక నడుపుకుంటున్నారు.

శ్రీనివాసిప్పుడు ఏడవ తరగతిలో ఉన్నాడు. కొంతమంది స్నేహితుల నేర్పరచుకున్నాడు. సమాజం గూర్చి కులాల గూర్చి కొంత అవగాహన పెంచుకున్నాడు. అయితే చదువుకుంటున్న తాను మునుపట్లా తండ్రి చెప్పిన వ్యవసాయ పనులు చేయడానికి వెనుకాడుతున్నాడు. పనులు చెప్పినప్పుడు తండ్రి మీద కోపంగా ఉంటుందతనికి.

ఆ రోజాదివారం. అయిలయ్య పొలం దగ్గరికెళ్లి వచ్చాడు. శ్రీనివాస్ వాకిట్లో రవీందర్‌తో గోలీలాడుతున్నాడు.

"శీనూ! ఏం చేస్తున్నవురా? " అడిగాడు అయిలయ్య.

"రవీందర్ నేను గోలీలాడుకుంటున్నం"

"అది కనవడుతూనే ఉందిగానీ నీకు ఈ దిక్కుమలాటే దొరికిందా? "

"బాపూ! నువ్వు చిన్నప్పుడు బొంగరాలాట, చిర్రగోనె ఆడెటోనివని చెప్పినవుగద! ఇప్పుడా ఆటలెవ్వరాడుతలేరు"

"కబడ్డీ, వాలీబాలో ఆడుకోక గోలీలాడుడేంది? "

"కబడ్డి ఆడెటోల్లు గూడ తక్కువే బాపు. కొంతమంది వాలీబాల్ మా ఆడుతండ్రు. అది బడున్నప్పుడు ఆడేటి దేనాయె. గ్రౌండవన్నీ కావాలిగద! ఇప్పుడు చాలామంది క్రికెట్ గూడా ఆడుతున్నారు. నువ్వేమొ క్రికెట్ బ్యాటన్న, టెన్నిస్ బ్యాటన్న కొనియ్యమంటె కొనియ్యకపోతివి"

దేశీయ క్రీడలైన కబడ్డీ, ఖోఖోలాంటివి పోతూ క్రమక్రమంగా గ్రామాల్లోకి క్రికెట్ లాంటి క్రీడలు వస్తుండటం గమనిస్తున్నాడు అయిలయ్య.

"రవీందర్... నువ్వెళ్లిపో... శీనుతో పనుంది" అన్నాడు. ఎగురుకుంటూ వెళ్లిపోయాడు రవీందర్.

"మా ఫ్రెండు నెందుక పొమ్మన్నవు? ఈ రోజు బడిలేకనేపాయె. ఆడుకుంటేంది? " అన్నాడు శ్రీనివాస్ కోపంగా.

అప్పుడే ఇంట్లోంచి వాకిట్లోకొచ్చింది శాంతమ్మ.

"నీకెవ్వలు సోపతికాల్లు లేరా? గామాలోల్ల పిల్లగాడే దొరికిండా? " అంది.

తల్లిదండ్రుల దిక్కు ప్రశ్నార్థక ముఖంతో చూశాడు శ్రీనివాస్.

"అంటే? రవీందర్‌తోని ఆడుకోవద్దా? " అన్నాడు.

"మాల మాదిగోల్లు గూడ రవీందర్‌ని,

రమేషని మంచి పేర్లు పెట్టుకోవట్టిరి. అంత అడివికచ్చింది. ఇదివర్లో బుచ్చడు, పీవడని పెట్టుకునేటోల్లు" అంది శ్రీనివాస్ అమ్మమ్మ నర్సమ్మ.

ఆమె రెండు రోజుల క్రితమే కూతురు దగ్గరికొచ్చింది.

"అయితే అమ్మమ్మా! వాళ్లు మంచి పేర్లు పెట్టుకోవద్దా? మరి మనమెందుకు మంచి పేర్లు పెట్టుకోవాలె? నా పేరు గూడ ఎల్లయో, మల్లయో అని పెట్టలేదెందుకు? "

మనుమని ప్రశ్నకు నర్సమ్మ దగ్గర సమాధానంలేదు. "మనమూ వాళ్లొక్కటేనా? వాళ్లను ముట్టుకోని తిరుగుతంద్రు. మంచాలల్ల కూసుండవెట్టుకుంటంద్రు. ఇండ్లల్లకు తీసుకత్తంద్రు. ఛీ నీయవ్వ. ఊరుకు అమాసపున్నం లేకుంటయితంది"

"అత్తా! ఇప్పుడు అలా అనేకాలం కాదు. వాళ్లదే నడుస్తోంది. వాళ్లనేమన్నంటె ఉరికస్తరు. బజార్లనేవు? వాళ్లింటె మీదికొస్తరు"

"సరెగని అమ్మమ్మా! వాళ్లనెందుకు ఇంటికి రానియ్యవద్దు. వాళ్లు గూడ మనుషులేగద"

"అందరు మనుషులె. ఈ కాలపు పిల్లగండ్లకు చెప్పవచ్చెటట్టున్నదా? "

"అయితే అమ్మమ్మా! మనం వాళ్లను దగ్గరకు రానియ్యకుంటె దొరలు మనల్నెందుకు దగ్గరకు రానిస్తరు? "

శ్రీనివాస్ ప్రశ్న అయిలయ్య కాశ్చర్యాన్నే కల్గించింది. కొడుకెదుగుతున్నాడు. కొంత జాగ్రత్తగా ప్రవర్తించాలనుకున్నాడు.

"సరేగాని శీనూ ఈ రోజాదివారం కదా! ఎడ్లని దోలుకపోయి చెలునల మేపుక రాపో. ఇప్పుడుపోతె కడుపు నిండ మేస్తయి"

తండ్రి మాటలకు ముఖం మాడ్చుకున్నాడు శ్రీనివాస్.

"శీనూ! నేను ఖాళీగా ఉండి నిన్ను పనికి పంపిస్తున్నానా చెప్పు. నేను అర్జంటుగా పక్కూరుకెళ్లాలి. రేపు మనం సాంబయ్య మామ దగ్గరికి పోతున్నాంగదా? " అన్నాడు అయిలయ్య.

"నాకు చదువుకునేది బాగుంది. నేబోనుపో"

"అంత చదువుకునేదుంటె గోలీలాడ్తవా? అయినా ఎడ్లు మేస్తుంటె చెట్టుకింద కూచొని చదువుకోవచ్చు తేపకోసారి ఎడ్లను చూస్తుంటే సరిపోతుంది. అక్కడ నువ్వు చేసేదేముంది? "

"నేబోనుపో. నా సోపతిగాళ్లెవ్వలు పనిజేస్తలేరు"

"చెయ్యనోడెవ్వడో చెప్పు. దొరకొడుకులు, పటేండ్లు చెయ్యరు. ఎందుకంటె వాళ్లకు పాలేర్లున్నరు. వాళ్లతో మనకు నడువదు. అలాచేసిన వాళ్లలో చాలామంది ఎటుగాకుండా అయిపోయారు. అన్ని విధాల పని చేసుకుంటూ చదువుకున్నవాళ్లే పైకొస్తరు. మీ సాంబయ్య మామ సంగతేచూడు వ్యవసాయప్పనులున్నా చేసేవాడు. అన్నిట్లో ఫస్టుమార్కులు తెచ్చుకునేవాడు. ఇప్పుడు హాయిగ నౌకరి చేసుకుంటున్నడాలేదా? చదువుకుంటూనే ఎమ్మే చేశాడు. ఇంకేదో చదువుతున్నాడట"

"మీ కాలంలో పనులన్నీ చేసింద్రేమొ. మేంజెయ్యం"

కొడుకును దగ్గరకు తీసుకున్నాడు అయిలయ్య.

"మాటలు పెద్దపెద్దయే నేర్సినవు. లంగమాటలు మాట్లాడటం మర్చిపోయి చదువు, పనినేర్చుకో"

"అవు అయిలయ్యా! నీ కొడుకు బాగ చదువుకొని నౌకరి చెయ్యన్నంటివి. మల్లనేమొ ఎడ్లగాయ తోలుత ననవడ్తివి. పిల్లగాడు పోనంటున్నడు. ఎవ్వలకన్న అప్పజెప్పు ఎడ్లను" అంది నరసమ్మ.

నర్సమ్మ దిక్కు కోపంగా చూశాడు అయిలయ్య.

"నీకేం దెలుసు. కూచుండి ఎన్నయిన

చెపుతవు. ముసలివాళ్ల గారాబంతోనే పిల్లలు మొండిగ తయారవుతరు. వ్యవసాయ కుటుంబంలో చదువుకుంటున్నా పనిజెయ్యక తప్పదు. నేను చేసిన, ఎందరో చేస్తున్నరు. నువ్వేమొ వద్దని చెప్పుతున్నవు. నువ్వు పోతవా మరెడ్లకు? మోసెటోని కెరుక కావడిబరువని నీకేం తెలుసు? "

అల్లుడు తననలా తీసేసేసరికి నర్సమ్మ ముఖం ముడుచుకుంది.

"అవ్వా! నీకెందుకే నడుమ. తండ్రవు కొడుకవు. వాళ్లే చూసుకుంటరు. ఒక్క మాటంటివి. అన్ని మాటలు పడ్తివి" అంది శాంతమ్మ.

"మాదొడ్డకాలం బిడ్డ. గీ చదువులు చట్టుబండలు మాకే మెరుక? మీది కొంచెమంత తెలివికచ్చిన కాలం నీ కొడుకు దింకా తెలివికలోల్ల కాలమాయె. ఇప్పటి పిల్లగాండ్లు చెప్పితె వినరని అన్న. మీ కొడుకు... మీ చదువులు...నాకేంది? రేపు నౌకరత్తె నాకే పెడ్తరా? గప్పటాక నేనుండి సూడత్తనా? " అని లేచి నిల్చుంది నర్సమ్మ.

పక్కవాళ్లింటికి వెళ్లబోతోంది. "నిన్ను బాధ పెట్టాలనన్లేదు ఆ మాటలు. శీను వినాలనన్న" అన్నాడు అల్లుడు.

నర్సమ్మ అక్కణ్నుంచి వెళ్లిపోయింది.

"శీనూ! పనిజేస్తేం తప్పులేదు. బాగా చదువుకొని పైకొచ్చిన వాల్లంతా ఏదో విధంగా కష్టపడినవాళ్లే ఎక్కువ. పనిచేయడంవల్ల పని విలువ తెలుస్తుంది. కష్టం సంగతి తెలుస్తుంది. చదువుకున్నవాడు ఎక్కన్నుంచో ఊడిపడ్డాడన్న భావం రాదు. పని నుండి దూరం కావడం వల్ల ఉద్యోగం దొరకకుంటే బతకడం కష్టమనే భావం పెరుగుతుంది"

పని చేయాల్సిన అవసరం గూర్చి చెప్పాడు అయిలయ్య.

"మీలాంటివాళ్లకు చదువులెందుకురా? బర్ల గాసుకుంటూ బతుకకేంది? రెండు దున్న పోతుల కొనుక్కొని చెరువెనుక పొలం దున్నక బతుకు" అని కొందర్ని రోజూ తిడుతూనే ఉంటాడు మల్రెడ్డిసారు.

"అరే బుకోడా! బుకమ్ముకుంటు బతుకక ఎందుకురా చదువుకోవడానికొచ్చినవు" శాపనార్థాలు పెడుతూనే ఉంటాడు శర్మసారు.

వ్యవసాయం, ఇతర వృత్తిపనులు చదువురాని వాళ్లకే నన్న ధ్వని వాళ్ల మాటల్లో ప్రతిధ్వనిస్తుండటం వింటున్నాడు శ్రీనివాస్.

పాఠశాలలో జరిగిన విషయాలను జ్ఞాపకం చేసుకున్నాడు శ్రీనివాస్.

"పని చేయాలంటే కొంత నామోషే అనిపిస్తుంది తనకు కాని తండ్రికి తనంటే ప్రాణం. అవసరమున్నప్పుడు మాత్రమే తనకు పనిచెపుతాడు తండ్రి" తనలో తాననుకున్నాడు.

తండ్రి మాటలనర్థం చేసుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

"మరి రేపు నన్ను మామ దగ్గరకు తీసుకపోవాలె" అన్నాడు.

"అందరం పోవడమే. నిన్నూ తీసుకపోత"

"ఎందుకు బాపూ! ఇప్పుడు రామగుండం పోవడం? "

"మామయ్య కొడుక్కు అక్షరాభ్యాసం"

"అంటేంది బాపూ"

"అవన్నీ తర్వాత కాని నువ్వెడ్లను విడుచుకొని పో"

"మరి నాకు చాక్లెట్లకు పైసలియ్యి. పోత"

"లంచం లేంది పోవా? " అని నవ్వాడు అయిలయ్య.

"ఇంట్లో మక్క పేలాలున్నయి. లాగు జేబుల పోసుకొని పో... బుక్కుకుంట కూసో చాక్లెట్లకు పైసలెందుకు? "

"నువ్వెప్పుడో చేసినట్టే నన్నిప్పుడు చెయ్యిమంటవా? నాకు పేలాలేమద్దు. నా ఫ్రెండ్స్ చూస్తె ఇజ్జతుపోతది. నాకు

చాక్లెట్లే కావాలె"

"అట్లాగెబిడ్డ. నీ ఇష్టమున్నయి కొనుక్కొని ఎడ్లతోలుకొని పో" అని శాంతమ్మ ఇంట్లోకెళ్లి అర్ధరూపాయి తెచ్చి కొడుకు చేతిలో పెట్టింది. జేబులేసుకొని ఎగురుకుంటూ వెళ్లిపోయాడు శ్రీనివాస్.



భార్యాపిల్లలతో వచ్చిన బావమరిదిని సాదరంగా ఆహ్వానించాడు సాంబయ్య. వదినను, పిల్లలని చూసిన సరస్వతి ముఖం సంతోషంతో వెలిగింది.

శ్రీనివాస్ ఆనంద్, కవితలతో కలిసి ఆడుకుంటున్నాడు. బావ, బావమరుదులిద్దరు ముందు గదిలో కూచొని మాట్లాడుకుంటున్నారు. సరస్వతికి వంటపనిలో సాయం చేయడానికి శాంతమ్మ సరస్వతితో పాటు వంటగదిలోకి వెళ్లింది.

వంటగది నిండా అల్యూమినియం డబ్బాలు, స్టీలు సామానుంది. వంట చేసుకోవడానికి కొత్తగా తెచ్చుకున్న గ్యాస్ స్టవుంది. వంటగదిని చూసిన శాంతమ్మకు ఆడబిడ్డపై కొంత అసూయ కల్గింది. అయినా తన చేతుల్లో పెరిగిన ఆడబిడ్డ సౌఖ్యాన్ని మనస్ఫూర్తిగానే అంగీకరించింది.

ఎంతైనా నౌకరి నౌకరే. మట్టి బతుకులల్ల ఏం పాడైంది? ఇన్నేండ్ల నుంచి సంసారం చేస్తుంటే తనింట్లేముంది? ఐదారేండ్లలోనే ఎన్ని సామాన్లు కొనుక్కున్నరు. తనలో తాననుకుంది శాంతమ్మ.

"ఇక్కడికి గ్యాస్ స్టవులచ్చినయా సరస్వతి? " అంది శాంతమ్మ.

"ఇంకా రాలేదు. ఐదారు నెలల్లో వస్తయంటున్నరు. బొగ్గుతోని, కిరోసిన్ స్టవుతోని వంటజేసుడు వశెంగాక పోరుపెడితె మీ తమ్ముడు గోదావరిఖని అడ్రసిచ్చి కనెక్షన్ తీసుకున్నాడు. వదినా! ఇక్కడ గీ కుర్చీలు, టేబుల్లు, డెకొలం మంచాలు చూసి మా దగ్గర బాగా పైసలున్నయనుకుంటరు. ఇక్కడ పైన పటారం లోనలొటారం అన్నట్టే ఉంటది" అంది సరస్వతి.

తన కళ్లముందే పెరిగిన ఆడబిడ్డ ఆరిందలా మాట్లాడటం శాంతమ్మకు గమ్మత్తుగా అనిపిస్తుంది. ఆ మాటల కామెకు నవ్వొచ్చింది.

"సరస్వతీ! మీ దగ్గర బాగ పైసలున్నయని నేనన్నానా? మీరేమన్నా కూడబెట్టుకున్నారో లేదో తెలియదుగాని ఉద్యోగం చేస్తున్న ఈ స్వల్పకాలంలోనే ఇంట్లోకి కావాల్సిన వస్తువులన్నీ సమకూర్చుకున్నరు. ఓ స్కూటర్ కూడా కొన్నరు. ఇంకేం చేస్తారు చెప్పు? సంపాదించుకుంటూనే ఉన్నదాంతో తృప్తిపడటం నేర్చుకోవాలి. నీకదున్నట్టు కనవడది"

"వదినా! ఇక్కడి ఖర్చులు నీకేం తెలుసు. ఉప్పుతోని ముప్పయారు కొనుక్కునుడే నాయె. ఏం మిగిలిపొడయితయి పైసలు. నీలాగ ఉన్నదాంతోని తృప్తిపడాలంటె నానుంచిగాదు. వదినా! నేనంటున్నానని కాదుగాని నీకేం బాధుంది చెప్పు. హాయిగా పల్లెటూళ్లో వ్యవసాయం. ఇల్లు... ఉన్న ఇద్దరు బిడ్డల పెండ్లిల్లు అయిపాయె. ఒక్కడే మొగపిల్లగాడాయె శీను. వాన్ని చదివించుకుంటె సరిపోతదిగద. మాకుంది

ముందుముందు ముసుర్ల పండుగ" అంది సరస్వతి.

"రాజమ్మ, సరోజినిల పెండ్లి వట్టిగానే అయిందా సరస్వతి! ఎట్లయిన చదువుకుంట లేరుగదాని చిన్న తనంలోనే పెండ్లిల్లు జేస్తిమి. నాలుగెకరాల భూమినమ్మి లగ్గాలు జేసినం. పొంగపొంగ ఇంకేం మిగిలింది భూమి. ఇంకో నాలుగెకురాలుంది. ఆ భూమి విలువెంత పాడయింది. మీ యాడాది జీతమంత గాదు మాకున్న భూముల విలువ"

"పీతకష్టాలు పీతవని ఎవ్వల బాధలు వాళ్లకున్నయి" అని టిఫిన్ తీసుకెళ్లి ముందు రూంలో ఉంచింది సరస్వతి.

శ్రీనివాస్ ఆనంద్‌తో హాయిగా ఆడుకుంటున్నాడు. శ్రీనివాస్‌కిక్కడి ఆటల మైదానం, రోడ్లు, ట్యూబ్‌లైట్ల వెలుతురు చాలా ఇష్టం. బావమరిది ఎంతో అదృష్ట వంతుడనుకుంటాడు శ్రీనివాస్.

వాళ్లిద్దరూ క్రికెట్ ఆడుకుంటున్నారు.

"తలుకాయలు పలుగ్గొట్టుకునేరు. టిఫిన్ చేద్దురు రండి"

సరస్వతి పిలువగానే కవిత, శ్రీనివాస్, ఆనంద్ లోపలికొచ్చారు. పిల్లలతో కలిసి అయిలయ్య, సాంబయ్య టిఫిన్ తింటున్నారు.

"చూడు బావా! చదువుకుంటున్న తనకు పని చెప్పొద్దట. తానలాంటి మోటు పనులు చేయడట"

శ్రీనివాస్ గూర్చి సాంబయ్యతో అన్నాడు అయిలయ్య.

'ఈ సమస్య ఈతరం కుర్రాళ్లలో మామూలే. చదువుకు భంగం కలుగనంత వరకు పనిచేసుకుంటూ చదువుకోవడం తప్పుగాదు. పనివల్ల పిల్లలకు వ్యవసాయ పనులలాంటి వాటిపై ఏహ్యాభావం కలుగకుండా ఉండే అవకాశముంది. అయినా వ్యవసాయ కుటుంబాల్లో ఎంత కాదన్నా కొంతైనా పని చేయక తప్పదు'

తనలో తాననుకున్నాడు సాంబయ్య.

"శీనూ! మేమంతా పని చేస్తూనే చదువుకున్నాం. పని చేయడంలో తప్పేం లేదు. మీ నాన్న అత్యవసరమైతే తప్ప నీకు పని చెప్పడన్న విషయం నాకు తెలుసు. అయినా చేయనంటున్నావా? "

తనమీద మామయ్యకు ఫిర్యాదు చేసిన తండ్రిని చూస్తూ ముఖం మాడ్చుకున్నాడు శ్రీనివాస్.

"శీనూ! పని చేయడం తప్పుకాదు. కొన్ని దేశాల్లో పనిని డిగ్నిటీ ఆఫ్ లేబర్‌గా గుర్తిస్తారు. నేను ఏతం పోస్తూ చదువుకున్నాను. పనికీ చదువుకూ మధ్య సంబంధం వ్యవసాయ కుటుంబాల్లో తప్పదు. నువ్వు మీ నాన్న చెప్పినట్టు విను"

"మామయ్యా! మరి మీరు ఆనంద్‌కు పని చెబితే చేస్తాడా? "

శ్రీనివాస్ ఈ ప్రశ్న వేస్తాడని ఊహించలేదు సాంబయ్య.

"ఎందుకు చేయడు. కాకపోతే ఇక్కడ చదువుకుంటుండటంవల్ల ఊళ్లోలా చేయాల్సిన అవసరం రాకపోవచ్చు కాని అవసరమైతే తప్పకుండా పనిచేస్తాడు. నేను చేయిస్తాను. ఒక్క విషయం గుర్తుంచుకో శీనూ! ఏ తల్లిదండ్రులూ తమ పిల్లలు కష్టపడుతూ చదువుకోవాలని చూడరు. చదువుకునే సమయంలో వీలైనంతవరకు పిల్లలకు పని చెప్పకుండా ఉండాలనే ప్రయత్నిస్తారు. తాము పడ్డ కష్టాలు తమ పిల్లలు పడకూడదని ఆశిస్తారు. అయితే వ్యవసాయ కుటుంబాల్లో ఎంతమంది పనిచేసినా చాలదు కాబట్టి పిల్లలు కూడా పని చేయక తప్పదు. ఇదేం తప్పుకాదు. మీ సార్లు ఉద్యోగాలు చేస్తూ తీరిక సమయాల్లో వ్యవసాయ పనులు చేస్తున్నారా లేదా? " అన్నాడు.

"బాపూ! నువ్వే పని చెప్పినా నేను మా చేస్తాను. కాని అందరికీ చెప్పి చెప్పించకు

నాకు. మాసార్లకు గూడ చెప్పుతవు నువ్వు"

"మామయ్యతోని చెబితె అందరికి చెప్పినట్టార. మేమేం చెప్పినా నీ మంచి కోసమే"

వాళ్లు మాట్లాడుతూనే టిఫిన్ చేయడం ముగించారు.

★ ★ ★

షాపింగ్ సెంటర్‌కెళ్ళి మటన్ తెచ్చిచ్చాడు సాంబయ్య... వంటయింతర్వాత భోజనానికి కూర్చున్నారంతా.

సరస్వతి, శాంతమ్మ తర్వాత తింటామని వాళ్ళకు వడ్డిస్తున్నారు.

డైనింగ్ టేబుల్‌పై భోజనం శ్రీనివాస్ కెంతో అపురూపంగా అనిపిస్తోంది.

"నేనిదివరకొచ్చినపుడు డైనింగ్ టేబుల్ లేదు కదా బావ! ఎప్పుడు కొన్నావు దీన్ని? ఎంతయింది? " అడిగాడు అయిలయ్య.

"నెల రోజుల క్రితమే కొన్న. రెండు వేలయింది. ఇంకో ఐదు వందలిచ్చేదుంది. మీ చెల్లె పట్టుబట్టి కొనిపించింది..."

"ఇక్కడ అందరికి డైనింగ్ టేబుళ్లున్నయన్నయ్యా. వస్తువులు లేకుంటే నలుగుట్ల నల్లమొకం గాదా? ఇంటికొచ్చిన వాళ్ళంత ఇంకా డైనింగ్ టేబులన్న కొనుక్కోలేదా అనడుగుతున్నరు. లోకంతోని మనం నడువాలె" అంది సరస్వతి.

రెండేండ్లకవిత, ఐదేళ్ళ ఆనంద్ పక్కపక్కన కుర్చీల్లో కూచొని కొట్లాడుకుంటున్నారు. వాళ్ళనొక్కటేసింది సరస్వతి.

"అన్నం తినేటప్పుడు గూడ కొట్లాడుడేనా? క్షణం పడది" అంది.

పిల్లలు ముగ్గురు ఒకర్నొకరు చూసుకుంటూ అన్నం తింటున్నారు. కవితకు సరస్వతి అన్నం తినిపిస్తానంటే తనే తింటానని తినిపించనీయడంలేదు.

"సరస్వతీ! నువ్వొక్క విషయాన్ని గుర్తుంచుకోవాలి. మన బ్యాక్ గ్రౌండేమిటి? మనమెక్కడనుంచి వచ్చాం? అనేది చూసుకోవాలి. మనది దిగువ మధ్యతరగతి కుటుంబం. మనకున్న స్వల్పమైన ఆస్తి విలువ శూన్యం. మనకుద్యోగమే జీవనాధారం. జీతం ఓ తీరుగానే ఉన్నా అన్నీ జీతంలోంచే కదా వెళ్ళాల్సింది. మన వసతినిబట్టి ఒక్కోటి సమకూర్చుకోవాలిగాని ఉరుకులాటొద్దు"

బావను ప్రశంసాపూర్వకంగా చూశాడు అయిలయ్య.

"నాకు మా ఎరికే నేనేం తెలివితక్కువదాన్ని కాదు. ఇంటి కవసరమున్న వస్తువులేంటో నాకు తెలుసు. ఇంట్లోకేం కావాలో మీకు పట్టనప్పుడు నేను జమ చేయకుంటెట్ల? ఇక్కడ ఇంట్లో ఎన్ని వస్తువులుంటే అంత గౌరవం" అంది సరస్వతి.

"గౌరవం, మర్యాదలు ఫర్నీచర్‌తోనో పట్టుచీరలతోనో వస్తుందనుకుంటే అది భ్రమే సరస్వతీ! నేను వస్తువుల్ని వద్దనడం లేదు. కాని ఇల్లును గోడౌన్ చేయడం బాగుండదు. మన కవసరమున్నంత వరకు కొనుక్కోవడం మంచిది"

"మీరెంత కాదన్నా ఆడోల్లకు వస్తువుల మీద, నగలమీద ప్రేముంటది తమ్మీ. ఇది మామూలే" అంది శాంతమ్మ.

"బావా! ఒక్కతే చెల్లని, తండ్రిలేని పిల్లని గారాబంగ పెంచిన. సరస్వతికి కొంచెం పట్టుదలెక్కువే. అది పైపై మెరుగులనే చూస్తుంది. కాని ఇక్కడి వాతావరణం చూస్తుంటే దాని తప్పులేదేమోననిపిస్తుంది"

"నువ్వు భలేవాడివున్నవు. నాకు సపోర్టు చేసినట్టు మాట్లాడుతూనే మీ చెల్లెను వెనుకేసుకొస్తున్నావు" అన్నాడు సాంబయ్య నవ్వుతూ.

మాట్లాడుకుంటూ భోజనం ముగించారు వాళ్ళు. ఆ తర్వాత సరస్వతి, శాంతమ్మ కూడా భోంచేసారు.

గిన్నెలవీ సర్దింది సరస్వతి.

ముందు గదిలోకొచ్చి అంతా కూర్చు

న్నారు. సాంబయ్య మిత్రులిద్దరినీ పిలిపించాడు. పిల్లలు ఇంటిముందాడుకుంటున్నారు.

"బావా! నిన్ను పిలిపించింది కేవలం ఆనంద్ అక్షరాభ్యాసాన్ని చూడటానికే కాదు, దానితోపాటు ఓ నిర్ణయం తీసుకోవాలి. ఇది భవిష్యత్తుకు సంబంధించిన విషయం. బాబును ఏ స్కూల్లో వేయాలన్న విషయంలోనూ కొంత మాట్లాడాలి"

బావేం మాట్లాడుతున్నాడో అయిలయ్య కర్థంకాలేదు.

"ఇందులో మాట్లాడేదేముంది బావా! బాబుకు అక్షరాభ్యాసం సాంప్రదాయ సిద్ధంగా చేయిస్తున్నావు కదా" అన్నాడు అయిలయ్య.

"నిజానికి అక్షరాభ్యాసం ఎప్పుడో అయిపోయింది. ఎల్ కెజి, యుకెజి కూడా పూర్తి చేశాడు. ఇప్పుడు ఒకటో తరగతిలో చేరాలి. అప్పుడు మనం సాంప్రదాయం ప్రకారం చేయలేదు కదా ఇప్పుడు చేయిద్దామంటుంది మీ చెల్లె. నాకు వీటన్నిటిపై పెద్దగా ఆసక్తి లేకున్నా సరేనన్నాను. ఆర్థికంగా మెరుగుపడుతున్నకొద్దీ భక్తి, పూజా పునస్కారాలు పెరుగుతుంటాయి. మా దగ్గరా అదే జరుగుతోంది" అన్నాడు సాంబయ్య.

"మీరు నమ్మకుంటే నమ్మద్దు. ఇంకొకర్ని వద్దనే హక్కు మీకెక్కడుంది? " అంది సరస్వతి.

"అది కాదోయ్, నేను సమాజంలో జరిగే జనరల్ విషయం చెబుతున్నాను. మనమిక్కడకొచ్చినప్పుడు జనాల్లో ఎంత ఆవేశముండేది. ఇప్పుడు క్రమక్రమంగా తిరుపతి మొక్కుల దిక్కు మర్లుతున్నారు"

"అవన్నీ సరే కాని అసలు విషయమేంటో చెప్పండి" అన్నాడు రాంరెడ్డి.

"ఏంలేదు. ఆనంద్‌ను నేనేమో తెలుగుమీడియంలో జాయిన్ చేద్దామనుకుంటున్నాను. సరస్వతేమో ఇంగ్లీషు మీడియంలోనే వేయాలని పట్టుపడుతోంది"

సాంబయ్య మాటల కాశ్చర్యపోయాడు అయిలయ్య. రాంరెడ్డికి సాంబయ్య పిచ్చివాడిలాగే కనిపించాడు.

"తెలుగు మీడియం బళ్ళో వేసుడేంది బావా! ఇక్కడ ఇంగ్లీషుమీడియం పాఠశాలుంది కదా! ఇంగ్లీషు మీడియం బళ్ళు లేవని మేమేడుస్తుంటే నువ్వేమొ ఆ బడుండే తెలుగు మీడియమంటావెందుకు? "

"నువ్వూ మీ చెల్లె పాడే పాటే పాడుతున్నావా అయిలయ్యా. మాతృభాషలో విద్యా బోధనవల్ల విద్యార్థులకు సులభంగా అర్థమయ్యే అవకాశముంది. అయినా ఎవరి భాషలో వాళ్ళు చదువుకుంటే మంచిది కాదా! మనం చదుకోలేదా? "

"ఇదన్నయ్యా... ఈయన తిక్క. అప్పుడంటే ఇంగ్లీసు మీడియం బళ్ళు లేవు. ఉన్నా పట్టణాల్లో అక్కడక్కడుండేవి. ఇప్పుడు మరీ పల్లెటూళ్లలో, ప్రభుత్వ పాఠశాలలు తప్ప ఇంగ్లీషు మీడియం బళ్ళే ఎక్కువవుతున్నాయి. ఓ తీరు ఆర్థిక పరిస్థితి ఉన్నవాళ్ళంతా పిల్లలను ఇంగ్లీషుమీడియం బళ్ళకే పంపిస్తుంటే ఈయనేమొ తెలుగుమీడియమని పాకులాడుతున్నాడు. తెలుగు మీడియం బళ్ళకిప్పుడెవరు పోతున్నారు? పోగా మనమిక్కడ ఏ బడిలో వేసినా ఫీజులు కట్టాల్సిందేం లేదు కదా!" అంది సరస్వతి.

"చెల్లెమ్మనెందుకర్థం చేసుకోవు సాంబయ్యా! సైంటిఫిక్ విజ్ఞానం, మ్యాథమాటిక్స్‌కు సంబంధించిన విషయమంతా ముఖ్యంగా ఇంగ్లీషు భాషలోనే ఉంది. వాటికి సంబంధించిన మంచి పుస్తకాలు తెలుగులో దొరకడం కష్టమే. ఇప్పుడు క్రమక్రమంగా చదువులన్నీ సైన్సు, మ్యాథమాటిక్స్ కేంద్రంగా సాగుతున్నాయి. ఈ కాలంలో అందరేమో ఇంగ్లీషు చదువులంటుంటే నువ్వేమో తెలుగుమీడి

యమని పంచాయతీ పెడ్తున్నావేంటి? నీకీ తెలుగు పిచ్చెందుకు? పల్లెల్లో ఉన్నవాళ్ళు కూడా పట్నాలకు పంపి ఇంగ్లీషు మీడియం పాఠశాలల్లో చదివిస్తున్నారెంతోమంది. నీకేమో గ్రామీణ మనస్తత్వం పోలేదు" అన్నాడు రాంరెడ్డి.

"పెద్ద మనిషని పేరంటం బిలిస్తె ఏదో చేసినట్టుందోయ్ రాంరెడ్డి నీ సంగతి. మాతృభాషలో విద్యాబోధన ఎంతో ఉపయోగకరం. తెలుగులో చదివిన వాళ్ళు డాక్టర్లు, ఇంజనీర్లు కావడం లేదా? అన్ని కాంపిటీషన్ పరీక్షల్లోకాని ప్రొఫెషనల్ కోర్సుల్లోకాని సెలెక్టు కావడానికి ఏ మీడియమయినా ఫర్వాలేదు" అన్నాడు సాంబయ్య.

"ఎవరి మాతృభాషలో బోధన వాళ్ళకు మంచిదే. సాంబయ్య ఆవేదనా అర్థవంతమైనదే. తెలుగులో చదివిస్తే మునిగిపోయేదేం లేదు. కనీసం స్కూల్ ఫైనల్ వరకైనా మాతృభాషలో చదివిస్తేనే మంచిది" అన్నాడు తిరుపతిరెడ్డి.

"అన్నీ తెలిసీ మీరిలా అంటారేంటన్నయ్యా. మన దగ్గర తెలుగు మీడియం చదివే పిల్లలనెంత చులకనగా చూస్తున్నారో మీకు తెలియదా? తెలుగుమీడియం చదివే పిల్లల్లో చాలామంది మన ఉద్యోగుల పిల్లలు కారు, బయటి గ్రామస్థుల పిల్లలే. వాళ్ళను పట్టించుకుంటున్న వాళ్ళే లేరు. మీ పిల్లల్ని కూడా ఇంగ్లీషు మీడియంలోనే వేసారనుకుంటాను" అంది తిరుపతిరెడ్డి నుద్దేశించి సరస్వతి.

"చెల్లెమ్మా. నువ్వు చెప్పిన దాంట్లో తప్పేంలేదు. ఇది జరుగుతున్న చరిత్ర. కాని, నేను చెప్పేదొకటి, చేసేదొకటుండదు. ఇంటర్‌వరకు నా పిల్లల్ని తెలుగుమీడియం పాఠశాలలోనే చదివించాను. చదివిస్తున్నాను. కాకపోతే ఇక్కడ కాకపోవచ్చు"

"తిరుపతిరెడ్డి చెప్పిందే చేస్తాడన్నమాట వాస్తవమే. కాని, పిల్లలపైన రకరకాల ప్రయోగాలు చేస్తున్నాడు. ఒకసారి జగిత్యాలకు, ఒకసారి కరీంనగర్‌కు, ఇంకోసారి హైద్రాబాద్‌కు, ఇక్కడికీ ఇలా మారుస్తూనే ఉన్నాడు. అప్పుడు మనవద్ద సెంట్రల్ స్కూల్ మాత్రమే ఉండేది. అందులో తెలుగన్న ప్రసక్తేలేదు. అందుకే పిల్లలను తిప్పాల్సివచ్చింది తిరుపతిరెడ్డికి. ఇప్పుడా అవసరం లేదు"

"రాంరెడ్డి చెప్పిన మాట నిజమే. ఇక్కడి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని సాంబయ్య పిల్లలను తెలుగుమీడియంలో వేయమని చెప్పడంలేదు. కాని, వేస్తే నష్టం లేదని మాత్రం ఖచ్చితంగా చెప్పగలను. అయినా ఇలాంటివి ఎవరికివారే నిర్ణయించుకోవాలిగానీ నలుగుర్ని పిలిచి చర్చపెట్టడమేంటోయ్ సాంబయ్య" నవ్వుతూ అన్నాడు తిరుపతిరెడ్డి.

"ఏదో మీ చెల్లెను కన్విన్స్ చేస్తావని"

"భవిష్యత్తులో ఏదన్నా జరిగితే నామీద మన్నువోస్తది మా చెల్లె... దీన్ని మీలో మీరు తేల్చుకోవాల్సిందే. అయినా బాగా చదువుకుంటే ఏ మీడియమైనా ఒక్కటే. ఓ దిక్కు అధికార భాషగా తెలుగు నమలుచేయడానికి కృషి జరుగుతుంటే మరో దిక్కు ఇంగ్లీషు మీడియం పాఠశాలల జోరు పెరుగుతోంది. గమ్మత్తుగా ఉంది కదా!" అన్నాడు తిరుపతిరెడ్డి.

"తెలుగు తెలుగని, మాతృభాష మాతృభాషని చెప్పే పెద్దపెద్ద అధికార హోదాల్లో ఉన్నవారే తమ పిల్లలను తెలుగుమీడియం పాఠశాలల్లో చదివించడంలేదు. అసలు తెలుగునే ఇంట్లో ఉండనీయడంలేదు. తెలుగు కథలు, కవిత్వం రాసేవాళ్ళ పిల్లలు కూడా తెలుగుమీడియంలో చదువుతున్నారని నేననుకోను"

రాంరెడ్డి మాటలు విని సంబరపడింది సరస్వతి.

"అవును. చెప్పేదొకటి చేసేదొకటన్నట్టుగానే ఉంటాయి పెద్దోళ్ల పనులు. నాకిష్టం



లేకున్నా ఈ విషయంలో నువ్వు నీ అభిప్రాయాలతో రాజీపడటమే మంచిదని నా ఉద్దేశ్యం" అన్నాడు తిరుపతిరెడ్డి.

"బావా? పల్లెటూళ్ళ మాటెలా ఉన్నా ఇక్కడ తెలుగు మీడియం చదువులంటే కొంత తక్కువగానే చూస్తున్నారనిపిస్తుంది నాకు. ఊరివాళ్ళు కూడా ఇంగ్లీషమీడియం చదువులని మోజుపడుతుంటే ఇక్కడెలా ఉంటుందో నేనూహించుకోగలను. ఇంగ్లీషు, తెలుగు మీడియంలు రెండున్న బళ్లలో తెలుగు మీడియం వాళ్ళనంతగా పట్టించుకోరు. పిల్లలు తక్కువతనంగా ఫీలయ్యే అవకాశముంది. ఫోగా చెల్లెమ్మను అసంతృప్తికి గురిచేస్తూ నువ్వు మాత్రం సాధించేదేముంది? ఆనంద్‌ను ఇంగ్లీషు మీడియంలోనే వేయి"

అయిలయ్య కూడా సరస్వతికి మద్దతుగానే మాట్లాడాడు. తననెవరూ సమర్థించకపోవడం సాంబయ్యకు బాధాకరంగాను ఉంది.

"నేను ఇంగ్లీషే చదువుత... తెలుగొద్దు తెలుగు గొట్టు" యు.కె.జి. ఎల్‌కెజి. చది విన అనుభవంతో అన్నాడు ఆనంద్.

"తమ్మీ...! నీకెందుకింత పట్టుదల? ఇంగ్లీషులో చదవడం గొప్పని మేమనుకుం టుంటే నువ్వేమో తెలుగనెందుకు పాకులా డుతవు? " అంది శాంతమ్మ.

"నా కొడుకును ఆరునూరయినా తెలుగు మీడియంలో చేరనీయను. నా కొడుకు తెలుగు మీడియం చదువుతున్నడంటే నాకు తలవంపులయితది. నేంజచ్చినా ఒప్పుకోను" అంది ఖచ్చితంగా సరస్వతి.

ఇంకొంతసేపు తర్జన భర్జనలయ్యాయి.

"సాంబయ్యా! ఇంట్లో నీ పనులకు మద్ద తులేకుండా నువ్వేం సాధించలేవు. అయినా నీకీ పట్టుదలనవసరం? బాగాలోచిస్తే నాకో టనిపిస్తుంది. నీకు కూడా నీ పిల్లలను ఇంగ్లీషుమీడియంలోనే చదివించాలనుంది. కాని లోకంకోసం ఏదో ఫోజు పెడ్తున్నా వేమోననిపిస్తుంది. సరే... అవన్నీ వదిలిపె డుదాం. మధ్యేమార్గంగా నేనోవిషయం చెబుతాను. నీ పిల్లలకు తెలుగు రావాలి. చదువు బాగా రావాలి. అంతే కదా! కేంద్రీయ విద్యాలయంలోనైతే తెలుగు సబ్జెక్ట్ ఉండదు. రాష్ట్రప్రభుత్వం సిలబస్‌తో నడుస్తున్న ఇంగ్లీషు మీడియం పాఠశా లుంది కదా! అందులో వేయి. పదవతరగ తివరకు తెలుగు ఓ సబ్జెక్టుంటుంది. ఇలా చేయడంవల్ల మాతృభాషను వదలనట్టూ ఉంటుంది. ఇంగ్లీషు మీడియం చదివినట్టూ ఉంటుంది" అన్నాడు తిరుపతిరెడ్డి.

అది బాగానే ఉందనిపించిందందరికీ...

ఏమో చెప్పబోతున్న సాంబయ్యనేం మాట్లాడనీయలేదెవరూ...

తుదకలా చేయడానికే ఒప్పుకున్నాడు సాంబయ్య.

రాంరెడ్డి, తిరుపతిరెడ్డి వెళ్ళిపోయారు.



సాయంత్రం మురళయ్యగారిని తీసుకొ చ్చాడు సాంబయ్య.

'ఓం నమశ్శివాయ' అని రాసి ఆనంద్‌తో అనిపించి ఏవేవో మంత్రాలు చదివి అక్షరా భ్యాస కార్యక్రమం అయిందనిపించాడు మురళయ్య.

తెల్లవారుండి, మరునాడు ఊరెళ్ళడానికి శాంతమ్మ, శ్రీనివాస్‌లతో బస్టాపుకొచ్చాడు అయిలయ్య.

సాంబయ్య డ్యూటీకి వెళ్ళిపోయాడు.

బస్సు కోసం ఎదురు చూస్తున్నారక్కడ.

అక్కడే ఉన్న చెట్టుకిందో వృద్ధురాలు కూర్చొనుంది. సగం పైగా తలవెంట్రుకలు నెరిసున్నాయామెకు. ఆమె ఏడుస్తోంది. ముక్కు చీదుతూ కొంగుతో తుడుచుకుం టోంది.

ఆమె దగ్గరికెళ్ళాడు అయిలయ్య.

"ఏమైందవ్వా? "

అయిలయ్య ఎవరో తెలియకున్నా తనను అవ్వా అంటూ ఆప్యాయంగా పలుకరించిన పలుకరింపుకు ఆమెకు దుఃఖమాగలేదు.

భోరుమని ఏడవసాగిందామె.

మరింత దగ్గరకెళ్ళి తలమీద చెయ్యేసి ఓదార్చాడు అయిలయ్య.

"నువ్వెవరవ్వా! ఎందుకేడుస్తున్నావి క్కడ? " అన్నాడు.

"ఈ ముసలవ్వ కొడుకు అకౌంట్సాఫీసరి క్కడ. ఈమె వాళ్ళింటికి రావడం ఈమె కొడుక్కు, కోడలుకు నచ్చదు. ముసల్దేమొ చిప్పి రెంట్రుకలతోని మోటుగుండె. వాళ్ళేమొ చదవుకున్నోల్లయిరి ఆయనాఫీస రాయె" అన్నాడు అక్కడే నిల్చొనున్న ఓ వర్కరు.

ఆ మాటలు విన్న అయిలయ్య ముఖం ముడతలు పడింది.

'బస్సు కొంచెం ఆలస్యంగా వస్తేనే మంచిది' తనలో తాననుకున్నాడు.

"ఏంది ముసలవ్వా? నీ కోడలు తిట్టిందా? " అన్నాడు.

"ఏంజెప్పాలె బిడ్డ? కడుపు చింపుకుంటే

కాళ్ళమీద పడుతదన్నట్టు చెప్పుతె మానం బాయె. చెప్పకుంటే పానం బాయేనన్నట్టున్నది. నాకు నలుగురు కొడుకులున్నరు. ముసలాయన చెప్పులు గుడుతడు. ముగ్గురు కొడుకులూ పాలేర్లే. ఇక్కడుండే ఒక్క కొడుకునూ చదివించినం... ఒక్కడన్న చదువుకున్నోడుండాలెనని చదివించినం... నౌకరయింది. కొంచెమంత చదువుకున్న పిల్లనే చూసి లగ్గం జేసినం, చదువు లగ్గం రెండయినంక నా కొడుకు నాకు గాకుంటయిండు. ఈనె అక్కడికి రాడు. నాదేమో కన్నకడు పాయె. మనసు గొట్టుకోని సూత్తామని నేనిక్కడికత్తె వాళ్ళ ఇజ్జతుపోతదట.

మూడు నెల్లాయె నా కొడుకు మా ఊరికి రాలేదని చూడబుద్ధయి వచ్చిన. కండ్లల్ల నిప్పులు పోసుకుంది నా కోడలు. దానికి నా గోచీపెట్టి కట్టే చీరె జూత్తె అసయ్యమట. నేనేమో మోటుదాన్నయితి. గీ ముసల్తనానికి దాని లెక్కన చీరె గట్టుమంటె నా నుంచయితదా? నేను మాట్లాడుతె రోతట. నన్ను వాళ్ళింట్ల సూత్తెనే వాళ్ళ ఇజ్జతు పోతదట. ఇయ్యాల్ల నౌకరయి బంగ్లాలల్ల బతుకుతుండ్రు నిజమే. మరి నా కొడుకేడ బుట్టిండు? ఏడ పెర్గిండు? నా గుడిసెల గాదా! నా పాల్దాగి పెరుగులేదా? నిన్న సాయంత్రమే వచ్చిన బిడ్డ... రాత్రినుంచి లొల్లే... ఇంట్లకెల్లి ఎల్లెదాక పోరు పెట్టింది నా కోడలు. ఏడ్సుకుంటచ్చిన.

“ఒక్కడన్న చదువుకుంటే అక్కరకత్తడనుకుంటే గిట్లుంది బిడ్డ. ఊల్లె పాలేర్లుగుండి బతికే కొడుకులే ఇంత కూడు వెడుతండ్రు. ఈ బంగ్లాలల్ల ఇంటికో కథెల్లుతది కొడుక? అవ్వయ్యలకు గంజి పోసెటోల్లు తక్కువే బిడ్డ. ఎంతయిన అడ్డాలనాడు బిడ్డలు కాని గడ్డాలనాడా బిడ్డ. మా నసిబెట్లుంటే గట్లయితది”

ఆమె ఏడుస్తూ చెబుతూనే ఉంది.

ఇంతలో బస్సొచ్చింది. కూర్చున్న వాళ్ళంతా లేచి గబగబా బస్సెక్కారు. అయిలయ్యా ఆ వృద్ధురాల్ని బస్సెక్కించి తానూ ఎక్కాడు.

బస్సులో కూర్చున్న అయిలయ్యకు ఇంటికిపోయే వరకూ ఆమె మాటలే చెవుల్లో గింగురుమంటున్నాయి.



తెలంగాణ జిల్లాల్లో భూపోరాటాలు, ఎన్‌కౌంటర్లు, అన్నల కార్యక్రమాలు, జనజీవితంపై విశేషంగా ప్రభావం చూపుతున్నాయి. దొరల పునాదులు కదులుతున్నాయి. దొర పదం తిట్టు పద మనేట్టుగా తయారవుతోంది. ఉద్యమ పార్టీల మధ్య తగవులూ జరుగుతున్నాయి. కల్లోలమవుతున్న ప్రాంతాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించే యోచనలో ఉంది. ప్రభుత్వ పోరాటాల నణచడానికి ప్రభుత్వాలు తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నాయి. గ్రామాలు అగ్నిగుండాలుగా మారుతున్నాయి.

మేధావులు కొంతమందైనా ప్రజాపోరాటాలపట్ల అనుకూలవైఖరినే ప్రదర్శిస్తున్నారు. యూనివర్శిటీల్లో, కాలేజీల్లో విద్యార్థుల మధ్య సిద్ధాంత చర్చలు జరుగుతున్నాయి. తెలంగాణలోని చాలా గ్రామాల్లో పోరాటాల ప్రభావముంది. దేశానికి స్వాతంత్ర్యం

వచ్చిందని చెప్పబడే సమయానికి తెలంగాణలో మధ్యతరగతి దాదాపు శూన్యం. ఓ దిక్కు జమీందార్లు, మరోదిక్కు భూమిలేని పేదలు లేదా అతిస్వల్పంగా భూమున్న వాళ్ళుండేవారు. ప్రతి ఇంట్లో ఒకరిద్దరికంటే ఎక్కువగా చదువుకున్నవాళ్ళు ఉండేవారు కారు. ఊళ్ళోకొచ్చిన ఉత్తరాలను పట్వారో, వీధి బడిపంతులో చదివేవారు. ఇప్పుడు చదువుకున్నవాళ్ళ సంఖ్యా పెరిగింది. వలసలూ పెరిగాయి. మధ్యతరగతీ పెరుగుతోంది. వారి భయాలూ పెరుగుతున్నాయి. వీరోచిత పోరాటాలు చేసేవాళ్ళతో పాటు పోరాటాలంటే భయపడేవాళ్ళూ తయారవుతున్నారు. అవ్వ బాంచెనయ్యా బాంచెనంటూ బతికిన వాళ్ళే తెగించి పోరాటాలు చేస్తున్నారు.

మరోదిక్కు ఒకే పార్టీకి చెందిన ముఖ్యమంత్రిని దింపి మరొకర్ని గద్దెపై కూర్చుండబెట్టారు అధిష్ఠాన వర్గంవారు. స్వతంత్ర్యం వచ్చినప్పట్నుండీ ఒకే పార్టీ అధికారంలో ఉండటం, నాలుగేళ్ళలో నలుగురు ముఖ్యమంత్రుల మార్పు. ప్రజల అసంతృప్తి. ముఖ్యమంత్రి మారినప్పుడల్లా మతకలహాలు జరగడం పెల్లుబుకుతున్న ప్రజా పోరాటాలు, వీటినన్నిటినీ దృష్టిలో పెట్టుకొని కొత్త రాజకీయ పార్టీని స్థాపించాడు రామారావు. తన గంభీరోపన్యాసాలతో, హావభావాలతో, నటనా వైదుష్యంతో అంతకుముందున్న పార్టీనెండగడుతున్నాడు. రాష్ట్రమంతటా సుడిగాలిలా పర్యటిస్తూ ప్రజల నాకర్షిస్తున్నాడు.

"రైతన్నలే అన్నదాతలు, నేనూ రైతు బిడ్డనే" అంటూ రైతు బాంధవుడిలా ఉపన్యాసాలు దంచుతున్నాడు.

"నక్సలైట్లే దేశభక్తులు. వాళ్ళకు నా లాల్‌సలామ్" అని చెబుతున్నాడు.

"న్యాయమైన సమస్యలపై పోరాటం చేస్తున్న అన్నలకు నా మద్దతుంటుంది. వాళ్ళ నణచివేస్తున్న ప్రభుత్వ చర్యలను ఖండించండి. వాళ్ళకు నా ఎర్రెర్ర దండాలు" అని తెలంగాణలోని ప్రతిసభలోనూ చెబుతున్నాడు.

ఎన్నికల సమయంలో మరీ ప్రభంజనంలా మారుమూల పల్లెల్లో కూడా తిరిగాడు. ప్రజల్లో కొత్త ఆశలను రేకెత్తించాడు.

మూడున్నర దశాబ్దాలుగా దేశాన్ని పాలిస్తున్న పార్టీని తొమ్మిది నెలలక్రితం వచ్చిన పార్టీ ఓడించి గద్దెనెక్కడం అపూర్వమే.

కొత్తపార్టీ రాకతో రాజకీయాలు అందని మ్రానిపండ్లు కావని తెలిపోయింది.

ఎన్టీఆర్ ముఖ్యమంత్రయిన తర్వాత ఆంధ్రుల ఆత్మగౌరవాన్ని కాపాడుతానని, దేశభాషలందు తెలుగు లెస్సయని, తేనెలొలుకు భాష తెలుగు భాషని, అధికారభాషగా తెలుగు నమలుచేస్తానని గంభీరంగా, ఆకర్షణీయంగా ఉపన్యాసాలిస్తున్నాడు. తెలుగు భాషా సంస్కృతులను పరిరక్షిస్తానని గంభీరోపన్యాసాలిస్తున్నాడు.

తెలుగు భాషా సంస్కృతులపై ప్రేమాభిమానాలున్నవారికి ఆ మాటలు కొంతైనా ఊరటనిస్తున్నాయి. విద్యా సాంస్కృతిక రంగాల్లోనైనా కొన్ని మార్పులు వస్తాయని ఆశిస్తున్నారు.

ఆ మార్పుల మాటేమో కాని ప్రైవేట్ పాఠశాలల సంఖ్య గణనీయంగా పెరుగుతోంది. ఎమ్‌సెట్‌పై మోజూ ఎక్కువయింది. విద్యార్థుల్లో పోటీతత్వం ప్రబలుతోంది.

కళాశాలల్లో ఇప్పుడు రాజకీయ చర్చలతో పాటు కెరియరిజంపై మోజు పెరుగుతోంది.

నక్సలైట్లే దేశభక్తులని ఎన్నికల ముందు బహిరంగ సభల్లో చెప్పిన వ్యక్తే వాళ్లపై ఉక్కు పాదాన్ని మోపుతున్నాడు.

"అన్నలారా! మీరు చేయదలుచుకున్నవన్నీ నేను చేసి చూపెడతాను. మీరు

హింస మానుకొని జన జీవన ప్రవంతిలో కలవండి. మీకు ఉపాధి చూపిస్తాను" అని ప్రకటనలిస్తున్నాడు.

కొత్తగా అధికారం స్వీకరించిన పార్టీపై ప్రజల ఆశలు... అన్నల కార్యక్రమాలు... పెరుగుతున్న రూపాయి సంస్కృతి... తెలంగాణలో ఎదుగుతున్న మధ్యతరగతి... ఊళ్ళలో వస్తున్న చైతన్యం... అంబేద్కర్ సంఘాల కార్యక్రమాల్తో తెలంగాణ గ్రామాల్లో రకరకాల భావాల మధ్య సంఘర్షణ ఉంది. ఇదో సంధియుగంలా ఉంది.

ఇలాంటి సమయంలో శ్రీనివాస్ హైస్కూల్ చదువులోకొచ్చాడు. వివిధ సిద్ధాంతాల, భావాల, మార్పుల ప్రభావం ఆతనిపై స్వల్పంగానైనా పడుతోంది. స్నేహితులు పెరుగుతున్నారు. విద్యార్థి యూనియన్ ఎన్నికల్లో పోటీచేయడానికి కూడా సిద్ధమయ్యాడు.

ఆ విషయం తెలుసుకున్న అయిలయ్య కొడుకును పిలిచి అలా చేయవద్దంటూ కోపానికొచ్చాడు.

"బుద్ధిగ చదువుకోక ఎన్నికలేంది? మన కెందుకు ఈ రాజకీయాలు? నిన్ను చదివించడమే కష్టమవుతోందంటే ఇదోటా? " అన్నాడు.

"ఎందుకు వద్దంటున్నవు బాపూ! రెడ్డోల్లు, వెలుమోల్లు పోటీ చేస్తున్నరు. నేనెందుకు చేయొద్దు. అందరు నన్నే చెయ్యమంటున్నరు".

"దీన్తో వచ్చేదేముంది? చదువు పాడవడం తప్పితే"

"చదువేం పాడుగాదు బాపూ! ఇవేమన్నా అసెంబ్లీ ఎన్నికలా? బడి లీడర్ కోసం జరిగే ఎన్నికలే కదా! ఎందుకంత భయం? "

"మరి నీకెదురుగా నిల్చునేదెవరు? "

"ప్రభాకర్ రెడ్డి"

"తిరుమల్ రెడ్డి కొడుకేనా? "

"అవును బాపూ! అయితేంది? "

"వాళ్ళు మాజీ దొరలు. బాగా సాగించుకున్నవాళ్ళు. ఇప్పుడు అన్నల భయానికలా ఉంటున్నారు కాని వాళ్ళు తక్కువవాళ్ళు కాదు. వాళ్ళతో పోటీ మనకెందుకు? నువ్వు పోటీ చేయొద్దు"

"బాపూ! నువ్వన్నిటికీ భయపడుతావు? వాళ్ళు దొరలయితే కావచ్చు కాని ఎవ్వలకు దొరలు? మనూరి సర్పంచిప్పుడు బెస్తయినే కదా! ఇప్పుడు దొరతనాలున్నయ్యా? అసలు దొరంటేంది బాపూ? "

"నువ్వు వయసుకు మించిన పెద్దపెద్ద మాటలు మాట్లాడుతున్నావు. పులి బక్కబడ్డా చారలు బక్కవడనట్టు దొరలు పగవడుతరు. సమయంజూసి పగదీర్చుకుంటరు. నా చిన్నతనంల జరిగిన సంగతొక్కటున్నది విను. గోపాల్‌రావ్ అని పేటూళ్లో మేరకులానికి చెందిన పిల్లవాడొకడు బాగా చదువుకుంటుండేవాడు. అన్నిట్లో ఫస్టే... ఆ పిల్లవాడు బాగా చదవడం దొరల పిల్లలకు కన్నుగుట్టింది. మేరోడు అంత మంచిగ చదువుడేందని మంటకొచ్చింద్రు. చెర్లో ఈతగొడుదాం రమ్మని తీసుకపోయింద్రు, నీల్లల్ల ముంచి చంపేసింద్రు"

"ఆ కాలం పోయింది బాపు. ఇప్పుడు అందరు తెలివికొస్తున్నరు. చాలామంది చదువుకుంటున్నరు. ఎవ్వలనేమన్నా ఊర్కోరు"

ఆరిందలా మాట్లాడుతున్న కొడుకును చూస్తున్నాడు అయిలయ్య. పని పాటలు చేస్తూ బతికేవాళ్ళ పిల్లల్లో ఏ పని చేయకుండా సుఖంగా బతికే వాళ్ళ పిల్లల్లో కంటే మానసిక పరిపక్వత తొందరగా రావడం కొత్త విషయం కాకున్నా శ్రీనివాస్ అంత అనుభవజ్ఞుడిలా మాట్లాడటం ఆశ్చర్యమనిపిస్తోంది అయిలయ్యకు.

దొరలతో తన చేదు అనుభవాలను చెప్పాడు. వాళ్ళతో వైరం వద్దన్నాడు.

"ఇందులో వైరమేం లేదు బాపూ! ఎవ్వ

లైన పోటీ చెయ్యచ్చు. దీన్నెవ్వలు పెద్దగా తీసుకోరు"

అయినా కొడుకును పోటీచేయనీయకూడ దనే అనుకుంటున్నాడు అయిలయ్య.

"శీనూ! మనకే యూనియన్లొద్దు, ఎన్నిక లొద్దు, నువ్వు బాగా చదువుకొని పైకి రావాలి. సంవత్సరం నుంచి నీకు మంచి మార్కులొస్తున్నాయి. ఈ ఎన్నికల్లో పాల్గొని మళ్లీ వెనుకకు పోకు"

"బాపూ.. నేనేం చేస్తున్నా బాగానే చదువుకుంటాను. ప్రతిదానికీ నన్నభ్యంతరపెట్టకు. నేనేం చేయకుండా పుస్తకాల పురుగుగా మాత్రమే ఉండాలంటే గుంటూర్లోనో, ఇంకెక్కడకో రెసిడెన్షియల్ బళ్ళో వేయి. మనోహర్ రెడ్డి కొడుకక్కడ చదువుతున్నాడు కదా!"

కొడుకునుంచి ఈ ప్రసక్తి వస్తుందని ఊహించలేదు అయిలయ్య. ఇక్కడి పరిస్థితులను గమనిస్తున్న అయిలయ్యకు తన కొడుకును బయట చదివించాలనున్నా అతని ఆర్థిక పరిస్థితి సహకరించడంలేదు.

"చాల్చాలు.. బాగ మాటలు నేర్చినవు" అన్నాడు అయిలయ్య.

"సరేగాని మీ సార్లనేవేవో ప్రశ్నలడిగి తికమకపెడ్తున్నావట" అన్నాడు.

"నేనేం తికమకపెట్టలేదు నాన్నా. గ్రహణాల గూర్చి ప్రశ్నడిగాను. తెలుగు సారేమో రాహుకేతువులు సూర్యచంద్రులను మింగితే గ్రహణాలు పడుతాయని చెప్పాడు. సైన్సు సారేమో సూర్యుడు మండుతున్న అగ్నిగోళమని చెప్పాడు. అగ్నిగోళాన్ని ఎంత రాక్షసులయినా ఎట్లా మింగుతారని అడిగాను. ఇది తప్పా? "

శ్రీనివాస్ ప్రశ్నకు జవాబు చెప్పడం అయిలయ్యకు చాతకావడంలేదు. "సార్లు చెప్పింది విను. ఏవేవో ప్రశ్నలెందుకు నీకు. నువ్వు ఎవరెవరితోనో స్నేహాలు చేస్తున్నా వట. జాగ్రత్తగుండుమని విజయేందర్ రెడ్డి సారు చెప్పాడు. ఈ స్నేహాలకు తోడు విద్యార్థి యూనియన్లోనూ పాల్గొంటే ఇంకెలా ఉంటుంది" అన్నాడు.

"బాబూ! నేనేంకాను. నువ్వేం భయపడద్దు. నేను ఎన్నికల్లో పాల్గొంటాను. బాగా చదువుతాను. నాకు మంచి మార్కులు రాకుంటే అప్పుడడుగు"

సరేననక తప్పలేదు అయిలయ్యకు.

★ ★ ★

శ్రీనివాస్ విద్యార్థి యూనియన్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు.

గ్రంథాలయాల వారోత్సవాల్లో భాగంగా ఆ పాఠశాలలో ఒక్కరోజు కార్యక్రమం చేయాలని నిర్ణయించారు. ప్రెసిడెంట్‌గా శ్రీనివాస్ అందుకోసం చాలానే ప్రయత్నించాడు.

సాయంత్రం నాలుగ్గంటలకు పాఠశాల ముందున్న మైదానంలో విద్యార్థులందర్నీ సమావేశపరిచారు. వాళ్ళను అల్లరి చేయకుండా ఉంచడానికి ఉపాధ్యాయులు తంటాలు పడుతున్నారు.

విద్యార్థులకెదురుగా ఉన్న నాలుగు కుర్చీల్లో ఆ ప్రాంతపువాడైన ఓ కవీ ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు, తెలుగు ఉపాధ్యాయుడు, మరొకరు కూర్చున్నారు.

చిరిగిన చొక్కానైనా తొడుక్కో
మంచి పుస్తకాన్ని కొనుక్కో
మిస్ ఎ మీల్
బయ్ ఎ బుక్
గో విత్ బుక్స్

అన్న వాక్యాలు బోర్డుమీద రాసున్నాయి.

తెలుగు ఉపాధ్యాయుడు లేచి నిల్చున్నాడు. "గ్రంథాలయాలు, పుస్తకాల ప్రాముఖ్యత గూర్చి నాలుగు వాక్యాలు చెప్పి కవి రాములుగారు మాట్లాడుతారు" అని చెప్పి కూర్చున్నాడు.

రాములు లేచి శ్రద్ధగా వింటున్న చిన్నారులను చూసి చిరునవ్వు నవ్వాడు. నిదానంగా మాట్లాడటం మొదలుపెట్టాడు.

"మంచి పుస్తకాన్ని మించిన స్నేహితుడు లేడు. మంచి మిత్రుడు, ఆత్మీయుడైన బంధువు చేయలేని పనిని ఓ మంచి పుస్తకం చేస్తుంది. ఎన్నో సమస్యలకు పరిష్కారం చూపేవి మంచి పుస్తకాలు. చరిత్రలో మహనీయులుగా పేర్కొనబడిన వాళ్ళు, మహనీయులైన వాళ్ళంతా పుస్తకాలతో విడదీయరాని సంబంధమున్నవాళ్ళే. ఓ రచయిత తనకు పుస్తకాలతో పరిచయం ఉండి ఉండకుంటే ఎప్పుడో ఆత్మహత్య చేసుకొని ఉండేవాడినంటాడు. పుస్తకాలు జీవితంకన్నా కూడా ఆదరణీయమైనవి అన్నాడో ప్రపంచ ప్రఖ్యాత రచయిత. మంచి పుస్తకాలు మనల్ని ఓదారుస్తాయి. కర్తవ్యాన్ని నిర్దేశిస్తాయి. మనం సేదదీర్చుకునేలా చేస్తాయి.

"వీరేశలింగం పంతులుగారి గురించి మీకు తెలుసనుకుంటాను. గొప్ప సంఘసంస్కర్త. తన జీవితకాలాన్ని, ధనాన్నంతా సంఘ సంస్కరణ కోసమే అంకితం చేసిన త్యాగశీలి. అతనికి చిన్నతనంలో వసుచరిత్రను చదవాలనే కోర్కె ఉండేది. దాన్ని కొనడానికతని దగ్గర డబ్బుల్లేవు. షాపువాడి నడుగుతే ఇవ్వనంటున్నాడు. పాఠశాలలో చెల్లించాల్సిన ఫీజు డబ్బుతో దాన్ని కొన్నాడు. ఫీజు కట్టడం లేదని ఉపాధ్యాయుడు అతని తల్లిదండ్రులకు ఫిర్యాదు చేశాడు. విషయం తెలుసుకున్న పెద్దలు వీరేశలింగాన్ని దండించలేదు. స్కూలు ఫీజు డబ్బును సినిమాలకు, షికార్లకు కాకుండా పుస్తకం కొనడానికుపయోగించినందుకు అభినందించారు. అలాంటి తల్లిదండ్రులూ అవసరమే. మిమ్మల్ని ఫీజులు కట్టకుండా పుస్తకాలు కొనుక్కోమ్మనడం లేదు గాని మంచి పుస్తకాలు కొనుక్కునే అలవాటు చిన్నప్పట్నుంచే చేసుకుంటే మంచిది.

"కాని విద్యార్థులకిప్పుడు పుస్తకాలంటే కేవలం పాఠ్యపుస్తకాలే అయిపోతున్నాయి. అదే లోకమయి పోతోంది. 'వాట్ని చదవాల్సిందే. మంచి మార్కులు తెచ్చుకోవాల్సిందే. విద్యార్థి దశలో మొట్టమొదటి ప్రాముఖ్యత పాఠ్యపుస్తకాలకివ్వాల్సిందే. కాని వాటితోపాటు సామాజిక అవగాహనను కల్గించే మంచి పుస్తకాలూ చదవాలి. మహనీయుల చరిత్రలు, వాళ్లు రాసిన పుస్తకాలు, ప్రాచీన ఆధునిక సాహిత్యాలనన్నిటినీ చదవడం చిన్నతనం నుండే అలవాటు చేసుకోవాలి. పాఠ్యపుస్తకాలు డిగ్రీ రావడానికి, ఇతరత్రా జీవించడానికుపయోగపడితే, ఇతర పుస్తకాలు జీవితాన్ని తీర్చిదిద్దుకోవడానికుపయోగపడతాయి. మనకు దారి చూపుతాయి. అందుకే గోర్కీ 'జీవితంద్వారా తెలుసుకోలేని ఎన్నో విషయాలను పుస్తకాల ద్వారా తెలుసుకోవచ్చ'నంటాడు"

పుస్తకాలు చదవాల్సిన అవసరాన్ని గూర్చి సవివరంగా చెప్పిన రాములు ఉపన్యాసానికందరూ ముగ్ధులయ్యారు.

"మీకు పాఠశాలలో మంచి గ్రంధాలయముందనుకుంటాను. పంచాయితాఫీసులో ఓ తీరు లైబ్రరీ ఉండటం నేను చూశాను. మీ ఇతర వ్యాపకాలను తగ్గించుకొని మంచి పుస్తకాలను చదివే అలవాటు చేసుకోండి. దుబారా ఖర్చులను మానుకొని మంచి పుస్తకాలను కొనుక్కునే అలవాటు చేసుకోండి" అని ముగించాడు రాములు.

"సార్... మేమడిగినా పుస్తకాలిస్తలేదు సార్"

"మార్కులేమో రావు కాని కథల పుస్తకాలు చదువుతావు అని తిడుతండు మా లైబ్రరీ సారు"

"మా నాన్న వేరే పుస్తకం చదివితే కొడుతడు"

"మాకు హోంవర్క్, క్లాసు పుస్తకాలు చదువటానికే టైము చాల్తలేదు"

తలో ప్రశ్న వేస్తున్నారు విద్యార్థులు. వాళ్ళకేవో సర్ది చెప్పి కూర్చోబెట్టాడు ప్రధానోపాధ్యాయుడు.

"పాఠ్యపుస్తకాలు బాగా చదివింతర్వాతే సమయం చేసుకొని వేరే మంచి పుస్తకాలు చదవండి. అలవాటు చేసుకుంటే ఇది అసాధ్యమేం కాదు. మీ తల్లిదండ్రులను వేధించకుండా మీకు దొరికిన డబ్బుల్లోంచే మిగుల్చుకొని పుస్తకాలు కొనుక్కోండి. ఓ విషయం మాత్రం నిజం. మనసుంటే మార్గముంటుంది" అని చెప్పి ముగించాడు విద్యాకమిటీ అధ్యక్షుడు.

ప్రధానోపాధ్యాయులు తనవంతు ఉపన్యాసాన్ని ప్రారంభించారు.

"స్వాతంత్ర్యం రాకముందు మన రాష్ట్రంలో గ్రంథాలయాలు, గ్రంథాలయోద్యమాలు స్వాతంత్ర్యపోరాటంతో ముడివడుండేవి. వాటి పాత్ర గణనీయంగా ఉండేది. ఇప్పుడు వాటి పాత్ర ప్రశ్నార్థకమైంది. ఏ పాఠశాలలోనూ ఇప్పుడు సరైన గ్రంథాలయం లేదు. ఉన్నవరకైనా వాట్నుపయోగించుకోవాలి.

"ఇంతకుముందు పాఠశాలల్లో డిబేటింగ్ కాంపిటీషన్లుండేవి. వ్యాసరచన పోటీల్లో విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొనేవారు. ఇప్పుడవి నామమాత్రంగానే జరుగుతున్నాయి. వాటిపై ఎవరూ పెద్దగా శ్రద్ధచూపడం లేదు. ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు, విద్యార్థులు అందరూ మార్కులు, మార్కులనే అంటున్నారు. సర్టిఫికెట్లను పొందడమే చదువులక్ష్యమవుతోంది. చదువుల మాటెలా ఉన్నా పైఅధికార్లూ పాస్ కావడాలనే టార్గెట్లుగా పెడుతున్నారు. అందువల్ల ఏం చేద్దామనుకున్నా చేయలేకపోతున్నాం. పిల్లలను సహజమైన ఆటపాటలకు దూరం చేస్తున్న ఈ చదువుల పయనమెటో తెలియడంలేదు" అంటూ ఇంకెన్నో విషయాలను చెప్పాడు హెచ్.ఎమ్.

పసివాళ్ళ హృదయాలు తెల్లకాగితాల్లాంటివి. తెల్లకాగితంపై ఏది రాస్తే అదే ఉంటుంది. పిల్లలపై చిన్ననాటి సంఘటనల ప్రభావం గణనీయంగా ఉంటుంది. పిల్లల బుర్రల్లో మనం విషం నింపకూడదు. కులమత, ఇతర సంకుచిత భావాలకతీతంగా పిల్లల నెదగనీయాలని ఈ గ్రంథాలయాల వారోత్సవాల సందర్భంగా మనవి చేసుకుంటున్నాను" అని ముగింపు వాక్యాలుగా చెప్పాడు మరొకాయన.

ఈ ఉపన్యాసాలవల్ల ఎంతో తెలుసుకున్నట్టే అనిపిస్తుంది శ్రీనివాస్‌కు.

మీటింగయిపోయిన తర్వాత ఇంటికెళ్తుంటే నెల రోజుల క్రితం త్రైమాసిక పరీక్షల సమయంలో జరిగిన సంఘటన జ్ఞాపకం వచ్చింది.

ఆరోజు ఇంగ్లీషు పరీక్ష. శ్రీనివాస్ పక్కనే కూర్చున్నాడు కిష్టారెడ్డి. ఈ చదువులపై అతనికి పెద్దగా నమ్మకం లేదు. బాగా చదివి బాగుపడతానన్న ఆశాలేదు. అందువల్ల కిష్టారెడ్డి కష్టపడి చదవడు. ఎలాగూ స్టాగ్నేషన్ లేదు కాబట్టి పదవతరగతివరకు పోతే ఆ తర్వాత చూసుకోవచ్చనుకుంటున్నాడు.

కిష్టారెడ్డి పరీక్ష రాస్తున్నాడు.

చిన్నచిన్న చిట్టీలపై జవాబులు రాసుకొచ్చి ఎంతో నేర్పుగా కాపీ చేస్తున్నాడు. అయినా రాజిరెడ్డి సారతన్ని పట్టుకున్నాడు.

కిష్టారెడ్డి కళ్ళవెంట నీళ్ళొస్తున్నాయి.

"సార్... నన్ను పట్టుకుంటే మీకేమొస్తుంది?" అన్నాడు.

"అది నా డ్యూటీ"

"మీ డ్యూటీ మమ్మల్ని ఫెయిల్ చేయడమా సార్"

"మీరు కాపీ కొడ్తున్నా చూస్తూ ఉండాలా? అయితే పరీక్షలెందుకు?"

"ఓ దిక్కు ఇవన్నీ పనికిరాని చదువులని కొందరు చెబుతున్నరు. మరో దిక్కేమో ఇవ్వేమో ఒరుగబెడుతయని రాత్రింబవళ్ళు చదువుతున్నరు. వీటితోని నేనేదో బాగుపడతననుకునేరు సారు"

"మరలాంటప్పుడు చదువు బందుజెయ్య కేంది? "

"బందు చెయ్యాల్ననే ఉంది సార్. కాని మా బాపు ఊకుంటలేడు. చదువుకోకుంటే వీపు పగలగొడుతనంటున్నడు. రెడ్డికులంల పుట్టినందుకైనా కొంచెమన్న చదువుకోకుంటె ట్లని తిడ్తున్నడు. ఆయన బాధకే నేను బడి కస్తున్న. పదిదాక ఎట్లయిన ఎల్లుడేనాయె. నకలోగికలో చేసి పదిల పాసయితె కింద మీదవడి గా బస్సు కండక్టరు నౌకరన్న దొరుకక పోతదా అనుకుంటున్న. మా బాపు గూడ గదే అనుకుంటున్నడు. నేను బాగేం జదువ. నన్ను పట్టుకుంటే మీకేమ స్తదో చెప్పుండ్రి"

తన చదువు ఉద్దేశ్యాన్ని చెప్పాడు కిష్టా రెడ్డి.

"రెడ్డీ... దయచేసి నువ్వేం మాట్లాడకు. భవిష్యత్తులో నువ్వేం జేస్తె నాకేందిగాని ఇప్పుడయితె వెల్లిపో. ఇది పరీక్ష గది అంద రికీ డిస్టబవుతుంది. ఇంకేం మాట్లాడకుండా వెళ్ళిపో"

"సార్! నేను వెళ్ళిపోత. కాని, మీరొక్క సారి నా కళ్ళలోకి సూటిగా చూడండి. మీ గుండెమీద చెయ్యేసుకొని చెప్పండి. మీరె ప్పుడూ కాపీ చెయ్యకుండనే పాసయింద్రా? మీ సంగతులబట్టి చూస్తుంటే మీరట్ల పాసయ్యే రకం కాదని తెలుస్తనే ఉంది. అబద్ధమాడకుండ చెప్పండి సార్!"

కిష్టారెడ్డి మాటలు రాజిరెడ్డి సారుకు సూటిగా తగిలాయి. అతన్ని ఎక్స్‌రే తీసి నిలబెట్టినట్టు చేశాయి.

అవును. తాను కాపీ చేశాడు. ఎన్నోసార్లు పట్టుబడ్డాడు కూడా! అయినా తన సంగతి వీడికెలా తెలుసు? తాను కాపీ కొట్టాడు కాబట్టి వీన్ని వదిలిపెట్టాలా? తనలోతాను కొద్దిక్షణాలు ఘర్షణపడ్డాడు రాజిరెడ్డి.

"కిష్టారెడ్డీ... అవన్నీ నాకు తెలియవు. గవర్నమెంటు మారింతర్వాత స్ట్రిక్టు ఆర్డర్లొచ్చాయి. కాపీ కొట్టడం మానుకోవాలి"

"పరీక్షలు స్ట్రిక్టుగా చేస్తే సరిపోతదా సార్. అన్ని బళ్ళల్లో సార్లున్నరా? ఉన్న సార్లయిన సరిగ్గ చెప్పుతున్నరా? ఇవ్వన్ని అట్లనే ఉంచి పరీక్షలు స్ట్రిక్టంటే సరిపో తదా? "

"ఎక్కువ మాట్లాడకు. అవన్నీ చర్చించేదిక్కడ కాదు. ఇప్పుడు కాదు. కాపీ చేయకుండా రాసుకో"

అని పేపరిచ్చాడు రాజిరెడ్డి.

తనకొచ్చింది రాసి సమయం పూర్తయేవ రకు కూర్చుండి బయటకొచ్చాడు కిష్టారెడ్డి.

శ్రీనివాస్‌తో కలిసి ఇంటికెళ్తున్నాడు కిష్టా రెడ్డి.

"రాజిరెడ్డి సారు మంచోడే. కొంత కోప గొండి" అన్నాడు.

"ఏం మంచోడురా... చదువనోన్ని బూతులు తిడుతడు"

"సారేనాయె... తిడితేంది"

"ఎంతసారయినా బూతులు తిడితే ఏమ న్నట్టు? చదువు చెప్పే సారే బూతులు తిడితె ఎట్ల? కొందరు తల్లిదండ్రులు కూడా పిల్లలను బూతులు తిడ్తరు. ఇది మంచి విషయం గాదు" అన్నాడు శ్రీనివాస్.

"ఆ బుద్ధి పెద్దోళ్ళకుండాలె. అందరేమో కాని వాడున్నడు చూసినావురా! విశ్వనాథం సారు. వాన్ని కిందపెడితే వానలుండయి. మీద పెడితే ఎండలుండయి. వానికి పెళ్ల యిందో కాదో తెలియదుగాని పెళ్ళయితే పిల్లలు పుట్టరు. కాకుంటే పెళ్ళేకాదు" శాప నార్థాలు పెట్టాడు కిష్టారెడ్డి.

కిష్టారెడ్డి కృష్ణలీలలు జ్ఞాపకం వచ్చి తన లోతాను నవ్వుకున్నాడు శ్రీనివాస్.

నవ్వుకుంటూనే ఇంట్లో కడుగుపెట్టాడు.

★ ★ ★

మహిళా ప్రధానిగా ఇందిరాగాంధీ స్త్రీలు ఏ రంగంలోనూ తక్కువకాదని రుజువు చేసింది. దేశానికి నిరంకుశత్వం యొక్క

రుచీ చూపించింది. గరీబీ హటావో మాటెలా ఉన్నా వివిధ కారణాలవల్ల వేర్పాటు వాదాలు, ప్రాంతీయ తత్వాలు ఎక్కువయ్యాయి.

అయితే పదహారేళ్ళకు పైగా ప్రధాన మంత్రి పదవిని నిర్వహించిన ఇందిర తన సెక్యూరిటీ సిబ్బంది తుపాకీ గుళ్ళకే బలైపోయింది.

ఆమె హత్యకు నిరసనగా దేశమంతటా హింస పెల్లుబికింది. ఆమె మరణంవల్ల ప్రజల్లో వచ్చిన సానుభూతితో ఆ తర్వాతి ఎన్నికల్లో రాజీవ్‌గాంధీ దేశ ప్రధానిగా ఎన్నికయ్యాడు. యువకుడైన రాజీవ్ నేతృత్వంలో దేశం మునుముందుకు పోతుందన్న ప్రచారం జరుగుతోంది.

దేశాన్ని ఇరవై ఒకటవ శతాబ్దంలోకి తీసుకెళ్తానని, సైన్సు, టెక్నాలజీరంగాలలో దేశం మరింత ముందుకు పోయేట్టు ప్రయత్నిస్తానని చెబుతున్నాడు రాజీవ్. చదువులు సైన్సు టెక్నాలజీ విషయాలపై మోజుతో కెరియరిజం ప్రధానంగా సాగుతున్నాయి.

మధ్యంతర ఎన్నికల్లో అఖండ విజయం సాధించిన ఎన్టీఆర్ తిరుగులేని నాయకున్నానుకుంటున్నాడు. తెలుగు రక్షకున్ననుకుంటున్నాడు. తెలుగు భాషా సంస్కృతులను రక్షించడానికి, అభివృద్ధి చేయడానికి మౌళికమైన మార్పులేవీ చేయకున్నా తెలుగు సంస్థలన్నిటినీ విలీనం చేసి తెలుగు యూనివర్శిటి స్థాపించాడు. మాతృభాషలో చదువుకున్నవారికి ఉద్యోగాల్లో ప్రాముఖ్యత నిస్తామన్న ప్రచారం జరుగుతోంది.

కేంద్రంలో దేశాన్ని ఇరవైఒకటవ శతాబ్దంలోకి తీసుకెళ్తానన్న ఉపన్యాసాలు.

రాష్ట్రంలో తెలుగు భాషా సంస్కృతులు, ఆత్మగౌరవం గూర్చి గంభీరోపన్యాసాలు.

మరోదిక్కు తెలంగాణలోని కొన్ని ప్రాంతాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించటంతో అక్కడి పరిస్థితి మరింత కల్లోలంగా తయారైంది. భూస్వాములు, అన్నల మధ్య; అన్నలు, పోలీసుల మధ్య; మత పార్టీలు, అన్నలమధ్య అన్నల్లోని వివిధ గ్రూపుల మధ్య హత్యలు, ప్రతి హత్యలు జరుగుతున్నాయి. గ్రామాలు అగ్నిగోళాలవుతున్నాయి.

పారిశ్రామిక ప్రాంతాల్లో విప్లవకర ట్రేడ్ యూనియన్ల బలం పెరుగుతోంది. మొట్టమొదటిసారిగా సింగరేణి పారిశ్రామిక ప్రాంతంలో సారాను బందుచేయాలన్న గోడరాతలు, సారా వ్యతిరేక పోరాటాలు ప్రారంభమయ్యాయి. సారా కంట్రాక్టర్లను కొట్టడం, సారా అమ్మేవాళ్ళమీద దాడిచేయడం, సారా పొట్లాలను కాల్చివేయడం లాంటి వార్తలు పత్రికల్లో దర్శనమిస్తున్నాయి.

పోరాటాలతోపాటు తెలంగాణలో మధ్య తరగతీ గణనీయంగా పెరుగుతోంది. మధ్యతరగతిలోని అలసత్వం, వాళ్ళకున్న భద్రతా భావం వాళ్ళను పోరాటాలకు దూరం జరుపుతున్నాయి. మధ్యతరగతికెదిగిన వాళ్ళు పోరాటాలకు దూరం జరుగుతున్నా ఉద్యమ ప్రాంతం విస్తరిస్తూనే ఉంది.

ఇంగ్లీషు మీడియం పాఠశాలల సంఖ్య గణనీయంగా పెరుగుతోంది. ప్రైవేటు పాఠశాలలూ పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి. విద్య వ్యాపారమవుతోంది. ఏ కొంత ఆర్థిక స్తోమతున్నవాళ్ళైనా తమ పిల్లలను ప్రైవేటు పాఠశాలల్లోనే చదివిస్తున్నారు. అదీ ఇంగ్లీషు మీడియంలో.

ఇన్ని కల్లోలాలు, సంక్షోభాలు, సంఘర్షణల మధ్య ఉంటూ కూడా సాంబయ్యలాంటి వాళ్ళెంతోమంది మధ్యతరగతి ఊబిలోకి కూరుకుపోతున్నారు. కాలేజీ రోజుల్లో ఉన్న ఆదర్శాలు అప్పుడప్పుడు గుర్తుకొస్తున్నా అన్నిటితో రాజీపడటం తప్పడం లేదు. ఒక్కోసారి ఎటూ తేల్చుకోలేని స్థితి

లోకి నెట్టబడుతూ కుటుంబానికే పరిమితమై పిల్లల చదువు, ఆర్థికస్థితి మెరుగుదల గూర్చి కలలు కంటున్నారు.

పడక కుర్చీలో కూర్చున్నాడు సాంబయ్య. జరుగుతున్న పరిణామాల గూర్చి ఆలోచిస్తున్న సాంబయ్యకదోలా ఉంది. అతనికెదురుగా సోఫాలో కూర్చొని ఆనంద్, కవిత చదువుకుంటున్నారు.

ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్
హౌ ఐ వండర్ వాట్ యూ ఆర్?

కవిత ఇంగ్లీషు రైమ్స్ బట్టీ పడుతోంది. ఆనంద్ ఇంటీజర్స్ చాప్టర్ ప్రాబ్లమ్స్‌తో తంటాలు పడుతున్నాడు.

తండ్రి ఎదురుగా కూర్చోవడంవల్ల వాళ్ళు భయంభయంగా చదువుకుంటున్నారు. నిజానికి వాళ్ళకిప్పుడు చదువుకోవాలని లేదు. కలర్ టీ.వీ.లో వస్తున్న రంగురంగుల కార్యక్రమాలను చూడాలనీ, స్నేహితులతో ఆడుకోవాలనీ ఉంది. హాలిడే కావడం వల్ల గోదావరిఖనిలో ఉన్న నాన్నగారి స్నేహితులింటికి వెళ్ళి వాళ్ళ పిల్లలతో ఎగరాలనుంది. ఇవేమీ చేయనీయకుండా తండ్రి ఎదురుగా కూర్చోబెట్టుకొని చదివిస్తుండటం వాళ్ళకు నచ్చడంలేదు. తండ్రిపై కోపంగా ఉంది.

తండ్రి తమను గమనిస్తున్నాడేమోనని చూస్తూ భయంభయంగా చదువుకుంటున్నారు. తేపకోసారి అటూ ఇటూ చూడటం మొక్కుబడి కన్నట్టుగా చదువుతుండటం గమనిస్తున్నాడు సాంబయ్య.

"మంచిగ చదువుకోండ్రి. చదివినంతసేపైనా మనసుపెట్టి చదవాలి. చిత్తం శివుని మీద మనసు చెప్పులమీదన్నట్టుంటే చదువు రాదు. మొక్కుబడికన్నట్టు చదవడం కాదు కావాల్సింది"

వాళ్ళు తలూపి తమ పనిలో నిమగ్నమయ్యారు.



కవిత పాఠం చదువుతున్నా తండ్రి అన్న సామెత గూర్చే ఆలోచిస్తోంది. అదేంటో ఆమెకు బోధపళ్లేదు. ఆమెలో ఏదైనా ప్రశ్న తలెత్తితే సమాధానం దొరికేవరకు తోచదు. కొద్దిసేపాగి తండ్రినడిగింది కవిత.

"నాన్నా! చిత్తం శివునిమీద మనసు చెప్పులమీద అంటే ఏంటి?"

కూతురు దిక్కు నవ్వుతూ చూసాడు సాంబయ్య.

పిల్లలడిగిన ప్రశ్నలకు జవాబులివ్వకుంటే వాళ్లలోని ప్రశ్నించే గుణం, ఆసక్తి నశించి పోతాయని సాంబయ్యకు తెలుసు. తెలుసుకోవాలన్న కాంక్షను కసురుకొని నాశనం చేయడం సాంబయ్యకు నచ్చదు. అందువల్ల పిల్లలెంత చొప్పదంటు ప్రశ్నలేసినా సమాధానం చెప్పడం అలవాటు చేసుకున్నాడు.

"గుడిలోపలికెళ్ళేప్పుడు చెప్పులు బయట విడుస్తారు కదా! దేవుని ముందు చేతులు జోడించి నిల్చున్నా వాళ్ళ మనసు మాత్రం చెప్పులమీదే ఉంటుంది వాట్నెవరైనా ఎత్తుకుపోతారన్న భయంవల్ల. ఏ పనినైనా మనసు లగ్నం చేసి చేయకపోతే ఈ సామెత వాడుతారు. మీ చదువూ అలాగే ఉంది. చేతిలోనేమో పుస్తకం, మనసేమో టీ.వీ.మీదో, ఆటల మీదో."

అర్థమైనట్టు తలలూపారు పిల్లలిద్దరూ...

"మీరు బాగా చదువుకోవాలని మీతో పాటు చచ్చేచెడీ నేను కూర్చొని చదివిస్తుంటే మీరేమొ చొప్పదంటు ప్రశ్నలడిగి సమయం వృథా చేస్తుంటారు. మన కాలనీలోనైతే పిల్లల చదువులు తల్లిదండ్రుల చదువులే అయిపోతున్నాయి."

"డాడీ! చొప్పదంటు ప్రశ్నలంటేంది?" అడిగింది కవిత. "మరో ప్రశ్నా? చొప్పదంటు ప్రశ్నలంటే వ్యర్థమైన ప్రశ్నలేసే అలవాటు. ప్రతి పిచ్చి అనుమానం మీదా ప్రశ్నలొద్దు"

"అలాగే డాడీ! ఈసారి మంచి ప్రశ్నలే అడుగుతాం" అంది కవిత.

మమ్మీ, డాడీ అని పిలవడమే సరస్వతి

కిష్టం. పిల్లలకలా పిలవమనే చెప్పింది. సాంబయ్యకు మాత్రమలా పిలిపించుకోవడ మిష్టంలేదు. అమ్మా, నాన్న అనే పిలుపులో ఉన్న సామీప్యం మమ్మీ, డాడీలలో లేదం టాడు సాంబయ్య. అలాగే పిలువమని చెప్పాడు పిల్లలకు. ఆనంద్ నాన్నా అనే పిలుస్తాడు. కాని కవిత డాడీ అని అంటుంది.

"డాడీ అని పిలువొద్దని నీకెన్నిసార్లు చెప్పాను? "

ఆ మాటలు విని బయటిగదిలోకొచ్చింది సరస్వతి.

"చాలామంది పిల్లలు అలాగే పిలుస్తుంటే మీరెందుకు వద్దంటున్నారు? అలా పిలిస్తే తప్పేంటి? మీ పేరును మార్చుకొమ్మంటే జన్మతః వచ్చింది మార్చుకోవద్దన్నారు. అచ్చయ్య అమరేందర్‌రావు కాలేదా? ఎల్లయ్య నాగేందర్‌రావు కాలేదా? మీవన్నీ వెనుకబడిన ఆలోచనలు. ఇప్పుడేమో పిల్ల ల్నలా పిలువొద్దంటున్నారు" అంది.

"నీకు మమ్మీ అని పిలిపించుకోవాల నుంటే నాకభ్యంతరం లేదని ఎప్పుడో చెప్పాను కాదోయ్. నాకు మాత్రమలా పిలి పించుకోవడమిష్టం లేదు. అలా పిలిస్తే నాకెక్కడికో వెళ్ళిపోతున్నట్టనిపిస్తుంటుంది"

"మీ మతం మీదే" అంటూ ఇంట్లోకె ళ్ళింది సరస్వతి. పిల్లలిద్దరూ తండ్రి చెప్పి నట్టు అమ్మా, నాన్న అనే పిలుస్తున్నారు. కాని కవిత అప్పుడప్పుడు మమ్మీ, డాడీ అంటుంది.

"అది తిట్టుపదమా నాన్నా! ఎప్పుడో ఓసారి పిలిచినా వద్దంటారు"

"కాదుగాని ఎందుకో నాకలా పిలిస్తే మంచిగనిపించదు"

పిల్లలిద్దరూ చదువుకుంటున్నారు.

మరో అరగంట గడిచింది.

"ఆదివారంనాడన్నా ఆడుకోనిస్తేంది నాన్నా? " అంది కవిత.

"అంటే మీరేరోజూ ఆడుకోవడం లేదా? రోజూ ఎంతో కొంతసేపు ఆడుకుంటూనే ఉన్నారుకదా! సాయంత్రమెలాగూ ఆడుకుంటారని చదువుకొమ్మంటే మీకు దుఃఖమొస్తుంది. పరీక్షలు దగ్గరికొస్తు న్నాయి. "

"మరి మీరాడుకోలేదా నాన్నా? "

"నాకు ఆటలమీద పెద్ద ఇంటరెస్టుండేది కాదు. అయినా నాకు ఆడుకోవడానికి సమ యమెక్కడ దొరికింది? ఎప్పుడన్నా సమయం దొరుకితే పొలందిక్కో, చేలదిక్కో పోయేవాణ్ణి. కొద్దిసేపాడుకునేవాణ్ణి"

"మీరు హాయిగా తోటల్లో పనిచేశారు. కొద్దిసేపైనా ఆడుకున్నారు. మమ్మల్నేమొ చదువు చదువని చంపుతున్నారు" అన్నాడు ఆనంద్.

పిల్లలను బలవంతంగా కూచోబెట్టి చదివించడం ఇష్టంలేకున్నా రోజు రోజుకూ పెరుగుతున్న పోటీని తట్టుకోవడానికి చది వించక తప్పదనుకుంటున్నాడు సాంబయ్య. పొలాల్లో చేల్లో పనిచేయడమంటే సినిమా లోలా డాన్సులు చేస్తూ తిరుగడమనుకుం టున్న ఆనంద్‌కు అందులో ఉన్న కష్టాలను చెప్పాలనుకుంటున్నాడు.

"పొలంలో పనిచేయడమంటే సుఖమను కుంటున్నావా ఆనంద్, నేను వ్యవసాయప్ప నులు చేసింది సరదాకోసం కాదు. అవసరా నికి. నువ్వు చేస్తానంటే పొలం, రెండెడ్లు కొంటాను. దున్నుతావా? "

నవ్వుతూ అన్నాడు సాంబయ్య.

"నాన్నా! నాకు ఎడ్లబండెక్కాలనుంది. మనూరుకెప్పుడెళ్దాం. ఎప్పుడు పోదామన్నా అమ్మ వద్దంటుంది. ఎప్పుడు పోదాం నాన్నా? " అంది కవిత.

ఆ మాటలతో సాంబయ్య ముఖం చిన్న బోయింది.

తాను క్రమక్రమంగా ఊరుకు దూరమవు తున్నాడు. కారణాలెన్నున్నా తాను ఊరికె ళ్ళడం తక్కువ చేశాడు. ఎప్పుడైనా ఊరికె

ళితే తల్లిదండ్రులు నిష్ఠూరంగా మాట్లాడం తనను బాధకు గురిచేస్తుంది. వీటికితోడు సరస్వతికి తరచుగా ఊరికెళ్ళడం అసలే ఇష్టముండదు. ఈ పరిస్థితుల్లో పిల్లలతో ఊరికెళ్ళడం మరీ తక్కువవుతుంది.

పరిస్థితులను మననం చేసుకున్నాడు సాంబయ్య.

"వీలైనప్పుడు తీసుకెళ్తాను. కాని మీ సంగతే బాగాలేదు. మీకు సుఖం పెరిగిన కొద్దీ చదువు తక్కువవుతోంది. నేను గోడకున్న దిగుట్లో చిన్న దీపం పెట్టుకొని చదువుకునేవాణ్ణి. మా నాన్న వద్దన్నా చదివేవాణ్ణి. అప్పుడు కందీల కొనుక్కునే వసతి కూడా లేదు. మీకేమో ట్యూబ్‌లైట్ల వెల్తుర్లో, సోఫాలమీద కూచొని చదవడం కూడా కష్టమవుతోంది"

"నాన్నా! కందీలంటే ఏంది?" అడిగాడు ఆనంద్.

"నాన్నా! 'దిగుడంటేంది...?" అంది కవిత.

పిల్లలు పల్లెలో ఉపయోగించే పదాలకు దూరమవుతుండటం గమనిస్తున్నాడు సాంబయ్య. ఇంగ్లీషు మీడియంలో చదివితే పిల్లలు తెలుగులో అతి చిన్న పదాలకు కూడా అర్థాలడగటం జ్ఞాపకం చేసుకున్నాడు.

తాను పల్లెలో పుట్టి పెరిగినా, తనకు పల్లెంటే ప్రేమాభిమానాలున్నా తన పిల్లలు క్రమక్రమంగా ఆ జీవితానికే దూరమవుతుండటం బాధాకరంగా ఉంది. అయినా ఏంచేయలేని నిస్సహాయత...

కందీల, దిగుడు పదాల కర్థాలు వివరించి చెబుతున్నాడు సాంబయ్య. వంటగదిలోంచి బయట కొచ్చింది సరస్వతి.

"మీ చదువు చరిత్ర, మీ పల్లెల మీది ప్రేమ గూర్చి పిల్లలకు చెబుతూ పిల్లల సమయాన్ని తినేస్తున్నారు మీరు. చదువుకోమ్మంటూ పక్కన కూర్చొని వాళ్ళతో మాట్లాడుతూ టైమ్ వేస్ట్ చేస్తున్నారు. ఇక్కడుంటే పిల్లలు చదివినట్టే! గుంటూరో, నెల్లూరో పంపండి వీళ్ళను..." అంది.

"అమ్మా! ఆపని చెయ్యండి. మమ్మల్ని ద్దర్నీ రెసిడెన్షియల్‌లో చదివించడానికి నాన్న జీతం సరిపోతుందా?" అన్నాడు ఆనంద్.

తమను వదిలి తల్లిదండ్రులుండలేరని వాళ్ళకు తెలుసు.

ఆనంద్ మాటలకేమనాలో తోచక నవ్వి ఊరుకున్నాడు సాంబయ్య.

"అమ్మకైతే మరీ ఆరాటం. చదువు... చదువు... చదువని చంపుకతింటది. చదువుతూనే ఉన్నంగద. డొట్లొస్తే నాన్ననడు గొద్దా?" అంది కవిత.

"నీబోడి డొట్లు నువ్వు, నీకొచ్చేవన్నీ వెధవ డొట్లే. మీరిక్కడ చదివేట్టులేరు. మిమ్మల్ని హాస్టల్లో ఉంచడం తప్పదు. మేముంచమని అనుకునేరు. రాంకులు రాకుంటే ఉంచడమే..." అంది సరస్వతి.

"గోపాలరావు అంకుల్ కొడుకును విజయవాడల హాస్టల్లుంచుతే తప్పించుకొని వచ్చిండు. మేంగూడా అట్లనే చేస్తం..."

"ఆనంద్, అనవసరపు మాటలు మాట్లాడకు. అధిక ప్రసంగాలు చేయకు... బాగా చదువుకోండి" అన్నాడు సాంబయ్య.

"మీ అలుసు వల్లనే వాళ్ళిలా చేస్తున్నారు..." అంది సరస్వతి.

"అమ్మా, నాన్నా, మా చదువు గురించి మీరెందుకు పోట్లాడుతారు? మేం బాగానే చదువుకుంటాం. మీరు కోరుకున్నట్టే డాక్టర్లమో, ఇంజనీర్లమో, కలెక్టర్లమో అవుతాం. సరేనా...?"

"ఆఁ.. గీ మొకాలే కలెక్టర్లయ్యేవి?"

"మా ముఖాలకేమైందమ్మా, కలెక్టర్లవడానికిలాంటి ముఖాలుండాలనేమన్నుందా...? సరేగాని అమ్మా, అందరూ బాగానే చదివారనుకుందాం. అందరూ మీరనుకున్నట్టు అవుతారా?"

తెలివైన ప్రశ్న వేశాడు ఆనంద్.

"అందరెలా అవుతారు. కొద్దిమందే అవుతారు? అంటే ఎన్ని సీట్లుంటే అంత మంది" అన్నాడు సాంబయ్య.

"మరీ కొద్దిమంది ఎవరో ఎలాగైనా అవుతారుకదా నాన్నా? "

"ఆ కొద్దిమందిలోనే మనముండాలని ప్రయత్నం చేయడం, అన్ని అవకాశాలున్న మనకివి అసాధ్యమేం కాదు"

"అలా అయితే మీ సమస్యలు తీరినట్టేనా నాన్నా? "

"ఆనంద్! నువ్వేదో తెలివిగా మాట్లాడుతున్నాననుకోకు. ఇప్పుడు రోజురోజుకు పోటీ పెరిగిపోతోంది. ఒకరికంటే ఒకరెక్కువన్నట్టుగా పోటీపడి చదువుతున్నారు. పోటీని తట్టుకోడానికిది తప్పదు. పిల్లల భవిష్యత్తు కోసం తల్లిదండ్రులు పడుతున్న ఆందోళన మీకు తెలియడంలేదు. ఏ డిగ్రీయో చదివితే ఉద్యోగం వస్తుందన్న నమ్మకం లేదు. ఒక వేళ వచ్చినా ఎదుగూ బొదుగూలేని జీవితం. అందుకే ఈ తంటాలంతా..."

ఏదో మాట్లాడబోతున్న ఆనంద్ తండ్రి సీరియస్‌గా ఉండటం చూసి ఆగాడు. కొద్ది క్షణాలాగి.

"మరి ఇంజనీరింగ్ చదువుతే జాబ్ తప్పకుండా వస్తుందా నాన్నా"

"ప్రస్తుతానికైతే వెనుకోముందో వచ్చే అవకాశాలున్నాయి. మీ చదువులయి పోయేవరకెలా ఉంటుందో తెలియదు. అయినా ఆర్డినరీ డిగ్రీకంటే కొంత నయమే కదా! నేను చదువుకునే రోజుల్లో ఏ వసతులూ లేవు. అయినా కష్టపడి చదువుకున్నాను. నాకు మొన్న మొన్నటి వరకు టీవీలు తెలియవు. మీరు చిన్నప్పట్నుంచే చూస్తున్నారు. నేను రోజూ ఏడేడు పద్నాలుగు కిలోమీటర్లు నడిచిపోయి హైస్కూల్ చదువు చదివాను. మిమ్మల్ని గజాల దూరానికి కూడా స్కూటర్ మీద దింపాలి. ఇవన్నున్నా బాగా చదువాలంటే మేం మీకు యముళ్లలా కనబడుతున్నాం. అంతేకదా? "

తండ్రికి కోపమొచ్చిందని గ్రహించాడు ఆనంద్...

ఒక్కచదువు విషయంలో తప్ప అన్ని విషయాల్లోనూ ఎంతో స్నేహపూరితంగా ఉండే తండ్రంటే పిల్లలకు ప్రేమాభిమానాలే...

"మేం బాగా చదువుకుంటాం నాన్నా! నేను తప్పక కలెక్టర్‌నన్న, ఇంజనీర్‌నన్న అవుత..." అన్నాడు ఆనంద్.

"నేను డాక్టర్ నవుతా..." ముద్దుముద్దుగా అంది కవిత.

"పట్టుదలంటూ ఉంటే ఏదీ అసాధ్యం కాదు..." అని లేచి నిల్చున్నాడు సాంబయ్య.

బెడ్‌రూంలోకి పోబోతుండగా అన్నాడు ఆనంద్.

"నాన్నా! ఈసారి దసరా సెలవులకు మమ్మల్ని ఊరికి తప్పకుండా తీసుకెళ్ళాలి. శ్రీనివాస్ బావతో ఆడుకుంటాం..."

"తప్పకుండా..." అన్నాడు సాంబయ్య.

"ఆ బురదలో, దోమల్లో, మురికిలో ఏముందని చూపెడతారు వాళ్ళకు. సెలవుల్లో హైదరాబాద్‌కో, తిరుపతికో తీసుకెళ్ళి తిప్పుకొచ్చినా అర్థముంది"

"సరస్వతీ! పల్లెలో పుట్టిపెరిగిన నువ్విలా అనడం ఏంబాగాలేదు. ఇక్కడి జీవితమే యాంత్రికమై పోయిందంటే పిల్లల్ని కూడా ఊరుకు దూరం చేయడమేం బాగాలేదు"

"అక్కడ మనకు గన్నపెట్టుందని ఊకూకె పోదామా? మీవాళ్లు మీతోని మంచిగుంటే మీరాగేవారే కాదనుకుంటాను...

అయినా ఊళ్ళిప్పుడెట్లున్నయో మీకు తెలువదు. పుస్తకాల్లో చదివినట్టేంలేవు. ఒకర్ని చూసి ఒక రోర్వడంలేదక్కడ. కొంచెం తెల్లగున్నవాళ్ళను చూస్తే ఏడ్పు, ఘోరమైన రాజకీయాలు, అన్నల గొడవ,ఊళ్ళకంటె ఇలాంటి ప్రదేశాలే నయ

మిప్పుడు. ఇక్కడ ఒకర్నొకరు పట్టించుకోరు ఇదేనయం, ఆ ఏడ్పు కంటె" అంది సరస్వతి.

"అమ్మా... నువ్వు రాకున్నా మేమైనా పోతం" తల్లితో అని "శీనుబావ ఇప్పుడు ఇంటర్‌గదా... ఇంజనీరింగ్‌ల చేరుతడా తర్వాత? " అన్నాడు ఆనంద్ తండ్రితో.

"వాడు లెక్కల్లో ఆవరేజ్. అందువల్ల సీటు రావడం కష్టమే. పోగా వాడు ఏవేవో స్టూడెంటు యూనియన్లని తిరుగుతున్నాడట. ఈసారెళ్ళినప్పుడు చెప్పాలి. మీరైతే బాగా చదవండి" అని బెడ్‌రూంలో కెళ్ళాడు సాంబయ్య.

సరస్వతి వంటపనుల్లో ఉంది.

పిల్లలు చదువుకుంటున్నారు.

మంచంలో వెల్లకిలా పడుకున్నాడు సాంబయ్య. పిల్లలను పాఠ్యపుస్తకాలకే అంకితంచేస్తూ చదివిస్తుండటం అతనికి బాధాకరంగానే ఉంది.



ఈ చదువులు పిల్లలకేం నేర్పుతున్నాయి? అన్నిటికీ దూరమవుతూ పుస్తకాలకే అంకితమై చదివే ఈ చదువుల లక్ష్యం ఉద్యోగం సంపాదించుకోవటమేనా? ఈ చదువులు జీవితం గూర్చేం చెబుతున్నాయి? తాను పిల్లల కన్యాయం చేస్తున్నాడా?

చుట్టూ ఉన్న సమాజాన్ని, పరిస్థితులను చూస్తున్న సాంబయ్యకు అంతకంటె మార్గం కనబడటంలేదు.

ఆలోచిస్తూనే ఉన్నాడు సాంబయ్య.

"నాన్నా... నాన్నా! సత్యకుమార్ అంకులొచ్చిండు..."

బెడ్‌రూమ్‌లోకొస్తూ అన్నాడు ఆనంద్.

సాంబయ్య లేచి బయటికొచ్చాడు.

"నువ్వు డ్రెస్ చేసుకొని రాపో..." అన్నాడు సత్యకుమార్.

"ఏంటి? ఏంజరిగింది? "

"చెబుతాగాని త్వరగా డ్రెస్ చేసుకొని రా..."

ఐదు నిమిషాల్లో డ్రెస్ చేసుకొని ముందు రూంలో కొచ్చాడు సాంబయ్య.

"వెంకటేశ్వరరెడ్డి కొడుకు ఆత్మహత్య చేసుకున్నాడు..."

పిడుగులాంటివార్త చెప్పాడు సత్యకుమార్.

తలుపునానుకొనున్న సరస్వతి వణికిపోయింది.

సాంబయ్యకూ కడుపులోంచి వణుకొస్తోంది.

"నువ్వు చెపుతున్నదేంటి సత్యకుమార్...? ఇంటర్ చేసిన పిల్లవాడా...? ఆ అబ్బాయి పేరు మృత్యుంజయం కదా? "

"అవును, ఆ బాబే. మొన్ననే ఎంసెట్ రాసాడు..."

"రాంకు రాలేదా? "

"క్వాలిపై కూడా కాలేదట. తండ్రి బాగా తిట్టాడట. ఆ అవమానాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడు"

ఆ మాటలు విన్న సాంబయ్య మనసు తీరనివేదనకు గురయింది. కడుపులోంచి దుఃఖం తన్నుకొచ్చింది. చిన్నారులను చూస్తూ రెండు కన్నీటిబొట్లు రాల్చాడు. కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకున్నాడు.

"ఆనంద్, కవితా! కొంచెం సేపాడుకోండ్రి మీరు, ఆ తర్వాతొచ్చి అన్నం తిని చదువుకోండ్రి, నేనొచ్చేవరకు ఆలస్యం కావచ్చు" అని సత్యకుమార్ వెంట వెళ్ళిపోయాడు సాంబయ్య.

"ఈ కాలం పిల్లలకేం చెప్పొచ్చేట్టులేదు. వాళ్ళ అభిరుచులకు భిన్నంగా బలవంతంగా దేన్నీ రుద్దకూడదు. అలా చేస్తే ఇలాంటి ఫలితాలొస్తాయి..." అన్నాడు సత్యకుమార్.

"అది నిజమేకాని తల్లిదండ్రులు మాత్రమేం చేస్తారు చెప్పు? పిల్లలు బాగా సెటిల్ కావాలన్న తపన ఓ దిక్కు... డాక్టరో, ఇంజనీరో అయితే ఏదోవిధంగా జీవితంలో స్థిరపడుతారన్న ఆశ మరో దిక్కు. ఈ కాంపిటీషన్ యుగంలో ఎవర్ని తప్పుపట్టాలి? "

"ఏం? ఇంజనీర్ కాకుంటే బతుకడా? ఆ బాబు కింటరెస్టులేకున్నా బలవంతంగా చదివించాలని చూడటమెందుకు? లాంగ్‌టర్మ్ కోచింగ్‌కెళ్ళినా సీటు రాలేదు. తండ్రేమన్నాడో ఆత్మహత్య చేసుకున్నాడు"

"తండ్రిగా కొడుకు మంచి భవిష్యత్తు నాశించడంలో తప్పేంలేదు. కాని పిల్లవాడు ఇంటరెస్టును దృష్టిలోకి తీసుకునేదుండె..."

"ఎంత భవిష్యత్తయినా అన్యాయంగా పిల్లవాన్ని చంపినట్టాయె. పద్దెనిమిదేళ్ళ పిల్లవాన్ని స్నేహితుల ముందవమానిస్తే ఆతని 'ఇగో' దెబ్బతినదా? "

సాంబయ్యేం మాట్లాడలేదు.

తనను స్నేహితులముందు అవమానించొద్దని ఆనందన్న మాటలు జ్ఞాపకం వచ్చా

యతనికి.

"నేనిక్కడ ఆఫీసర్‌ను... నా కూతురు ఎం. బి. బి. యస్ చదువుతోంది. ఇంకో కొడుకు బి. ఇ. చేస్తున్నాడు. వీడూ ఇంజనీర్ కావాలి. కాకుంటే తలవంపులవుతుంది...అని విపరీతమైన ఒత్తిడికి గురిచేశాడు ఆ బాబును. సీటురాలేదని తిట్టికొట్టాడని, ఇప్పుడు పేద్ద ఇంజనీరయిండయినే కొడుకు"

సత్యకుమార్ మాటలకు భయంతో వణికిపోయాడు సాంబయ్య.

తానూ వెంకటేశ్వరరెడ్డి మార్గంలోనే పోతున్నాడా? నో...నో... తన పిల్లలు ఇంటలిజెంట్లు. అయినా వాళ్ళు తానన్నది చదవనంటే తను బలవంతం చేయడు. మరి సరస్వతి ఊకుంటుందా? తాను కన్విన్స్ చేస్తాడు. తనకలాంటి అవసరం రాకపోవచ్చు

"తన అభిప్రాయాన్ని మృత్యుంజయం చెప్పినా వినకుండా బలవంతంచేసి పిల్లవాన్ని హత్యచేసి ఇప్పుడేడిస్తే ఏంలాభం?" అన్నాడు సాంబయ్య.

వెంకటేశ్వరరెడ్డి ఇంటిముందు దృశ్యం హృదయవిదారకంగా ఉంది. శవంపైబడి రెడ్డి, అతని భార్య భోరు భోరున ఏడుస్తున్నారు.

"నిద్ర మాత్రలు మింగి చనిపోయాడు..." అనుకుంటున్నారక్కడున్న వాళ్ళు.

శవం పాంటుజేబులో కాగితమున్నట్టు గ్రహించారొకరు.

దాన్ని బయటకు తీసి చదువసాగాడో ఉద్యోగి.

"ఇంజనీరింగ్ చదవడం నావల్లకాదు, ఆ మాథమ్యాటిక్స్, ఫిజిక్స్ అవీ నావల్లకాదు. కాని నన్ను ఇంజనీర్నే చేయాలని నాన్న పట్టుదల. ఆర్ట్స్ సబ్జెక్టులతో పి. జి. చేసి ఏదైనా ఉద్యోగం సంపాదించుకుంటానన్న నామాటకేమాత్రం విలువీయలేదు నాన్న. నేను ఖచ్చితంగా ఇంజనీర్నే కావాలన్నాడు

"ఎమ్‌సెట్‌లో సీటు రాలేదు. తండ్రిగా ఆయన ఆవేదన, ఆరాటం, భవిష్యత్తు గూర్చి ఆందోళన నాకు తెలుసు. ఇందులో నాన్న తప్పేంలేకపోవచ్చు కాని, నావల్ల ఇంజనీరింగ్ చేయడంకాదు. సీటు రాకుంటే వేరే రాష్ట్రంలోనైనా ఇంజనీరింగ్ చదివించాలనుకుంటున్నాడు మా నాన్న. ఆ ప్రయత్నంలోనే ఉన్నాడు. అది నాకిష్టంలేదు. ఆ లెక్కలు, ఆ భౌతికశాస్త్రం చదవడం నావల్ల కావు. అందుకే నేనాత్మహత్య చేసుకుంటున్నాను. నాచావుకెవరూ బాధ్యులుకారు. మానాన్న నీ విషయంలో దోషిని చేయకూడదు. ఎందుకంటే దాదాపందరు నాన్నలూ మా నాన్నలాగే ఆలోచిస్తున్నారు. ఒక్క విషయం, నా ఈ చావు కొందరు యువకులనైనా బలవంతపు చదువులనుండి కాపాడితే చాలు.

ఈ లోకం నుండి శాశ్వతంగా సెలవు తీసుకుంటున్న మృత్యుంజయరెడ్డి..."

ఆ లేఖను వింటున్న అందరి కడుపులూ శోకభాండాలే అయ్యాయి.



"శీనును చదివించడమిక నావల్ల కాదు..." స్పష్టంగా చెప్పేశాడు అయిలయ్య.

"ఏం...? ఎందుకు...? నీకిదేం బుద్ధి...? " అడిగాడు సాంబయ్య.

"ఇన్ని రోజులూ ఊళ్ళోనే ఉన్నట్టాయె... పదివరకూళ్ళోనే ఉందా? ఇంటర్ దగ్గర్లో ఉన్న సుల్తానాబాద్‌లోనే చదివించానా? ఇప్పుడు దూరం పంపి చదివించాలంటే నావల్లకాదు..."

"చూడు మామయ్యా! బాపెలా మాట్లాడు తున్నాడో! నేనొక్కసారి కూడా ఏ తరగతి లోనూ ఫెయిల్ కాలేదు. ఫెయిలవుతున్న వాళ్ళు కూడా పైచదువులు చదువుతుంటే నన్ను చదువు మానమంటున్నాడు బాపు..."

"మా పాసయినవు తియ్యి. అత్తెసరు మార్కులతోని. ఎమ్‌సెట్‌లో నువ్వు ఎలిజి బుల్ కూడా కాలేదు. చదివినా డాక్టర్రో, ఇంజనీరో చదివితే లాభం? బియ్యేలు, ఎమ్మేలు చదివితే ఉద్యోగమొస్తదా? ఎంత మంది రోడ్లమీద తిరగడంలేదు? " అన్నాడు అయిలయ్య.

"నా నుంచయినంతవరకు చదివాను. నాదేం తప్పుంది? బాపూ! ఇంజనీర్ చది వితే తప్ప బతుకరా? "

తండ్రీ కొడుకులిద్దరూ వాదించుకుంటు న్నారు. తాను డిగ్రీ చదువుతానని శ్రీని వాస్, చదివించడం తనవల్ల కాదని అయి లయ్య. ఎవరిని వాళ్లు సమర్థించుకోవడానికి రకరకాలుగా ప్రయత్నిస్తున్నారు.

"ఒక్క కొడుకును చదివించడానికేంది? వాడు చదువుకుంటానంటే వద్దని ఇంట్లో కూచోబెడుతారా. వాడ్ని చదువుకోనియ్, కష్టపడుదాం" అంది శాంతమ్మ.

"చెప్పడం అందరు చెప్పొచ్చు కాని నేనెం దుకొద్దంటున్నానో మీకర్థమవుతుంది? "

"తమ్మీ! ఈయనకేమైందో తెలుస్తలేదు. శ్రీనివాస్‌నెంతవరకైనా చదివిస్తాననేవాడు. ఇప్పుడేమో ఇట్ల జేస్తున్నడు. ఆయన మన సులేముందో తెలుస్తలేదు"

"ఏంటి బావా! ఇదంతా నాకర్థం కావడం లేదు" అన్నాడు సాంబయ్య. నెలరోజు ల్నుంచి తండ్రీకొడుకుల నడుమ ఇదే వాదు లాట.

కొడుకుపై ఎంతో ప్రేమున్నా ఉద్యోగా లయి తల్లిదండ్రులను వదిలిపెట్టిన పిల్ల లను చూస్తుంటే అయిలయ్యకు భయంగా ఉంది. పెద్ద చదువులు చదివి శ్రీనివాస్ తనకు కాకుండా పోతాడేమోనని భయపడ్తు న్నాడు.

అయిలయ్యేం మాట్లాడటంలేదు.

"అన్నయ్యా! ఈ కాలంలో కూడా పిల్లల్ని చదివించననడం ఏం బాగుంది? అష్టక ష్టాలు పడైనా చదివిస్తున్నారిప్పుడు" అంది సరస్వతి.

అయినా మౌనమే వహించాడు అయి లయ్య.

"బావా! మౌనం సమాధానం కాదు. నువ్విలా చేయడం నాకు నచ్చడంలేదు. పరి స్థితులనుకూలించకపోవడంవల్ల చదువు మానుకున్న నువ్వు నీ కొడుకును అకార ణంగా మాన్పిస్తాననడం ఏం బాగుంది? ఈ చదువులేం చెబుతున్నాయన్న వాద మున్నా ఏదో మేరకివి జీవితంలో ఉపయో గపడ్తాయి."

"మనం చదువుకుంటున్న కాలంలో వెనుకబడిన కులాల్లో చదువుకోవడం కొంత కష్టంగానే ఉండేది. ఇప్పుడు గొప్పగా మార్పులొచ్చాయని చెప్పడంలేదు కాని మనమూ చదివించగలుగు తున్నాం. అన్ని కులాల్లోంచి చదువుకున్న వాళ్ళు, ఉద్యోగం చేసేవాళ్లు రావడం ప్రారంభమైన తర్వాత కుటుంబాల్లో, గ్రామాల్లో మార్పులొస్తున్నాయి. నాగరి కత, కొంత ఆధునికత పెరుగుతోంది. ఫలితాల సంగతెలా ఉన్నా ఇప్పుడు చదు వులకు ప్రాముఖ్యత పెరిగింది. మనకా

లంలో పదవతరగతో, ఇంటరో చదివితే చదువుకున్నట్టే లెక్క. ఇప్పుడు మినిమమ్ చదువు డిగ్రీ అయింది. అన్నీ తెలిసుండి కూడా నువ్విలా మొండిపట్టెందుకు పడ్తున్నావో నాకర్థం కావడంలేదు"

ఇక నోరు విప్పక తప్పలేదు అయిలయ్యకు.

"బావా! నా కొడుకుని బాగా చదివించాలన్న ఆలోచనుండేది నిజమే. కాని పరిస్థితులను చూస్తుంటే చదివించకపోవడమే మంచిదనిపిస్తోంది. చదివించి వాడిని నాకు కాకుండా చేసుకోవడమెందుకు? ఉద్యమాల వల్ల మార్పులొచ్చిన మాట నిజమే. కాని అవిప్పుడు ఒకర్నొకరు చంపుకోవడాలుగా మారిపోయాయి. హత్యలు, ఎన్‌కౌంటర్లు నిత్యకృత్యాలయ్యాయి. బాకుల్లాంటి కుర్రాళ్లెందరో బలవుతున్నారు. పోలీసాఫీసర్ని చంపారని ఊళ్లను పోలీసోళ్లు అల్లకల్లోలం చేయడం తెలుసుకదా! ఇలాంటి పరిస్థితుల్లో శీనును బయటకు పంపి చదివించడం బాగుంటుందా? "

అయిలయ్య చెప్పిందాంట్లో నిజాలున్నా అందుకోసం చదువాపుజేయాల్సిన అవసరం కనబడటంలేదు సాంబయ్యకు.

"బావా! నువ్వన్న మాటలు చెరువుమీద అలిగినట్టున్నాయి. ఏవేవో ఆందోళనలు జరుగుతున్నాయని పిల్లల్ని చదువులు మాన్పించేవాళ్ళున్నారా? ఏరాష్ట్రంలో మాత్ర మిప్పుడు ఆందోళనలు లేవు? అట్లని అందరూ ఇంట్లో కూర్చుంటున్నారా? అయినా మీవాడి చదువుకూ, ఉద్యమాలకు సంబంధమేంటి? "

"ఏ సంబంధమూ లేకుంటే నాకెందుకీ భయం. శ్రీనివాస్ ఎన్నికలని ఇక్కడ గెలిచాడు. కాలేజ్‌లో లీడర్‌షిప్ చేశాడు. పోలీసులతోని తన్నులు తిన్నడు. ఓసారి పోలీసులరెస్టు చేస్తే రెండువేలు ఖర్చయింది నీకు తెలుసుకదా! నా కళ్ళ ముందుంటూనే ఇట్ల చేస్తే కాలేజ్‌లో ఇంకెలా చేస్తాడు? ఉన్నొక కొడుకును బలిచేసుకోవడం నాకిష్టం లేదు. వాళ్ళ ఉద్దేశం మంచిదేకాని నాకంత ధైర్యంలేదు. ఆ మారణహోమాలు మరీ నాకు వణుకుపుట్టిస్తున్నాయి"

అసలు కారణం చెప్పాడు అయిలయ్య.

"నీ మాటలు వింటుంటే ఏదో శాస్త్రం చెప్పినట్టుంది. ఉద్యమాలవల్ల ఫలితాలనను భవించవచ్చు కాని మన ప్రమేయం మాత్ర మేముండొద్దంటే ఎలా? మన కడుపులో చల్ల అసలే కదలవద్దనడం. బాగుంది నీ వాదన. మన సమాజంలో ఇలాంటి ధోరణుంది కాబట్టే ఉద్యమాలు సంపూర్ణ విజయం సాధించడంలేదు. తెలంగాణాలో మధ్యతరగతి ఎదిగింతర్వాత ఉద్యమాలకు ఎడమొహంగా ఉంటున్నారు.

ఆ మాటలకు మొదటిసారిగా బావమీద కోపమొచ్చింది అయిలయ్యకు.

"మధ్యతరగతి పెరిగిందేమోకాని నాలాంటి రైతు మాత్రం రోజురోజుకూ కిందికే దిగజారుతున్నాడు. ఎంతోమంది వ్యవసాయదారులు కూలీలవుతున్నారు. కొంతమంది ఊళ్లే వదిలిపోతున్నారు బావా! ముడ్డి నాది కాకుంటే పట్నందాక దేకమన్నాడట ఒకాయన. ఉద్యమాలను సమర్థిస్తున్నావుకదా, నీ కొడుకును ఉద్యమాల పేరుమీద బలిచేయగలవా? కనీసం ఆవిషయమైనా ఊహించగలవా? "

అయిలయ్యకు తనమీద కోపమొచ్చిందని గ్రహించాడు సాంబయ్య. అతని మాటలు సూటిగానే తగిలాయి.

"బావా! నన్ను నువ్వు తప్పుగా అర్థం చేసుకుంటున్నావు. ఉద్యమాల విషయంలో నాకే స్పష్టమైన అభిప్రాయాల్లేవు. అలాంటప్పుడు శ్రీనివాస్‌నందులో దూకమని సలహా ఇస్తానంటావా? నేను ఉన్న పరిస్థితుల గూర్చి మాత్రమే చెబుతున్నాను. కాలేజీ చదువులకెళ్తే శ్రీనివాస్ అందులోకెళ్తాడేమోనని నువ్వు భయపడటం సరైంది కాదు.

ఊళ్లలోఉన్న వాళ్లెంతమంది వాళ్లతో కల వడం లేదు? నిజానికి ఉద్యమాల కేంద్రాలు గ్రామాలే. అందువల్ల నువ్వలా భయపడటంలో అర్థంలేదు. ఆ భావా లుంటే ఎక్కడున్నా ఎవరాపినా ఆగరు"

"ఎంతైనా మన కళ్లముందటుంటే అది వేరు"

"అట్లని పిల్లల భవిష్యత్తును నాశనం చేస్తావా? కరీంనగరెంత దూరంలో ఉంది. బస్సు రోడ్డంటపోతే ముప్పయి కిలోమీ టర్లు. రోజూ ఎంతోమంది ఏదో పనిమీద కరీంనగర్‌కు పోతూనే ఉంటారుకదా! నేనూ పోతాను. మనం శ్రీనివాస్‌ను గమనిస్తూనే ఉందాం. ఆ చిన్న కారణంతో వాన్ని చది వించననకు" అన్నాడు సాంబయ్య.

"మామయ్యా! నాకు చదువే ముఖ్యం. యూనియన్ల జోలికి పోను. మిత్రుల ప్రోద్బలంతో దిగాను కాని నాకు వాటిమీద ఇంట్రెస్టేంలేదు. అవి మంచో చెడో నాకనవ సరం. నాకు చదువే ముఖ్యం"

శ్రీనివాస్ మాటలు హృదయపూర్వకం గానే వినిపించాయి సాంబయ్యకు. అది వాళ్ల కుటుంబ సమస్యగా భావించి ఇంతవ రకు ఏం మాట్లాడకుండా వింటూ కూర్చు న్నాడు విజయేందర్‌రెడ్డిసారు.

ఇప్పుడు నోరు విప్పాడు.

"అయిలయ్యా! నీ కొడుకు హామీ ఇస్తు న్నాడు. వాన్ని చదివించు. ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు? రాళ్లలోనే ఎన్నో రత్నాలుంటాయి. మీవాడు చదువు కొని భవిష్యత్తులో ఏమైనా కావచ్చు కాద నకు" అన్నాడు.

ఆ మాటలతో కొంత మెత్తబడ్డాడు అయి లయ్య. అయినా అతని భయాలాతనికుం డనే ఉన్నాయి.

"బాగా చదివించిన వాళ్ల సంగతి చూస్తుంటే ఈనగాచిన చేనును నక్కల పాలు జేసినట్టే అనిపిస్తుంది నాకు. నౌకర యింతర్వాత చెంగో బిల్లంటున్న వాళ్లే ఎక్కువ. ఎంత పెద్ద నౌకరయితే అంతెక్కు వగా ఊరికి, తల్లిదండ్రులకు దూరమవుతు న్నారు. ఇప్పుడున్న చదువుతోని కండక్టరో ఏదైనా చిన్న నౌకరో వస్తే మన కండ్ల ముందుంటడుగదా" అన్నాడు అయిలయ్య.

అయిలయ్యలో ఇలాంటి ఆలోచనలూ ఉంటాయని ఊహించనైనా లేదు సాంబయ్య.

"వాడు బాగా చదివి పెద్ద ఉద్యోగే అయ్యాడనుకుందాం. నీకుపయోగపడలేదే అనుకుందాం. అట్లని వాని భవిష్యత్తును నాశనం చేస్తావా? ఎక్కడున్నా తనకుతాను హాయిగా బతికితే నీకు సంతోషంగుం డదా? నువ్వు కోరుకునేది నీ కొడుకు మంచి జీవితాన్ని కాదా? "

"సాంబయ్యా! నువ్వన్నది కాదనడం లేదు గాని అయిలయ్య మాటల్లోనూ నిజాలు న్నాయి. పిల్లల్ని పెద్ద చదువులు చదివించ కూడదని నేనడంలేదు. కాని బాగా చదివి ఊర్ను వదిలిపెట్టిన వాళ్ల సంగతి చూడు. ఇండ్లల్లో ముసలి తల్లిదండ్రులు బిక్కుబిక్కు మంటూ ఉంటున్నారు. వాళ్ల చదువు ఉద్యోగం కనీసం కన్నవాళ్లకు కూడా ఉప యోగపడటంలేదు. కొందరసలే పట్టించుకో కుంటే కొందరేమో కొంత డబ్బు పంపి చేతులు దులుపుకుంటున్నారు. వృద్ధా ప్యంలో తల్లిదండ్రులకు కావాల్సింది పిల్లల ప్రేమ. దగ్గరుండి చూసుకోవడం ఇవి కరు వవుతున్నాయన్నదే అయిలయ్య మాటల కర్థం"

తాను గమనిస్తున్న విషయాలను చెప్పాడు విజయేందర్‌రెడ్డి. ఆ మాటలు సరస్వతికసలే నచ్చలేదు.

"ఎప్పుడో ఏదో జరుగుతుందని పిల్లలను ఇంట్లోనే ఉంచుకొని మట్టిపని చేయిస్తూ ఎదుగూబొదుగూ లేకుండా బతకమంటారా సార్. మంచి ఉద్యోగం కోసం ఊరొదిలి పోక తప్పుతుందా? అది తప్పా?

మేమున్న చోట దేశంలోని అన్ని రాష్ట్రాల వారూ పనిచేస్తున్నారు. వేలకొద్ది మైళ్ల దూరం నుంచి ఉద్యోగం కోసం వచ్చారు. ఎంతమంది ఉద్యోగం కోసం దేశాలనే వదిలిపెట్టి పోవడం లేదు? ఎక్కడివాళ్లక్కడనే ఉండాలంటే ఎట్లా పైకొస్తారు? " అంది.

"ఉద్యోగం కోసం దూరం పోవడం తప్పు లేదమ్మా. కాని చదువుకొని తమ పునాదులనే మరిచిపోతున్నారు జనాలు. తామెక్కడినుంచొచ్చారో ఆ గ్రామాల ముఖాలే చూడటంలేదు. అందుకే ఈ సంధిగ్ధం. అసలు లోపమెక్కడుందో అర్థంకావడం లేదు. ఈ చదువుల్లోనే ఉందా? "

విజయేందర్‌రెడ్డి మాటలతో ఆలోచనలో పడ్డాడు సాంబయ్య.

ఈ చదువులు చదువులు మాత్రమే కాదు. వస్తున్న కొన్ని మార్పులు మన సంస్కృతినే పరాయీకరిస్తున్నట్టనిపిస్తుంది సాంబయ్యకు. కృత్రిమ సంస్కృతి వ్యామోహంలో కొట్టుకుపోతున్నట్టు తోస్తుంది.

"బాగా ఆలోచిస్తే ఈ చదువుల్లో పల్లెల్నుంచి దూరం జరిపే స్వభావం, పరాయీకరణకు గురి చేసే గుణమున్నట్టు కనబడుతుంది. అట్లని ఈ చదువులకు దూరంగా పరుగెత్తుకు పోయి మట్టిపని చేసుకుంటూ బతుకుదామా? ఎలుకలున్నాయని ఇల్లు తగుల బెట్టుకుందామా? " అన్నాడు సాంబయ్య.

"బావా! నువ్వెన్నైనాచెప్పు. నాకెందుకో మా వాణ్ణింకా చదివించడమంటే ఇంకా దూరం చేసుకోవడమేననిపిస్తుంది. ఇంకా చదివింతర్వాత ఉద్యోగం రాకుంటే ఇటు పనికీకాక అటు ఉద్యోగమూ లేక రెంటికి చెడ్డ రేవడవుతాడేమోనని భయం. ఉద్యోగం దొరక్క పనికి దూరమైనా ఉద్యోగం దొరికి అందకుండా పోయినా ఒక్కటేకదా? " అన్నాడు అయిలయ్య.

"మామయ్యా! నాకు చదువుకుందామనుందని ఎంత చెప్పినా వినడంలేదు. నేను ఖాళీగా ఉండేం చేయాలో తెలియటం లేదు. మన ప్రాంతంలోని యువకుల్లా నిర్ణయం తీసుకోవాల్సి వస్తుంది. ఓ మంచి ఉద్దేశ్యం కోసం చచ్చినా మంచిదే"

శ్రీనివాస్ మాటలు విని శాంతమ్మ కళ్ల వెంట నీళ్లొచ్చాయి.

"తండ్రీకొడుకులు ఇద్దరూ ఇద్దరే. ఎవరి పట్టుదలలు వారివే. మీకేం చెప్పాలో నాకర్థం కావడంలేదు. అయిలయ్యా! నీలోనూ స్వార్థం ప్రవేశించిందనిపిస్తుంది. నీకు నీ కొడుకు భవిష్యత్తుకంటే నిన్ను చూస్తాడో చూడడోనన్న భయమే ఎక్కువన్నట్టుంది. కొందరు బాధ్యతా రాహిత్యంగా ప్రవర్తిస్తున్న మాట నిజమే. కాని ఎంతోమంది ఉద్యోగులు తమ తల్లిదండ్రుల్ని తమ దగ్గరుంచుకొని బంగారంలా చూసుకోవడం లేదా? ఒకవేళ చూసుకోకున్నా నీ కొడుకు గొప్పగా బతికితే నీకు సంతోషం కాదా? ఎక్కడుంటేంది? నువ్వు పిచ్చిపిచ్చాలోచనలు పెట్టుకోక శ్రీనివాస్‌ను కాలేజీకి పంపు. ఆ తర్వాతేదైతే అదవుతుంది" అన్నాడు విజయేందర్‌రెడ్డి.

"సరే... అవన్నీ పోనియ్యండి. నాకిపుడు మూడెకరాల భూమి మాత్రమే మిగిలింది. ఇప్పుడు నేను అతి చిన్న రైతును. మావాడి చదువయి పోయేసరికి నేను రైతు కూలీని కాక తప్పదేమో" అన్నాడు అయిలయ్య.

"భలేటోనివోయ్ అయిలయ్యా! మరో సమస్యను ముందుకు తెచ్చావా? ఇలాంటి సమస్యలు చాలామందికున్నవే! ఈ మాత్రం భూమి లేనివాళ్లు కూడా తమ పిల్లల్ని పెద్ద చదువుల చదివిస్తున్నారు. కూలీపని చేసుకునేవాళ్లూ చదివిస్తున్నారు. అయినా నీకున్న మునిగిపోయే సమస్యలేంటి? ఇద్దరు బిడ్డల పెళ్లిళ్లయి పోయాయికదా! ఈ ఒక్కన్ని ఇంకో మూడు నాలుగేండ్లు కష్టపడి చదివిస్తే నీ కష్టాలు తీరుతయి. నువ్వెందుకు గాబరా పడుతున్నావు? "

"సార్ మీరన్నీ తెలిసే ఇలా మాట్లాడుతున్నారు. ఆడపిల్లల పెళ్లిళ్లయిపోతే ఖర్చులన్నీ అయిపోయినట్టేనా? పండుగలకు, పబ్బాలకు, రాకపోకలకు, పండుగ కట్నాలకు, కానుకలకు, వాళ్ల పిల్లలకు... ఆడపిల్లల్తోని ఎన్ని ఖర్చులుంటాయో మీకు తెలియదా? ఎంత కష్టపడ్డా, ఎన్ని ప్రభుత్వాలు మారినా రైతు బతుకయితే మారుటలేదు"

"ఏదో పట్వారీ, పటేలు వ్యవస్థలను రద్దుచేసి మంచిపనే చేసింది ప్రభుత్వం. వాళ్ల దోపిడి తగ్గిందిగద"

"అయితే ఉద్యోగులొచ్చి ఊర్నుద్ధరిస్తున్నరా? ఏ భూమెక్కడుందో ఏ సర్వేనంబరేంటో వీళ్లకేం తెలువది. పాత పట్వార్లనే వాడుకుంటున్నరు. వాళ్ల సహాయం లేంది కొత్తవాళ్లు పనులు చేయలేరు"

అసలు విషయం వదిలిపెట్టి ఏవేవో మాట్లాడుతున్న భర్తను, అన్నయ్యను, సారును చూస్తుంటే సరస్వతికి కోపమొస్తోంది.

"మీరు భలేవాళ్లు, వచ్చినపని విడిచిపెట్టి మీరు మాట్లాడుతున్నదేంటి? " అంది.

తండ్రి బాధలు చూస్తున్న శ్రీనివాస్‌కు ఒక్కోసారి చదువుకోకుంటేం బోతుందనిపిస్తుంది. కాని ఇంకా చదువుకొని ఏదైనా మంచుద్యోగం సంపాదించుకొని తల్లిదండ్రులనీ మట్టిబతుకుల్నుంచి విముక్తి చేయాలని పిస్తోందతనికి.

"నాన్నా! నేను బాగా చదువుకొని మంచుద్యోగం సంపాదించుకొని మీరు వ్యవసాయం మానేట్టు చేస్తాను. నాకుద్యోగమైం తర్వాత మీరు కష్టపడాల్సిన పన్లేదు. కూర్చుండి తినాలిమీరు" అన్నాడు శ్రీనివాస్.

ఆ వయసులో అందరు పిల్లలూ దాదాపలాగే చెబుతారని శ్రీనివాస్ చెప్పిన మాటలనెవరూ సీరియస్‌గా తీసుకోలేదు.

"బావా! నువ్వీ విషయంలో ఇంకా పట్టుబట్టకు. డబ్బు విషయంలో నీకు కష్టమైతే నేను సాయం చేస్తాను. అప్పుగానే తీసుకో... ఆ తర్వాత శీనే బాకీ తీర్చుకుంటాడు. నా దగ్గర డబ్బుందని కాదుగాని మా పిల్లలు బయట చదివేంతవరకు పెద్దగా ఖర్చులుండవుగదా! శ్రీరామ్‌సాగర్ నీళ్లొచ్చింతర్వాత పంటలో తీరే ఉంటున్నా ఇలా ఎందుకు జరుగుతుందో నాకు తెలియడంలేదు" అన్నాడు సాంబయ్య.

"రోజురోజుకూ వ్యవసాయానికి, ఊరుకు దూరమవుతున్న నీకు మా కష్టాలేం తెలుస్తాయి బావా! సరే, జరిగేదేదో జరుగుతుంది. ఆడబిడ్డ సొమ్ము తీసుకొని చదివించడం నాకిష్టంలేదు. నా తిప్పలేవో నేను పడతా" అన్నాడు అయిలయ్య.

అయిలయ్యను ఒప్పించడానికెన్నో చెప్పాల్సివచ్చింది వాళ్లకు. విజయేందర్‌రెడ్డి లేచి నిల్చున్నాడు.

"బీదరికపు ఏడ్పులేడ్వకు అయిలయ్యా" అని నవ్వుతూ వెళ్లిపోయాడు.

"ఊళ్లోకి పోయొస్తా" అని లేచి నిల్చున్నాడు సాంబయ్య.

"పాతమిత్రులను కలుసుకొని రాపో" అన్నాడు అయిలయ్య.

"నాతో చదువుకున్నవాళ్లంతా ఎక్కడెక్కడో ఉన్నారు. మధ్యలో చదువు మానిన నలుగురైదుగురు వ్యవసాయాలు చేస్తున్నారు. కత్తెర్ల శంకరయ్యను కలిసొస్తా" అని బయటకెళ్లాడు సాంబయ్య.

వాకిట్లోకొచ్చి నిల్చుని "శీనూ! ఆనంద్, కవితేరిరా... చాలాసేపట్నుంచి కనబడటం లేదు" అన్నాడు.

"మీ ఇంటికే పోయినట్టున్నారు. తాత, నానమ్మలతోని కబుర్లు చెప్పుతున్నారేమో" అన్నాడు అయిలయ్య.

"సరే" అంటూ వెళ్లిపోయాడు సాంబయ్య.

"శీనూ! పిల్లలను తీసుకరాపో" అంది సరస్వతి.

# సచిత్రవిచిత్రం



## అందం కోసం

హాలీవుడ్ స్టార్ డస్టిన్ హాఫ్‌మాన్, రాక్‌సింగర్ స్టింగ్‌తోసహా అనేక మంది లాస్‌ఏంజెలెస్‌లోని 'కేఫ్‌యూత్' అనే ఫిజికల్ ఫిట్‌నెస్ క్లబ్‌లో ఏడాదికో వారం గడుపుతున్నారు. ఇక్కడ ఇచ్చే నేచురోపతి చికిత్స ద్వారా వాళ్ళ మొహాల్లోని ముడతలు, శరీరంలోని కొవ్వు తగ్గుతాయట. ఆ చికిత్సలో ఓ భాగం... ఒంట్రుమట్టిని పూసుకుని 3 గంటలు అలా మట్టి పురుగులా వుండి తరువాత స్నానం చేయడం. స్టింగర్‌కి మట్టి రాస్తున్న డస్టిన్ హాఫ్‌మాన్‌ని చిత్రంలో చూడవచ్చు.

"సరే అత్తమ్మా!" అంటూ లసుమయ్య ఇంటిదిక్కెళ్లాడు శ్రీనివాస్.

★ ★ ★

తీరిక సమయాల్లో అవసరమైతే తన పిల్లలకు పాఠాలు చెబుతుంటాడు సాంబయ్య. అందుకోసం వాళ్ల పుస్తకాలనూ తిరగేస్తుంటాడు. పిల్లల్లోని సృజనాత్మకతను వెలికితీసే అంశాలేమాత్రం ఈ చదువుల్లో లేకపోవడం గమనిస్తున్నాడు సాంబయ్య. అర్బన్ మిడిల్ క్లాసు కనుకూలంగానూ, పోటీ తత్వాన్ని పెంచే దిశగానూ సాగుతున్న పిల్లల చదువుల గూర్చి అసంతృప్తిగానే ఉందతనికి. అయినా పోటాపోటీగా పిల్లలను చదివిస్తూనే ఉన్నాడు. చాలా మంది తల్లిదండ్రుల్లాగే ఆటలు, టీవీలాంటివి పిల్లల చదువులకు భంగకరమని భావిస్తున్నాడు. రోజురోజుకూ ప్రైవేట్ పాఠశాలలపై మోజు పెరుగుతుండటం, పిల్లల చదువులు తల్లితండ్రుల చదువులుగా మారుతుండటం చూస్తున్నాడు.

పడక కుర్చీలో కూర్చొని ఆనంద్ నోటు పుస్తకాలను తిరగేస్తున్నాడు సాంబయ్య.

నోటుబుక్కు పై ఉన్న బొమ్మ మీద పడిందాతని దృష్టి. ఇంతకుముందుండే జాతీయనాయకుల బొమ్మలకు బదులు క్రికెట్ ప్లేయర్లు, కుస్తీ పోటీదారుల బొమ్మలుండటం చూశాడు.

ఆనంద్‌ను పిలిచాడు సాంబయ్య.

"నీకీ బొమ్మలున్న నోటుబుక్కులే దొరికాయా? " అన్నాడు.

"ఇవి బాగానే ఉన్నాయికద నాన్నా! స్టిక్కర్లు కూడా ఇవే వాడుతున్నం. జాన్ గుంజాల్, టైసన్ ఇవే బొమ్మలు. ఈ స్టిక్కర్లు మంచిగ లేవా నాన్నా? "

"ఇంతకీ గాంధీ, నెహ్రూలెవరో తెలుసా? "

"ఎందుకు తెలియదు నాన్నా! మన జాతిపిత గాంధీతాత, నెహ్రూను చాచా నెహ్రంటూరు. మన మొదటి ప్రధానిగద నెహ్రూ. వాళ్లు మనదేశ స్వతంత్రం కోసం పోట్లాడిండ్రని మాసారు చెప్పాడు. మా పుస్తకాల్లో ఉంది"

"ఆ సుత్తులన్నెందుకు నాన్నా! పుస్తకాల్లో ఉన్నవి బాగా చదువుకుంటే సరిపోతుంది కదా!" అంది కవిత.

"జాతీయ నాయకుల గూర్చి మాట్లాడటం సుత్తవుతుందా కవితా? "

"నాన్నా... మీరే బాగా చదవాలంటారు. ఇతర విషయాల జోలికి పోవద్దంటారు. నేను కలెక్టరు, చెల్లె డాక్టర్ కావాలని మీరే అన్నారు. మీరు చెప్పినట్టే మేం బాగానే చదువుతున్నాం. మా పాఠ్య పుస్తకాలతో పాటు సెంట్రల్ సిలబసనీ, ఇతర పుస్తకాలూ మావి కాకున్నా చదువుతున్నాం. అయినా మీకు తృప్తిలేదు. ఇంకా వేరే పుస్తకాలవీ చదవాలంటే మాకు టైమెక్కడుంటుంది? "

ఆ మాటలు ప్రశ్నార్థకాలుగానే ఉన్నాయి సాంబయ్యకు.

"నాన్నకే ఏంకావాలో తెలియదసలు. మనలను అందరికంటే ఉన్నత స్థితిలో చూడాలనుంటది. బాగా చదివించాలనుంటది. పుస్తకాల పురుగులను కమ్మంటడు. మల్ల ఏమేమో పోతున్నయని బాధపడుతడు. పల్లెల గూర్చి తెలుసుకుంటలేమని, తెలుగు బాగా వస్తలేదని బాధపడుతుంటడు. అవీఇవీ అన్నీ కావాలంటెట్ల? నాన్నకే తెలియదేం కావాలో? "

కవిత మాటలు సూటిగా తగిలాయి సాంబయ్యకు.

కవిత చాలా ఇంటలిజెంట్. వేలు చూపుతే కొండ పాకేరకం. తాననుకున్నది తప్పకుండా సాధిస్తుందని సాంబయ్యకు తెలుసు... కాని తనలో కొట్టుమిట్టాడుతున్న భావాలను కవిత అంత విశదీకరించి చెప్పడం సాంబయ్య కాశ్చర్యమేసింది.

కవితన్నట్టు తనలో పరస్పర విరుద్ధ భావాలున్నాయా? తనను తానే ప్రశ్నించుకున్నాడు సాంబయ్య.

పిల్లలముందు బయట పడదలుచుకోలేదు.

"సరేగాని కవితా! మాటలేమో ముసల్దానిలా మాట్లాడుతున్నావు. అందుకే మీ మేనమామ నిన్ను ముసలమ్మంటాడు. నీకో టార్గెట్ ఇచ్చానన్నది తెలుసుకదా! ఆ టార్గెట్ చేరుకోవాలంటే నువ్వింకా కష్టపడి చదవాలి. కాబోయే డాక్టరువిలాగేనా చదివేది? నువ్వు డాక్టరువు, అన్నయ్య కలెక్టర్ కావాలి. ప్రయత్నిస్తే ఇవి అసాధ్యంకాదు"

"ఈ మాటలు మీరు చాలాసార్లు చెప్పారు. సరేగాని నాన్నా మేమివి సాధిస్తే సమస్యలన్నీ తీరినట్టేనా? ఈ చదువులు మంచిగున్నట్టేనా? " అన్నాడు ఆనంద్.

"మంచిగున్నట్టో లేదో తర్వాతి సంగతి మిమ్మల్నయితే ఉన్నత స్థానంలో చూసానన్న తృప్తుంటుంది మాకు. ఏ తల్లిదండ్రులయినా తమ పిల్లల ఉన్నతినే కదా కోరుకునేది! మీరు పెద్దవాళ్లవుతున్నారు. ఓ లక్ష్యాన్ని ముందు పెట్టుకొని చదవండి. తప్పకుండా సక్సెసవుతారు"

"నాన్నా! నాకు నిజానికి లెక్చరర్‌గానో, మరేవిధంగానో సెటిల్ కావాలనుంది. కాని మీరిద్దరూ నన్ను కలెక్టర్‌గా చూడాలనుకుంటున్నారు. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను"

"ఆనంద్! నీ ఆలోచనలూ మీ నాన్నలా అల్పసంతోషపువే. పంతులయి దేశానుద్ధరిస్తానని మీ నాన్న ఇంజనీరింగ్ సీటును వదులుకున్నాడు. ఈ నౌకరికే వచ్చేవాడు కాదు. నేనే పోరుపెట్టి తీసుకొచ్చాను. బడి పంతులు నౌకరి చేస్తే ఏమొచ్చేది? ఈ ఉద్యోగం వల్ల కష్టపడి కరీంనగర్‌లో ఇల్లు కట్టుకున్నాం. అక్కడుంటే ఈ మాత్రం బతుకు కూడా లభించేదికాదు"

"అంటే? మనమిప్పుడు బాగానే బతుకుతున్నామంటావు కదా సరస్వతీ!"

"మీరు మరీ అల్పసంతోషులు. ఉన్నదాంతోని సంతృప్తిపడాలనే మీ బుద్ధి మిమ్మల్ని పైకి రాకుండా చేస్తుంది. మనం చూస్తుండగానే ఎందరెంత సంపాదించుకున్నారో చూడటం లేదా? మనం సంపాదించిందెంత? ఈ కాలపు పిల్లలు ఏమియ్యలేని వారు మమ్మల్నెందుకు కన్నారని అడుగుతున్నారు"

"సరస్వతీ! దయచేసి నువ్వు పిల్లలకలాంటివి నేర్పకు. వాళ్లు హాయిగానే బతుకుతారు. నువ్వేం బాధపడకు"

"అమ్మా... నాన్నా! మా కోసం మీరు వాదులాడుకోవద్దు. మిమ్మల్ని ఏం సంపాదించలేదని మేమెప్పుడూ అడగం. మేం సంపాదించుకుంటాం" అన్నాడు ఆనంద్.

"ఈ మాటలెప్పటికీ ఉండవులే" అంది సరస్వతి.

"సరేగాని కవితా! మీ తెలుగుసారు పద్యాలవీ బాగా చెబుతున్నాడా? తెలుగులో ఇంటరెస్టు కల్గిస్తున్నాడా? మీకు కన్యక పాఠముందికదా! తెలుగులో దాన్నెవరు రాసారో తెలుసా? దేశభక్తి గీతం వచ్చా నీకు? " అడిగాడు సాంబయ్య.

"ఏమో నాన్నా! సరిగ్గా జ్ఞాపకం లేదు. అయినా తెలుగునెవరు పట్టించుకుంటున్నారు? ఏదో పరీక్షలమీద చదువుకోవడం, పాసవడం... తెలుగులో ఎక్కువ మార్కులొచ్చినా తక్కువొచ్చినా పట్టించుకోరెవరు. మేం బాగా చదివేది సైన్సు, లెక్కలు, ఇంగ్లీషే"

"అవేం మాటలమ్మా అన్నీ బాగా చదవాలి"

"మీకింకా పాతవాసనలు పోలేదు. తెలుగువాళ్లే తమ పిల్లలకు తెలుగు సబ్జెక్టు లేకుండా చదివిస్తున్నారు. మీరేమో తెలుగని పాకులాడుతున్నారు!"

సరస్వతి మాటలు విని ఇంకేం మాట్లాడ టానికి సాహసించలేదు సాంబయ్య.

పిల్లలు చదువుకుంటున్నారు. సాంబయ్య వాళ్లను గమనిస్తూ వార్తాపత్రిక తిరగేస్తు న్నాడు.

అరగంట బాగానే చదువుకున్నారు వాళ్లు.

"కులమంటేంది నాన్నా? " అడిగింది కవిత.

"అయ్యో! కులమంటె తెలువదానె చిట్టి" అన్నాడు ఆనంద్. కాని కులమంటేందో అతనికీ పూర్తిగా తెలియదు.

భారతదేశంలోని అన్ని రాష్ట్రాలవారు ఉద్యోగులుగా ఉన్న ఆ కాలనీలో కొన్ని కుల సంఘాలున్నా పిల్లలకు వాట్ని గూర్చి అంతా తెలియదు. చాలామంది పిల్లలు కలిసి ఆడుకుంటారు. స్నేహాలు చేస్తారు. వాళ్లకు ఏకులమన్న ఆలోచనేరాదు. కాని కొంతమంది తల్లిదండ్రులు తమ పిల్లలను తమ కులంవారితో పెద్ద ఉద్యోగహోదా ఉన్నవారితో స్నేహాలు చేయమని ప్రోత్స హించడమూ ఉంది. సాంబయ్య తన పిల్ల లను కుల ప్రసక్తి వాళ్లముందు లేకుండా పెంచే ప్రయత్నం చేస్తున్నాడు.

ఇదివరకోసారి ఆనంద్ ఈ ప్రశ్నే అడి గాడు. కలాల పుట్టుక గూర్చి ఉన్న వాదా లను భారతదేశంలో కులాల పాత్రను, కులాల పేరుమీద జరుగుతున్న దుర్మార్గా లను చెప్పాడు. సాంబయ్య కులాల గూర్చి పట్టించుకోవద్దనీ చెప్పాడు.

ఇప్పుడు కవితకేం చెప్పాలని ఆలోచిస్తు న్నాడు సాంబయ్య. కొద్దిగా ఆనంద్‌కు చెప్పిన విషయాలనే ఐదు నిమిషాల్లో చెప్పాడు.

"నీకు కులం సంగతెందుకు జ్ఞాపకం వచ్చిందిప్పుడు? " అన్నాడు.

"మా క్లాసులో శర్మసారు చెప్పారు. మనది వెనుకబడిన వాళ్ల కులమట. మనకు రాంకు తక్కువచ్చినా సీట్లొస్తయట. పెద్దకులపోల్లకు రాంకు రావాలంటె బాగా కష్టపడాలన్నాడు. మండల్ కమీషనేదో ఉన్నదటకద. దాన్ని, ప్రధానమంత్రి వి.పి. సింగ్‌ను బాగా తిట్టిండు సారు"

"నిజమే నాన్నా! ఆ సారు మా క్లాసుల గూడ ఇవే మాటలన్నడు. మీ నాన్న అను కున్నవన్నీ రిజర్వేషన్లతోని మీరు సాధిస్తరు. పెద్ద కులంలో పుట్టినందుకు మేం ఉరి వెట్టుకొని సావాలె అని. ఆ సారెందుకలా అంటున్నాడు నాన్నా? "

"ఛీ... ఛీ" తనలో తననుకున్నాడు సాంబయ్య.

ఉపాధ్యాయులే పిల్లల్లో కులాల బీజాలు నాటితేమన్నట్టు? తనలోతాను మథన ప డ్డాడు.

"మీరు చిన్న పిల్లలు. మీకే విషయాలు చెప్పకుంటేనే మంచిది. నేను చెప్పకున్నా అవే తెలుస్తాయి. లోపలికెళ్లి చదువుకోండి"

ఆనంద్, కవిత లేచి లోపలి గదిలోకె ళ్లారు.

"మీరు ధర్మరాజులు. నిజమే... మీకు కులాల పట్టింపులు పెద్దగా లేవు. అదీ మంచిదే. కాని లోకంతోపాటు మనమూ నడవాలికదా! చాలామంది కుల సంఘా లంటూ కులాల వారిగా స్నేహాలు చేస్తున్నా రిప్పుడు. కులాలవారిగా పిక్నిక్‌లకూ పోతు న్నారు. ఇవేవీ మనకు వద్దంటే మనం ఎవ రికీ కాకుండా పోతాం. కులాల విషం నూరి పోయొద్దు. నిజమేకాని పిల్లలకు వాటిపై కొంత అవగాహన అవసరమే"

సరస్వతి మాటలు ఆలోచింపదగ్గవిగానే కనబడ్డాయి. విప్లవ కమ్యూనిస్టు పార్టీ ల్లోనూ కులాల కుమ్ములాటలున్నాయని తాను పేపర్లో చదివింది జ్ఞాపకం చేసుకు న్నాడు సాంబయ్య.

"సరస్వతీ! నువ్వు మరీ ప్రాక్టికల్ మని షివి. నాకలా ఉండటం చేతగాదు. నన్ను

నేనెంతగా మభ్యపెట్టుకొని బతకడానికి ప్రయత్నిస్తున్నా నా కాలేజీ జీవితంలోని ఆదర్శాలు నన్ను వెంటాడుతూనే ఉన్నాయి. మన ప్రాంతంలో విచిత్రమైన పరిస్థితుంది. ఓ దిక్కు సైద్ధాంతిక పోరాటాలు, భూపోరాటాలు జరుగుతున్నాయి. మరోదిక్కు కుల సంఘాల ఉధృతీ పెరుగుతోంది. ఇవన్నీ చూస్తుంటే నాకు జుట్టు పీక్కోవాలనిపిస్తుంది"

అని లేచి బెడ్‌రూంలోకెళ్లాడు సాంబయ్య.

మంచంలో పడుకొని ఆలోచిస్తున్న సాంబయ్యకెన్నో విషయాలు జ్ఞాపకం వస్తున్నాయి.

తాను చదువుకుంటున్న రోజుల్లో సిద్ధాంత చర్చలుండేవి. ఇప్పుడవి కుల చర్చలుగా మారుతున్నాయనిపిస్తుంది. ఇదెంత వరకు పోతుందో చెప్పరాకుండా ఉంది. కరీంనగర్‌లో డిగ్రీ చేస్తున్న శ్రీనివాసేం చేస్తున్నాడో? మండల్ వ్యతిరేక, అనుకూల ఉద్యమాల్లో పాల్గొంటూ చదువుకెగనామం పెడుతున్నాడా? శ్రీనివాస్ చదువు పూర్తిచేసుకొని ఏదైనా ఉద్యోగం సంపాదించుకుంటే అయిలయ్య కష్టాలు తీరుతాయి. కాని ఉద్యోగం దొరకడమంత సులభమా? ఆలోచిస్తూనే ఉన్నాడు సాంబయ్య.

★ ★ ★

మండల్ కమీషన్‌కు అనుకూలంగా వ్యతిరేకంగా ఆందోళనలు జరుగుతున్నాయి. ఆత్మాహుతులూ జరుగుతున్నాయి. కాలేజీల్లోనూ, యూనివర్శిటీల్లోనూ చర్చోపచర్చలు జరుగుతున్నాయి. విద్యార్థి యూనియన్లూ కులాల ప్రాధాన్యతను సంతరించుకుంటున్నాయి.

షాపింగ్ సెంటర్ చెట్లకింద చాలామంది కూర్చొనున్నారు. అనేక విషయాల గూర్చి మాట్లాడుకుంటున్నారు. క్రమక్రమంగా వాళ్ల సంభాషణలు రిజర్వేషన్ల దిక్కు మర్లాయి.

"ఈ రిజర్వేషన్లవల్ల చాలామంది నష్టపోతున్నారు. చెత్తసరుకు బయటకొస్తోంది. ప్రొఫెషనల్ కోర్సుల్లో కూడా ఎందుకీ రిజర్వేషన్లు? "

"స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్లు గడిచినా ఇంకా రిజర్వేషన్లు కావాలని పాకులాడటం మంచిది కాదు"

"వచ్చింది తియ్యి స్వాతంత్ర్యం ఎవ్వలకొచ్చింది స్వాతంత్ర్యం? రిజర్వేషన్ ఫలితాలు అందాల్సిన విధంగా అందలేదు కాబట్టే ఇంకా ఉంచాల్సి వస్తోంది"

"సమాజంలో కులాలు ప్రధానపాత్ర వహిస్తున్నంతవరకు రిజర్వేషన్లు అవసరమే. మనదేశంలో కులాల పాత్రను కాదనలేం"

"చదువుల్లో ఇస్తే ఇవ్వొచ్చుకాని ఉద్యోగాల్లో ఎందుకు? "

"ఎందుకంటే మొదట్నుంచీ చదువుకునే అవకాశముండి ఉద్యోగాల్లో ఉన్న కులాల వాళ్లే ఉద్యోగాల్లో ఎక్కువమందున్నారు కనుక. ఈ నామమాత్రపు అవకాశాలైన లేకుంటే బలహీనవర్గాల కులాల వారికెవరికీ ఉద్యోగాలొచ్చే అవకాశం లేదు"

"పెద్ద కులాల వాళ్లలో బీదవాళ్లు లేరా? "

"పేదవాళ్లు అన్ని కులాల్లో ఉన్నారు. అయితే చిన్న కులాలనబడే వాళ్లు తరతరాలుగా కూలీలుగా, పాలేర్లుగా, స్కావెంజర్లుగా, రోడ్లూడ్చే వాళ్లుగా బతుకుతున్నారు. ఎంతోమంది బిచ్చగాళ్లూ ఉన్నారు. కొంతమందికి ఉద్యోగాలు రావడంలేదని బాధపడ్తున్న వాళ్లు ఎంతో హీనంగా బతుకుతున్న ఇలాంటివాళ్ల బతుకుల గూర్చి ఎందుకాలోచించరు? "

"ఆఁ ఇవన్నీ ఉపన్యాసాలకు బాగానే ఉంటాయి. ఇప్పుడు ఎవరైనా ఎవరితోనైనా పోటీపడి చదువుకుంటానికి, ఉద్యోగాలు సంపాదించుకుంటానికి అవకాశాలున్నాయి. అయినా రిజర్వేషన్లెందుకు? "

"పైకలా ఉన్నట్టే అనిపిస్తుంది. కాని అది తప్పుడు అవగాహన. ఎంత పేదవాడైనా ఓ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన విద్యార్థి కున్న చదువుకునే అవకాశం, వాతావరణం ఓ చెప్పులు కుట్టుకునేవాడి బాబుకుం టుందా? అలాగే నిత్యం పనికే అంకిత మయి బతికేవాళ్ల కుటుంబాల్లోని పిల్లలకూ ఉండదు. అలాగే ఉద్యోగాలు పొందే అవ కాశాలు కూడా. గుడ్డిలో మెల్లగా ఈ రిజర్వే షన్లు కొందరి కుపయోగపడ్తున్న మాట నిజమే. వీట్నర్థం చేసుకోక మనలో మనం పోట్లాడుకోవడం"

"ఎంతైనా రిజర్వేషన్లలో వచ్చిన వాడు సరిగ్గా పనిచేయడు. ఎంతైనా అది సర్కారు కోటగదా"

"పని చేయడానికి చేయకపోవడానికి కులమో రిజర్వేషనో కారణం కాదు. అది వ్యక్తులపై ఆధారపడుతుంటుంది. జీతం తీసుకుంటున్నందుకు అందుకు తగ్గట్టుగా ఎంతో కొంతైనా పనిచేయాలన్న ఆలోచ నున్న వాడెవడూ పనిచేయకుండా ఉండడు. కాన్షియస్ అనేదున్నవాడు తప్ప మన ఫ్యాక్ట రీలో ఎవరు పనిచేస్తున్నారు? కొందరు రాజకీయాలకు, కొందరు ఇతర విషయాల నడ్డుపెట్టుకొని తప్పించుకుంటున్నారు. కొందరు డ్యూటీ టైమ్‌లోనే ఇంటి పనులు చేసుకోవడం, ట్యూషన్లు చెప్పి సంపాదిం చడం కూడా చేస్తున్నారు. ఇలా చేసేవాళ్లు అన్ని కులాల్లో ఉన్నారు. రిజర్వేషన్లో వచ్చిన వాళ్లే పని చేయడం లేదన్న విషయం తప్పుకాదా? "

"ఎంతైనా రిజర్వేషన్లుండటం నాకైతే నచ్చడంలేదు"

"నిజమేనోయ్ రెడ్డీ! ఈ రిజర్వేషన్లొద్దు. అందుకోసం మనమంతా పోరాటం చేద్దాం. అయితే అంతకంటె ముందు ఈ కులాలే వద్దని పోరాటం చేయాల్సిన అవసర ముంది. ఈ కులాలనేవి పోతే రిజర్వేషన్ల ప్రసక్తే ఉండదుగదా!"

"చాల్తియ్యి నీ ధోరణి... మనుస్మృతి మన జాతికే తలమానికం లాంటి గ్రంథం. వేదాలు మనుస్మృతిలాంటి వాటిపైన్నే. నీలాంటివాళ్లకు నమ్మకం లేదు. ఇక నీ మాటలెలా ఉంటాయి? నీలాంటివాళ్లు మనువాద వ్యతిరేకులమని దళితుల రాజ్యమే కావాలని గోల చేస్తున్నారుకదా! మీరొస్తే ఏం గొప్పగా చేస్తారో మేం చూడమా? ఇప్పటికే ఎన్నో సంకరాలు జరుగుతుంటే ఉన్న కులాలనూ భ్రష్టు పట్టించమంటావా? అయినా కులాలను నిర్మూలించేదెవరు? "

"కులం వద్దంటే నీకింత కోపమెందుకొ స్తుందోయ్ రెడ్డీ! అయితే కులాలన్నీ ఇలాగే ఉండాలంటావు. కులం పేరుమీద జరుగు తున్నవన్నీ కొనసాగాలంటావు. రిజర్వేషన్లు మాత్రం వద్దంటావు. అంతేనా? "

"కులాలు లేకుండా చేసేదెవరు? "

"మనం అంటే ప్రజలు. ప్రజలుద్యమిస్తే సాధ్యం కానిదేముంది? దళితులు, ఇత రులు పోరాటాలద్వారా ఎంతో కొంత జీవి తాన్ని గెలుచుకున్నారా లేదా? మనమంతా కులాలు వద్దని మొత్తుకుందాం. స్వాతంత్ర్య పోరాటంలాంటి పోరాటం సాగిద్దాం. ప్రజ లుద్యమిస్తే సాధ్యం కాదా? "

"ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కిందట. మాటలు పెద్దపెద్దవి మామాట్లాడొచ్చు చెప్పడమంత సులభంకాదు చేయడం. మన జెనరల్ మేనేజర్‌గారి దగ్గరికెళ్లి మాట్లాడటానికే వణికే నువ్వు దేశవ్యాప్త ఉద్యమం తీస్తావా? కోతలు బాగానేకోస్తు న్నావు"

"ఇదంతా కాదుగాని ప్రభుత్వానికి నిజంగా చిత్తశుద్ధనేదుంటే కులాలను నిర్మూలించడమేమంత కష్టంకాదు. ముందు కులాల పేర్లను సూచించే రెడ్డి,

శర్మ, శాస్త్రి, యాదవ్, గౌడ్, చారి, గుప్తా లాంటి తోకలను కత్తిరించాలి. ఎక్కడ కుల ప్రసక్తి తెచ్చినా కఠినంగా ప్రవర్తించాలి. 'కులాంతర వివాహం చేసుకున్నవాళ్లకు ఉద్యోగం' అన్న నియమం పెట్టి దాన్ని ఖచ్చితంగా అమలు చేయాలి. ఇలాంటి వాళ్లకింకెన్నో సౌకర్యాలు కల్పించాలి. ఇలా చెప్పుకుంటూ పోతే ఇంకెన్నో. వీట్ని హృదయ పూర్వకంగా అమలు చేస్తే కొన్నేండ్లలో కులాల ఉధృతి తగ్గుతుంది. ఆ తర్వాత క్రమక్రమంగా అవే మాయమైపో తాయి. మన దేశంలో ఇంకా కులాలే ముఖ్యపాత్ర వహిస్తున్నాయంటే అది సిగ్గు చేటైన విషయమే"

"ఇవన్నీ తీవ్రవాద భావాలు. కులాలనేవి మనదేశంలో తరతరాల్నుంచీ వస్తున్నాయి. ఏ దేశంలోనైనా ఏదో మేరకివి ఏదో రూపంలో ఉండనే ఉన్నాయి. అలాంట ప్పుడు పూర్తిగా కులాలను నిర్మూలించాల నడం కాని పని"

"ఎలాగోయ్ శర్మా! కులం వద్దంటే తీవ్ర వాద భావమంటిరి. రిజర్వేషన్లుండాలంటే మనువాద వ్యతిరేకంటిరి. అంటే? కులాల పేరుమీదున్న సాంఘిక అసమానతలు, కుమ్ములాటలు, హెచ్చుతగ్గులు అలాగే ఉండాలికాని రిజర్వేషన్లు మాత్రముండొద్దం టావు. అంతేకదా! ఎవరెంత గింజుకున్నా, కల్లబొల్లిమాటలు చెప్పినా కులాలనేవి ఉన్నంతవరకు, ఈ సాంఘిక అసమానతలు కొనసాగుతున్నంతవరకు రిజర్వేషన్లు ఉండ కతప్పదు. వీటికి అనుకూల వ్యతిరేక ఉద్య మాలూ తప్పవు. రిజర్వేషన్లు తొలగించడా నికన్నా కుల నిర్మూలన జరగాలన్న ఉద్యమం రావాలి"

"అలాంటివి మన దేశంలో అంత సుల భంగా రావు. మొన్న నేనో వార్త చది వాను. ఓ యూనివర్శిటీలో గత కొన్నేం డ్లుగా ఒకే కులం విద్యార్థులకు రాంకులు వస్తున్నాయట. ఆ విద్యార్థుల కులం ఆ సబ్జెక్టు హెడ్ కులం ఒక్కటేనట. దాన్ని గూర్చి విసికి ఫిర్యాదు చేశారు. ప్రొఫెసర్ నడగటమూ జరిగింది. దానికి ప్రొఫెసర్ నవ్వి అది మన యూనివర్సిటీ సాంప్రదా యమన్నాడట. అంతకుముందున్న రికార్డు లను తీసి చూపించాడట. ఎవరు హెడ్ ఉంటే అతని కులపు విద్యార్థికే రాంకులొ చ్చిన రికార్డుందా యూనివర్శిటిలోని కొన్ని డిపార్ట్‌మెంటుల్లో. అంటే కులమెంత పాతు కుపోయుందో దీంతోనర్థమవుతుంది"

"అందుకే యువతరం రిజర్వేషన్లు కావా లనో, వద్దనో ఆందోళనలు చేయడం కాకుండా కులాలే వద్దని ఆందోళనలు చేస్తే మంచిది"

వేడిగా వాడిగా సంభాషణలు జరుగుతు న్నాయి. కొందరు సమర్థించడం, కొందరు వ్యతిరేకించడం జరుగుతూనే ఉంది. ఆ వాదాలతో తేలేదేం లేకున్నా ఎవరి అభిప్రా యాలను వాళ్లు చెబుతున్నారు.

సాంబయ్య కూడా అందులో ఉన్నాడు. మరికొద్ది సేపైంతర్వాత వాళ్లంతా లేచి ఎవ రిండ్లకు వాళ్లెళ్లిపోయారు.

సాంబయ్య ఇంటికెళ్లేసరికి శ్రీనివాస్ ముందురూంలో నుంచొని ఆనంద్, కవిత లతో మాట్లాడుతున్నాడు.

"ఎప్పుడొచ్చావురా శీను" ముందు గదిలో కొస్తూ అన్నాడు సాంబయ్య.

"గంట సేపైంది మామయ్యా" అన్నాడు శ్రీనివాస్.

"అన్నయ్య కాలేజీ విషయాలు చాలా చెబుతున్నాడు"

"అన్నయ్యేందిరా ఆనంద్. శీను నీకు బావైతడు"

"ఆ మేం అన్నయ్యనే పిలుస్తాం"

"సరే మీ ఇష్టం..." అన్నాడు సాంబయ్య. శీనుకెదురుగా సోఫాలో కూర్చున్నాడు.

"బాగా చదువుతున్నావా శీను. నువ్వి

ప్పుడు ఫైనలియర్ కదా! బాగా చదవాలి. లేకుంటే పీజీలో సీటుకూడా కష్టమే"

"బాగానే చదువుతున్నాను మామయ్యా! మీరు చెప్పినట్టు కాంపిటెటివ్ టెస్టులను దృష్టిలో పెట్టుకొని చదువుతున్నాను. కాని మండల్ గొడవలతో చాలా డిస్టర్బవుతోంది"

"ఇంకా చల్లారలేదా గొడవలు"

"ఏం చల్లారడం మామయ్యా! ఇంతకు ముందు ఆర్.ఎస్.యు, పి.డి.ఎస్.యు, ఎ.బి.వి.పి, ఏ.ఐ.ఎస్.ఎ, టి.ఎన్.ఎస్.యు లాంటి విద్యార్థి యూనియన్లుండేవి. ఇప్పుడు వీటికి తోడు కులాలవారి యూనియన్లు తయారయ్యాయి. వెనుకబడిన కులాలకు చెందిన విద్యార్థులు క్రాంతిదళ్ విద్యార్థి యూనియన్ ప్రారంభించారు. సిద్ధాంతాల పోరుతో పాటు కులాల పోరూ పెరిగింది"

"కొన్నేండ్ల నుంచి విద్యార్థి యూనియన్ల పట్ల విద్యార్థుల ఆసక్తి తగ్గి కెర్రియరిజంపై ఆసక్తి పెరిగినట్టనిపిస్తుంది నాకు. పోటీ తత్వం రోజురోజుకెక్కువవుతోంది. వీటికి



తగ్గట్టుగా నువ్వు చదువుతున్నావా? మీ నాన్నకున్న భయాలను తొలగించావా? విద్యార్థి యూనియన్లంటూ తిరగడం లేదు కదా!"

"లేదు మామయ్యా! నేనిప్పుడవేవీ పట్టించుకోవడం లేదు. నా చదువేంటో నేనేంటో అన్నట్టే ఉంటున్నాను. నా చదువు, పుస్తకాలు, కాలేజీ, ఇల్లు కాకపోతే లైబ్రరీ ఇంతే"

"గత నెలలో ఊరెళ్లినప్పుడు మీ నాన్న చెప్పాడు. రెణ్నెల్ల క్రితం నీ గదికి పోలీసులొచ్చారట ఎందుకు? "

"మీకు తెలియందేముంది మామయ్యా! మన ప్రాంతమేమో మండుతున్న అగ్నిగోళంలా ఉన్న సంగతి మీకు తెలిసిందే. ఉద్యమాల విషయంలో బట్టగాల్చి మీదేసే కాలమిది. పోలీసుల కందరిమీదా అనుమానాలే. విద్యార్థుల్లోనూ ఎవరేంటో తెలియకుండా ఉంది. ఎంతగా ఎన్నిటికి దూరముందామనుకున్నా ఏదోవిధంగా టెంప్ట్ కావడం జరుగుతుంది. బయటకెళితే గోడల్నిండా నినాదాల పోస్టర్లు... ఫలానావాళ్లను పట్టించాలని పోలీసులు వేసిన పోస్టర్లు, మరో దిక్కు అన్నల హెచ్చరికలు. ఇవన్నీ చూస్తూ ఏం తెలియని వాళ్లలా ఉండటం విద్యార్థులకెలా సాధ్యమవుతుంది? ఆలా ఉండడానికెంత మనో నిబ్బరం కావాలి?

మరో దిక్కేమొ కొంతమంది విద్యార్థులు విప్లవ సాహిత్యం గదుల్లోకి తీసుకొస్తారు. వాళ్లు తేకున్నా చదవమని ఎవరో గదుల్లో వేసి పోతుంటారు. ఎంత కాదనుకున్నా ఆ పుస్తకాలను ఎప్పుడో ఒకప్పుడు చదువక తప్పదు. హైద్రాబాద్‌లో ఉస్మానియా యూనివర్శిటీ హాస్టల్ నుంచి రోజుకో విద్యార్థిని పట్టుకపోతున్నారట. మొన్నమొన్న హాస్టళ్ల దగ్గర పోలీసు క్యాంపులేనట. తెలుగుదేశం పోయి కాంగ్రెసొచ్చినా, ఏ ప్రభుత్వమున్నా ఇవి తప్పడంలేదు"

"అవన్నీ నిజమేకాని నీ గదికెందుకు పోలీసులొచ్చారు? "

"మా గదిలో విప్లవ పత్రికలు దొరకాయని పోలీసులు బెదిరించారు. అవి నేను గాని, నా రూమ్మేటుగాని తెచ్చినవి కావు. పక్క గదతను తెచ్చుకొని మా గదిలో కూచొని చదువుకొని అక్కడే వదిలిపెట్టిపోయాడు. వాట్ని చూసి మమ్మల్ని బెదిరించారు పోలీసులు. అవి ప్రభుత్వం నిషేధించిన పత్రికలేం కాదు"

"అంతేనా? సరేకాని కొంచెం జాగ్రత్తగుండు"

"సరే" అన్నాడు శ్రీనివాస్"

"మీ అమ్మానాన్నలు బాగున్నారా? "

"బాగానే ఉన్నారు మామయ్యా"

"మొత్తంమీద ఇప్పుడు మండల్ ప్రభంజనం నడుస్తుందన్నమాట"

"అవును మామయ్యా! కులాల ఉసిల్లపుట్టను లేపినట్టయింది. ఇదెక్కడికి దారి తీస్తుందో తెలియడంలేదు.

"ఎక్కడికి దారి తీసేదేముంది? దీన్నాధారంగా చేసుకొని బిజెపి వాళ్లు అయోధ్య సమస్యను ముందుకు తెస్తున్నారు. త్వరలో మళ్లీ ఎన్నికలు తప్పవేమో" అన్నాడు సాంబయ్య.

★ ★ ★

వి. పి. సింగ్ ముక్కుసూటి రాజకీయాలా తన్ని పదవీచ్యుతుణ్ణి చేశాయి. చంద్రశేఖర్ ప్రధానమంత్రిత్వమూ మూన్నాళ్ల ముచ్చటే అయింది. భారతదేశం మరోసారి ఎన్నికల బరిలోకిదిగింది. ప్రజలకు అరచేతిలో వైకుంఠం చూపెడుతూ వివిధ రాజకీయ పార్టీలు రంగంమీదికొచ్చాయి.

ఒకరు సుస్థిరపాలన నినాదంతో ఓట్లడుగుతున్నారు. మరొకరు వెనుకబడిన కులాలవారి ఆపద్బాంధవులుగా చెప్పుకుంటూ

ఓట్లడుగుతున్నారు. ఇంకొకరు గుళ్లను, రథాలను ముందుకు తెచ్చి ప్రజల మనోభావాలను రెచ్చగొడుతూ మతం పేరుతో ఓట్లడుగుతున్నారు. వామపక్షాల పేరుమీదున్న పార్టీలకు దేశమంతటా పోటి చేసి గెలిచే శక్తిలేదు. అందుకే ఏదో ఓ పార్టీ కొమ్ముకాస్తూనే ఉన్నాయి. పతనం దిక్కు పయనిస్తున్న రష్యా పరిస్థితులు ఆ పార్టీలపట్ల నమ్మకాన్ని కోల్పోయేట్టు చేస్తున్నాయి.

తెలంగాణలో ఎన్నికల బహిష్కరణ పిలుపు ఉంది.

దేశంలోని దాదాపు సగం నియోజకవర్గాల్లో ఎన్నికలు ముగిశాయి. రెండవ ఘట్టం ఎన్నికల ప్రచారంలో రాజీవ్‌గాంధీ హత్య జరిగింది. తల్లి చనిపోయి ఏడేళ్లైనా కాకముందే నెహ్రూ కుటుంబంలోని మూడవ తరపు చివరి వ్యక్తి మరణించాడు. దేశాన్ని త్వరలోనే ఇరవై ఒకటవ శతాబ్దంలోకి తీసుకుపోతానన్న రాజీవ్ ఆ శతాబ్ది రావడానికింకో దశాబ్దికాలముండగానే కన్ను మూశాడు. ఆ తర్వాత జరిగిన ఎన్నికల్లో రాజీవ్ మరణంవల్ల కల్గిన సానుభూతి కాంగ్రెస్‌కు లాభించింది. కాంగ్రెస్ పార్టీ తరపున భారత ప్రధానిగా పి. వి. గద్దెనెక్కారు.

పి. వి. ప్రధాని కావడం తెలుగు ప్రజలకెంతో ఆనందాన్నిచ్చింది. కరీంనగర్‌జిల్లా ప్రజల ఆనందానికైతే హద్దులే లేవు. తమ జిల్లా వ్యక్తి, మారుమూల పల్లెలో పుట్టి పెరిగిన వ్యక్తి దేశాన్నేలే స్థితికి వచ్చినందుకు ప్రజలు పండుగే చేసుకున్నారు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందడానికెన్నో అవకాశాలున్న కరీంనగర్‌జిల్లా మరింత అభివృద్ధి చెందుతుందని ఆశించారు.

సాంబయ్య గ్రామ ప్రజలెంతో ఆనందంగా ఉన్నారు. ప్రధానమంత్రిని గూర్చి రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు.

"మన జిల్లా వాడేనాయె. ప్రధానమంత్రి మన జిల్లాకు సాయంజేస్తడు"

"రాజీవ్ రహదారి పనులయిపోతయి"

"హుజురాబాద్, హుస్నాబాద్ మన జిల్లాలో కరువు ప్రాంతాలు. శ్రీరామ్‌సాగర్ నీళ్లొచ్చినా ఆ ప్రాంతానికుపయోగపడటం లేదు. మాచెర్లడాం నీళ్లు కొంతుపయోగపడ్తున్నా అక్కడా నీటి కరువే. పి. వి లిఫ్ట్ ఇరిగేషన్ తెప్పిస్తడు. కొంచెమన్న ఉపయోగపడ్తడు"

"ప్రధాన మంత్రేనాయె. ఇవో లెక్కనా ఆయనెకు"

"రాజు తలుచుకున్నంక దెబ్బలకు కొదువా అన్నట్టు ఆయన తలుచుకుంటె మా చేస్తడు"

"ఆc అప్పుడు ముఖ్యమంత్రిగా ఉండి మన జిల్లాకు చేసిందేంటి? అప్పుడే చేయని వాడు ఇప్పుడేం చేస్తాడు? "

"అప్పటి సంగతి వేరు. ఇప్పటి సంగతి వేరు"

"మన జిల్లాను పట్టించుకోడాయన"

"ఎందుకు పట్టించుకోడు. ఇప్పుడాయనే అందరికంటే పెద్దాయె. ఇందిరాగాంధీ రాయబరేలీని, రాజీవ్‌గాంధీ అమేథిని అభివృద్ధి చేసినట్టు చేస్తడు"

"ఏం చేస్తడో చూస్తాం. కరీంనగర్ జిల్లా కేంద్రమే అయినా రైల్వేలైను లేదు. ఈ విషయం తెలుసుకున్న శ్రీశ్రీ కరీంనగర్ కొచ్చినప్పుడు ముక్కుమీద వేలేసుకున్నాడు. ఇది 1974 నాటి సంగతి. అప్పటికీ ఇప్పటికీ అదే పరిస్థితుంది"

"పెద్దపల్లి నిజామాబాద్ రైల్వేలైను పనులు పి. వి. కాలంలో పూర్తయితె బాగానే ఉంటది"

"పోచంపాడు కాలువ పూడుకొస్తుంది. దాన్ని బాగు చేయిస్తే మంచిగుండు"

"దాన్ని మంచిగ చెయ్యకుంటే అదుండీ లేనట్టే అవుతుంది"

"మన జిల్లావాడే దేశ ప్రధాని కావడం మనకెంతో గర్వకారణం. దక్షిణ భారత దేశంనుండే మొదటి ప్రధాని పి. వి"

"ఇల్లలుకగానే పండుగకాదు. మంచిప నులు చేసి తన సామర్థ్యం చూపి చరిత్రలో తన పేరుండేట్టు చూసుకోవాలి"

రాజకీయ పరిణామాల గూర్చి రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు. ఆ గ్రామంలో ఇప్పుడు అన్ని పార్టీల జండాలు ఊరి వెలుపలున్న బస్టాండు దగ్గర గద్దెలు కట్టి నిలబెట్టున్నాయి. ప్రజల్లో చాలామంది పార్టీల వారీగా చీలిపోయారు. వివిధ రాజకీయ పార్టీలవాళ్లు తమ ఓట్ల బ్యాంకులను పెంచుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఇదు వరకటి కంటెక్కువగా కుల సంఘాలకన్నా మతవాద ప్రచారం జరుగుతోంది. మరో దిక్కు ఉద్యమాల తీవ్రతుంది.

ఆ ఊళ్లో అంతవరకు హత్యలు జరుగలేదు. చిన్నచిన్న తగాదాలు, దండుగలతో పరిష్కరింపబడేవి. కొన్ని విషయాల్లో కోర్టుకెళ్లడమూ ఉండేది. అయితే ఊళ్లోకి ప్రవేశించిన పార్టీల రాజకీయాలు, ఇతర ఉద్యమాలు, మరెన్నో కారణాలవల్ల కుటుంబ తగాదాలు హత్యల వరకూ వెళ్లాయి.

కుటుంబ తగాదాలు, కులంలో జరుగుతున్న ఆధిపత్య పోరు, కులంలోని అంతర్గత పెనుగులాటలు బావా బావమరుదుల మధ్య కూడా చిచ్చు రగిల్చాయి. నర్సయ్యా, జగ్గయ్యల మధ్య తగాదాలు పరాకాష్టకు చేరుకున్నాయి.

వ్యవసాయం చేస్తూ రెక్కల కష్టంతో బతుకుతున్నాడు జగ్గయ్య. పైరవీకారిగా చలామణవుతూ ఏ కష్టం చేయకుండా బతుకుతున్నాడు అతని బావ నర్సయ్య.

వాళ్లమధ్య తగాదాలు చిలికి చిలికి గాలివానన్నట్టు తీవ్రరూపం దాల్చాయి. పక్కూరికి పోయి పంచాయితీ చేసి తిరిగొస్తున్న జగ్గయ్యను నర్సయ్య కొడుకు, అతని మనుషులు చంపేశారు.

కొద్ది రోజుల తర్వాత జగ్గయ్య తమ్ముడు, కొడుకులు కలిసి నర్సయ్యను హత్య చేశారు.

అంత దారుణహత్యలు జరగడం ఆ ఊళ్లో అదే మొదలు. వాట్ని చూసి ఊరంతా గజగజా వణికిపోయారు. యువతరం ఏవైపు పయనిస్తోందో వాళ్లకర్థం కావడంలేదు.

జగ్గయ్య, నర్సయ్యల హత్యల గూర్చి అయిలయ్య చెప్పిన మాటలు విని గజగజా వణికిపోయాడు సాంబయ్య. ఊళ్లోకి రూపాయి ప్రవేశంతోపాటు హత్యా రాజకీయాలు ప్రవేశిస్తున్నాయనుకున్నాడు.

ఎలక్ట్రానిక్ మీడియా ప్రభావం జనంపై విపరీతంగా పెరుగుతోంది. అంతకు ముందు మధ్య తరగతి స్త్రీలు తీరిక సమయాల్లో వారపత్రికలు, నవలలు, సీరియల్లు చదివేవారు. ఇప్పుడెక్కువ సమయాన్ని టీవీకే అంకితం చేస్తున్నారు. పఠనాసక్తి కొంత తగ్గింది. పత్రికవాళ్లు సర్క్యులేషన్ పెంచడానికి ఎన్నో జిమ్మిక్కులు చేస్తున్నారు.

యువతరంలో, విద్యార్థుల్లో టీవీ సంస్కృతి పెరుగుతోంది. విద్యార్థుల్లో అనుకరణ మనస్తత్వం ఎక్కువ అవుతోంది. క్రీడాకారుల్లా, సినిమాలోలా జులపాలు, జుట్టు పెంచుకోవడమూ ప్రారంభమైంది. చెవులకు పోగులు పెట్టుకునే యువతరమూ ముందుకొస్తోంది. నిర్వీర్యమయ్యే సంస్కృతి పెచ్చుమీరి పోతోంది.

షేర్ల సంస్కృతి పల్లెలకూ వ్యాపించింది. ఇదివరకట్లా గ్రామాల్లో అవసరానికి అప్పులు పుట్టడం కూడా కష్టమవుతోంది. మరోదిక్కు ఫైనాన్స్ కంపెనీల జోరూ హెచ్చుతోంది.

రెండేండ్ల తర్వాత బావ పనిచేస్తున్న ఊరుకొచ్చాడు అయిలయ్య. సాంబయ్య, సరస్వతి అవసరమైతే ఊరెళ్లారు కాని అయిలయ్య ఈమధ్య చాలా రోజులుగా బావ దగ్గరికెళ్లలేదు. శ్రీనివాస్ పెద్దవాడ

యింతర్వాత మామ దగ్గరికెళ్లొస్తున్నాడు.

మేనమామ రావడం చూసి ఎగిరి గంతేసారు ఆనంద్, కవిత. వాళ్లకు మేనమామంటే ఇష్టం. అతన్తో ఊరెళ్లడమంటే మరీ ఇష్టం.

ఇక్కడయితే అది ముట్టొద్దు, ఇది ముట్టొద్దు. మట్టిలో ఎగరొద్దు, మట్టి అంటించుకోవద్దని తల్లి కట్టుబాట్లు చెప్తుంది. బట్టలకు మరకలయితే తంతుంది. ఊరెళితే కొంతయినా ఎగరొచ్చు. దుముకొచ్చు. ఎడ్ల బండిలో పోవచ్చు. చేను దగ్గరికెళ్లొచ్చు. పచ్చి కంకులు తినొచ్చు. చెర్లో ఈత కూడా కొట్టొచ్చు.

అందుకే వాళ్ళకు ఊరెళ్ళడమంటే ఇష్టం.

"నాన్నా! అమ్మా! మామయ్యొచ్చాడు"

లోపలికురికొస్తూ కేకలేసారు ఆనంద్, కవిత. సాంబయ్య, సరస్వతి ముందుగదిలో కొచ్చారు.

"అందరు బాగున్నరా అన్నయ్య" అడిగింది సరస్వతి.

"బాగానే ఉన్నారమ్మా" అన్నాడు అయిలయ్య.

"కాళ్ళకు నీళ్ళియ్యవోయ్ మీ అన్నయ్యకు"

ఇచ్చినా ఆ నీళ్ళతోని ముందుగదిలో కాళ్ళు కడుక్కుంటే మీరూర్కుంటారా బావా" అని బాత్‌రూంలోకెళ్ళాడు అయిలయ్య.

కాళ్ళు కడుక్కొని వచ్చి ముందు గదిలో కూర్చున్నాడు. అయిలయ్య తెచ్చిన అరటి పళ్ళ మూటను విప్పి తింటున్నారు ఆనంద్, కవిత.

సరస్వతి గ్లాసుతో నీళ్ళిస్తే తాగాడు అయిలయ్య.

ఆనంద్, కవిత అయిలయ్యకు చెరోపక్కన కూర్చున్నారు.

కొద్దిసేపు ఒకరి బాగోగుల గూర్చి ఇంకొకరడుక్కున్నారు. సరస్వతి తెచ్చిన టీ తాగాడు అయిలయ్య.

"శుక్రవారం దేవునికి వ్రతం చేసుకునేదుంది. ఎల్లుండే కదా శుక్రవారం ఈ రోజు సాయంత్రమన్న, రేపుదయమన్న మనమంతా ఊరెళ్ళాలి. మిమ్ములను తీసుకుపోవడానికే వచ్చిన" అన్నాడు.

"ఇంకా గొర్లు, మేకలు కోస్తూ శుక్రవారం దేవునికి చేసుకుంటున్నవా బావా! అంత ఖర్చెందుకు చెప్పు?"

"ఏదో వెనుకట్నుంచి వస్తున్న ఆచారం. దాన్ని పడగొట్టడమెందుకు? ఖర్చనుకుంటే అన్నీ ఖర్చే. ఈ పేరు మీదనయినా నలుగురికి భోజనం పెట్టచ్చుకదా"

"సరే... నీకు ఖర్చుపెట్టాలనుంటే నేనెందుకు వద్దంటాను? మమ్ములను తీసుకెళ్ళడానికి నువ్వే పనులు వదిలిపెట్టుకొని వచ్చావా? ఓ ఉత్తరం రాస్తే మేం రాకపోయామా?"

"ఇంత పండుగ చేసుకొని ఉత్తరం రాసి రమ్మంటరా అని అనరా మీరు. ఉత్తరం రాసేదానికి రాస్తాం. తీసుకెళ్ళేదానికి తీసుకెళ్ళాలె"

"ఆమాట నిజమేకాని మీచెల్లెమన్న చిన్నపిల్లా తీసుకుపోవడానికి! ఆనంద్ ఎస్సెస్సీ చదువుతున్నాడు. మనమిప్పుడు చిన్నపిల్లలంకాదు. పెద్ద మనుషులమన్నట్టే. నువ్వు తాతవు కూడా అయ్యావు. అయినా తోలుకపోవాలంటావు"

"మనమెంత పెద్దవాళ్లమయినా ఓ పద్ధతిగ నడుచుకోవాలె బావా! ఆడబిడ్డలను తీసుక పోకుంటెట్ల? మీరేమనుకోరు నిజమే. మా చెల్లూర్కుంటదా? ఉత్తరం రాసి రమ్మంటడా అనదా?"

బావ, బావమరుదులిద్దరూ మనసు విప్పి మాట్లాడుకుంటున్నారు. ఇంతలో "ఆనంద్ ఆనంద్" అని పిలుస్తూ సునిల్ లోపలికొచ్చాడు.

"రారా సునిల్" అని ఆనంద్ పిలువగానే

వచ్చి అతని పక్కన కూర్చున్నాడతను

సునిల్ తండ్రి నార్త్ ఇండియన్. చాలా కాలంగా వాళ్ళిక్కడే ఉండటంవలన సునిల్ తెలుగు బాగానే మాట్లాడుతాడు.

సునిల్ చెవికున్న పోగును చూశాడు అయిలయ్య.

"అదేంటిది బాబూ" అనడిగాడు.

"చెవులకున్నదేంటిదిరా? " సాంబయ్య కూడా అడిగాడు.

"కపిల్ దేవ్, క్రికెట్ ఆటగాళ్ళు, కొందరు సినిమా యాక్టర్లు, కుస్తీలు పట్టేవాళ్ళు చెవులకు పోగులు పెట్టుకుంటున్నరు గదం కుల్. ఇది బంగారంతోని చేసిన చెవి పోగు" అన్నాడు సునిల్.

"వాళ్ళు పెట్టుకుంటున్నరని మీరుగూడ పెట్టుకోవాలా? "

"సినిమా యాక్టర్ వెంకటేశ్ గూడ పెట్టుకుంటున్న డంకుల్. పెట్టుకుంటేంది? "

"అది పెట్టుకుంటె మీకేమొస్తది"

"మంచిగనిపిస్తదంకుల్"

ఆనంద్ తెచ్చిచ్చిన పుస్తకం తీసుకొని వెళ్ళిపోయాడు సునిల్.

"అమ్మ... మామయ్య తెచ్చిన పచ్చికంకు లొలిచి గారెలు చేస్తదట" అంది కవిత.

"నీకెప్పుడూ తిండిగొడవే" చెల్లెను కసురుకున్నాడు ఆనంద్.

"తిండి యావ నీకే... నువ్వే బాగా తింటావు" అంది కవిత.

"ఎవరికి సరిపోయేంత వాళ్ళు తింటారు గాని గొడవ పడకుండ్రి" అన్నాడు సాంబయ్య.

కొద్దిసేపాగి...

"నాన్నా... నాన్నా" అన్నాడు ఆనంద్.

"ఏంటి? ఏంకావాలో చెప్పు? " అన్నాడు సాంబయ్య.

"నాన్నా! నాకు సునిల్ గాడికి కుట్టించినట్టు చెవ్వుకు బంగారు పోగు కుట్టించవా? నాకది మంచిగనిపిస్తుంది"

ఆనంద్ మాటలు విని నోరు తెరిచాడు అయిలయ్య.

"అదొక్కటేనా? ఇంకేమైనా కావాలా? కొంతమంది పెంచుకుంటున్నట్టు జుట్టు పెంచుకోవా మరి! చుట్టూ కత్తిరించి నడి తలమీద ఇంత పొడవు జుట్టు పెంచి భుజాలవరకు వేలాడదీసుకుంటున్నారు కొందరు. అలా వద్దా నీకు? " నవ్వుతూ అన్నాడు సాంబయ్య.

"నాన్నా... అన్నయ్యకు రెండు చెవులూ, ముక్కు కూడా కుట్టించు. నగలు పెట్టుకుంటాడు. మెడలో గొలుసు వేసుకుంటానని చాలా రోజుల్నుంచి అంటున్నాడుగదా! జుట్టు కూడా పెంచుకుంటే సరిపోతుంది. జడేసుకోవచ్చు అప్పుడు మాకున్నయన్నీ ఉన్నట్టే అవుతుంది" అంది కవిత నవ్వుతూ.

"దీనికేందో తెలిసినట్టు బాగ మాట్లాడుతుంది! వేసుకుంటేందట! ఆడవాళ్ళు జుట్టు కత్తిరించుకుంటలేరా? ప్యాంట్లు వేసుకుంటలేరా? జీన్ పాంట్లు గూడ వేసుకుంటున్నరుగద"

"అయితె మీరు చీరలు గట్టుకోండ్రి"

"దవడమీద చరిస్తే పండ్లిరుగాలె" చెల్లెను బెదిరించాడు ఆనంద్.

"నువ్వు కొడితే నేనూర్కోను. నువ్వొక్కటి గొడితే నేను రెండు గొడుత"

చదవడం మాని అన్నా చెల్లెండ్లిద్దరు పోట్లాడుకుంటున్నరా? అదీ మామయ్య ముందట్నే. ఎవరైనుంటే వాళ్ళముందే మనరని రెచ్చిపోతుంటారిద్దరు. ఇదంతా తండ్రిచ్చిన అలుసే... లోపలి గదిలోకెళ్ళి చదువుకోండ్రి. మామయ్య, నాన్న మాట్లాడుకుంటుంటారు" అంది సరస్వతి గద్దరించినట్టుగా.

"అమ్మా, చదువు చదువని మమ్ముల్ని చంపకే. మామయ్యొచ్చినప్పుడైనా కొంచెం

ఊపిరి పీల్చుకోనియ్యలేవు. ఎప్పుడూ చదువేనాయె. రేపెట్టాగూ ఊరెళ్తున్నాంగా! మాకు రాంకులు గూడొస్తున్నయి గద" అన్నాడు ఆనంద్.

"వస్తున్నయి తియ్యి రాంకులు. నాలుగు ఐదో రాంకులో రాంకులా? మీకు ఆటల మీదున్న శ్రద్ధ చదువుమీద లేదు. ఊరెళ్తే అక్కడ ఇష్టమున్నట్టెగురొచ్చని సంబరపడుతన్నారు మీరు. మరాడికెళ్తె మనుషులే కారు. మట్లె, దుబ్బల ఇష్టమున్నట్టెగురుతరు. ఊరికెళ్ళడం లేదేం లేదు. అనవసరంగా రెండుమూడు రోజుల బడి పోతుంది" అంది సరస్వతి.

తల్లి మాటలకు ముఖం మాడ్చుకున్నారు పిల్లలు.

"సరస్వతీ! ఇప్పటికే పిల్లలు చదువు పేరుతో అన్నిటికీ దూరమవుతున్నారు. పోగా పిల్లలకు ఊళ్ళ గురించి అవగాహన వసరం. నువ్వేమో ఊరెళ్తే మురికిపడుతారంటావు. చుట్టరికం కోసమని కాదుగాని పిల్లల కోసమన్నా మనం అప్పుడప్పుడూ రెళ్ళాలి. రెండ్రోజులు స్కూలు పోతే పోనియ్. నేను చెపుతానా పాఠాలు" అన్నాడు సాంబయ్య.

"మీ అలుసే వాళ్ళనిలా తయారుచేస్తోంది. ఒక్క చదువు విషయంలో తప్ప పిల్లలకు పూర్తి స్వేచ్ఛంటారు మీరు. మీ ఈ అలుసుతో పిల్లలేమవుతారో ఏమో! కలెక్టరునుకుంటే కండక్టర కూడా అవుతాడో లేడో ఆనంద్"

"నువ్వేం భయపడకమ్మా! అన్నయ్య సంగతి అనుమానమేకాని నేనయితే తప్పకుండా డాక్టరునవుతాను" అంది కవిత.

"నీ గురించి నాకు బెంగేంలేదమ్మా. నువ్వు డాక్టరువయినా కాకున్నా పొరుగింటికి పోయేదానివి. ఆడపిల్ల ఉద్యోగం చేయకున్నా మంచి భర్త లభిస్తే సమస్య తీరినట్టే. మగవాడి విషయంలో అలాకాదు గదా"

"నాలాంటి మంచివాడు దొరుకుతే...? కదోయ్..." అన్నాడు నవ్వుతూ సాంబయ్య.

"ఇక చాల్తియ్యి సంబడం. ఇక మీ మంచితనం గురించే చెప్పాలి. నా సుఖమో సుఖంగాదు. కార్లోంచి కాలు కిందబెట్టిందే లేకపాయె"

"సరస్వతీ! వయసు పెరిగినా నీకింకా పసితనం పోలేదు. ఏ స్త్రీకయినా ఎన్ని నోములు నోచితే మాత్రం బావలాంటి మంచి భర్త దొరుకుతాడు? నిన్నెప్పుడూ పల్లెత్తుమాటనగా చూల్లేదు బావను. అంటే గింటే నువ్వే అనుంటావు. నీకేం తక్కువయింది? హాయిగా బతుకుతున్నావుగదా"

"నీకాయనమీద చాలా నమ్మకమన్నయ్యా... నీ ఆలోచనలు మనూర్ని దాటి రావు. నాకేం తక్కువో నీకేం తెలుసు?"

"ఏంలేదు బావా! సరస్వతికిప్పుడు కావాల్సింది కారు కొనడం. కారు కొనగలిగే శక్తుందో లేదో ఆమెకనవసరం. కారవసరమా కాదా అన్నది కూడా అనవసరమే. ఎవరో కొన్నారు కాబట్టి మనమూ కొనాలంతే"

సాంబయ్య మాటలు విని నవ్వాడు అయిలయ్య.

"చెల్లే! మనం పేద వ్యవసాయ కుటుంబంలోంచి వచ్చాం. బావ వాళ్ళ నాయినమ్మకు టీ అంటే కూడా తెలిసేది కాదు. ఓసారి టీ ఇస్తే కాలుతుందని అందులో నీళ్ళుపోసుకొని తాగింది. సైకిల్ కూడా లేని స్థితిలోంచి వచ్చిన బావ స్కూటర్ నడుపుతున్నాడు. ఇది చాలదా? మన కుటుంబాల బ్యాక్‌గ్రౌండ్ కూడా చూడాలన్నది మరిచిపోకు. నీ బిడ్డ, కొడుకు కొనుక్కుంటారులే కార్లు"

"అన్నయ్యా! మీరల్ప సంతోషులు... మీకిక్కడి సంగతులు తెలియవు. ఇక్కడికి కట్టుబట్టల్తోని వచ్చినవాళ్ళు కూడా కార్లు కొన్నా

రిప్పుడు ఒక్క జీతం డబ్బులు చాలని చేతులు ముందటబెట్టుకొని కూచుంటే పైకెట్ల వస్తారు? ఉద్యోగమే లేక ఎంద రెన్ని పనులు చేస్తున్నారో తెలుసా మీకు! షేర్లు, ప్లాట్ల వ్యాపారం, చిట్టీలు నడపడం, భార్యల పేర్లమీద ఇన్సూరెన్సు ఏజన్సీలు, ట్యూషన్లు చెప్పడం చేస్తూ సంపాదిస్తు న్నారు కొందరు లీడర్‌షిప్‌లు చేస్తూ సంపాదిస్తున్నారు. కేవలం జీతంతో పిల్ల లకేం సంపాదిస్తాం"

"చెల్లే... నువ్వెన్నైనా చెప్పు. నీ ఆలోచ నలు, కోర్కెలు భూమ్మీదున్నట్టు కనబడటం లేదు. పిల్లల్ని మంచిగా చదివించుకుంటు న్నారు జిల్లా కేంద్రంలో ఇల్లు కట్టుకు న్నారు. ఎంతో కొంత వెనుకేసుకుంటు న్నారు. అన్ని వసతుల్తో హాయిగా బతుకు తున్నారు. ఇవి చాలవంటావా? ఎవరితోనో పోల్చుకుంటూ మనల్ని మనం తక్కువ చేసుకుంటే ఆ జీవితంలో సుఖముండదు. ఇది స్వయంకృతమే అవుతుంది. అయినా నాకు తెలియకడుగుతాను. ఇక్కడి ఉద్యోగు లందరిదీ ఎనిమిది గంటల పని కదా! ఎని మిది గంటల డ్యూటీ చేస్తూ మిగతా సంపా దనాపరమైన పనులు చేయడానికి ఎలా వీలుకల్గుతుంది మీ వాళ్ళకు"

"ఇక్కడ డ్యూటీలు సరిగ్గా చేసేవాళ్ళు తక్కువే. మీ బావలాంటివాళ్ళు కొంత మందే"

"ఇదీ బావా మన సంస్కృతి! మీ చెల్లె చెప్పేది వాస్తవమే. అసలు కంటె వడ్డీ ఎక్కువన్నట్టు చేస్తున్నారిక్కడి వాళ్ళు. డ్యూటీల కంటె ఇతరపనులే ముఖ్యం. పని చేసినా చేయకున్నా జీతమొస్తుంది కదా! అలా చేయడం నాకిష్టంలేదు. వాళ్ళలాగే నన్నూ చేయమంటుంది మీచెల్లె. మనల్ని పోషిస్తున్న సంస్థకు మనం రుణపడున్నాం. అందుకోసం డ్యూటీలైనా సరిగ్గా చేయకుం టెలా. మీ చెల్లె చెప్పేలాంటి వాళ్ళవల్ల కొంత, అనేక ఇతర కారణాలవల్ల మా ఫ్యాక్టరీ నష్టాల్లో నడుస్తోంది. దీన్ని ఖాయలాపడ్డ పరిశ్రమగా ప్రకటించబో తోంది ప్రభుత్వం ఉద్యోగమేమవుతుందో ఏమో. మీ చెల్లెకివన్నీపట్టవు"

సాంబయ్య ముఖంలో భయాన్ని చూశాడు అయిలయ్య. ఆ మాటలు వింటున్న అయిలయ్యకూ భయమేసింది. ఇక్కడి జీవితానికలవాటుపడ్డ బావ కుటుంబం ఉద్యోగం పోతే ఎలా బతుకు తారు? వాళ్ళు వీధినపడటం తాను చూడ లేడు.

అయిలయ్య ముఖంలో భయాన్ని గమ నించాడు సాంబయ్య.

"బావా! మా గురించి నువ్వేం భయప డకు. ఇది కేంద్రప్రభుత్వసంస్థ. అంత సుల భంగా మూసెయ్యడం జరుగదు. మూసే సినా ఏదో కొంత బెనిఫిటిస్తారు. ఒకవేళ అలా జరిగితే నాకున్న పి.జి. డిగ్రీతో ఏదో ప్రేవేటుద్యోగమో మరేదో సంపాదించుకుం టాను. నేనేం ఖాళీగా ఉండను"

"మొత్తంమీద మన తెలుగు ప్రధాని పెద్ద బాంబే వెయ్యబోతున్నాడన్నమాట"

"అన్నమాటేంది ఉన్నమాటే. ఇది ప్రభు త్వరంగ సంస్థల ఉద్యోగులకు అశనిపాతం లాంటిదే"

"ఇంతకూ మీవాడి చెవిపోగుల సంగతేం చేసినవు? " వాతావరణాన్ని తేలిక చేయా లని అన్నాడు అయిలయ్య.

ఆ మాటలకు నవ్వాడు సాంబయ్య.

"ఆనంద్... కవితా! మీరిద్దరిటురండి"

వాళ్ళు లేచి తండ్రి దగ్గరికొచ్చారు.

"మీ మామయ్య చెవిని పరీక్షగా చూడండి. అలాగే ఎడమ ముక్కును. చెవు లకు, ముక్కుకు రంధ్రాలున్నాయో లేవో చూడండి" అన్నాడు.

"కుడి చెవికి, ఎడమ ముక్కుకు రంధ్రాలు న్నయి" అన్నారు వాళ్ళు.

"నా కుడి చెవిని చూడుండ్రి"

పరీక్షగా చూశారు ఆనంద్, కవిత.

"రంధ్రం పూడుకుపోయింది నాన్నా" అన్నాడు ఆనంద్.

"పల్లెటూళ్లలో మా చిన్నప్పుడు చాలా మందికి చెవులకు కనకపోగులుండేవి. విడి ముక్కు, విడి చెవి కుట్టించేవారు. ముఖ్యంగా వ్యావసాయిక కుటుంబాల వాళ్లు, కూలినాలి చేసుకునే కుటుంబాల వాళ్లిలా చేసేవారు. మన కుటుంబాల్లో ముసలివాళ్ళకు చాలామందికి ముంజేతికి పోంచులు, చేతులకు దండకడియాలుండేవి. మాకు చెవికి కనక పోగులుండటం చూసి రెడ్లు, వెలుమల పిల్లలు మమ్మల్ని దెప్పే వారు. మన కుటుంబాల్లోనూ చదువుకుం టోన్నవాళ్ళు పెరిగింతర్వాత ఇలాంటివి ధరించడం అనాగరికమని మానుకున్నారు. అప్పుడు అనాగరికమని మానుకున్న వేషధా రణే ఇప్పుడు నాగరికులు భరించేదయింది. భూమి గుండ్రంగా ఉందంటారు చూడు, అలా ఉంది వీటి సంగతి. మా కాలంలో పల్లెల్లో కుట్టించుకున్న చెవులు, ముక్కు కుట్టించడం నీకు కావాలా ఆనంద్! కావా లంటే కుట్టిస్తాను. ఈ అనుకరణలు ఎంతో కాలముండవు. టీవీల, సినిమాల ప్రభా వంతో వస్తున్న ఈ వెర్రివెర్రి అనుకరణలె క్కువ కాలముండవు"

తండ్రి చెప్పేవి శ్రద్ధగా వింటూ తలలూ పుతున్నారు కవిత, ఆనంద్.

"నాకు చిన్నతనంలో నెత్తిమీద వేలు పొడుగు జుట్టుండేది. అది చాలాకాల ముంది. అది కనబడకుండా వెంట్రుకల్లో దాచుకునేవాణ్ణి. దాన్ని మా నాయనమ్మ పైకి పట్టుకొని క్షవరం చేయించేది. అది యాలాల దేవుని మొక్కట. ఎనిమిదవ తర గతి కొచ్చేవరకు ఆ జుట్టలాగే ఉంది. దాన్ని చూస్తూ అందరు నన్ను జుట్టు సాంబ య్యాని పిలిచేవారు. కాలుకు ఆంజనేయ స్వామి మొక్కుమీద బేడుండేది. దాన్ని పి.యు.సి చదివేటప్పుడు తీసేశాను. ఇలా ఏన్నో ఉండేవి. బాగా ఆలోచిస్తే అవే ఇప్పుడు మళ్ళీ ఫ్యాషన్లవుతున్నాయా అనిపిస్తోంది"

తండ్రిమాటలు వింటున్న ఆనంద్ ఇక వాటి జోలి ఎత్తకూడదనుకున్నాడు.

మాంసం ఉడుకుతున్న కమ్మటి వాసనొ స్తోంది వంటరూంలోంచి.

"అమ్మా... తొందరగా కానియ్యే వంట. మటన్‌తోని ఫుల్లుగా దంచేయాలి" అన్నాడు ఆనంద్.

"మాంసం ముఖమెప్పుడన్నా చూసి నవా? " కొడుకును మందలించింది సర స్వతి.

★ ★ ★

తెల్లవారి సాంబయ్య కుటుంబంలో వాళ్ళందరినీ తీసుకొని తమ ఊరెళ్ళాడు అయిలయ్య. మరుసటిరోజు పెద్ద గొర్రె పొట్టేలును కోసి శుక్రవారం దేవునికి ఘనం గానే కొలిచాడు. ఊళ్ళో ఉన్న కులం వాళ్ళం దరినీ పిలిచాడు. సాంబయ్య తల్లి కూడా వచ్చిందక్కడికి. భర్త చనిపోయింతర్వాత ఆమె కూతురుతోనే ఉంటున్నా కొడుకూ కోడలు మీద మునుపట్లా వ్యతిరేకత చూప డంలేదు. మిగిలిన కొద్దిపాటి ఆస్తిని ఆమె పోషణార్థం చెల్లెలికప్పగించి చేతులు దులు పుకున్నాడు సాంబయ్య. అదీ ఆమె ఇష్టప్ర కారమే జరిగింది. అప్పుడప్పుడు తల్లిని కలు సుకొని వందో, రెండువందలో ఆమె చేతిలో పెట్టి వస్తున్నాడు. ఈసారీ అదే పనిచేశాడు సాంబయ్య.

అదివారం సాయంత్రం వెళ్ళిపోతాడు సాంబయ్య. ఈసారి రెండుమూడు రోజులు ఊళ్ళో ఉన్నందుకు ఆనంద్, కవితల కానందంగా ఉంది. ఊరంతా తిరిగారు. శ్రీనివాస్‌తో కలిసి పొలాలదిక్కూ వెళ్లొ చ్చారు ఎడ్లబండిమీద.

ఆదివారం మధ్యాహ్నం భోజనాలు ముగించి అరుగుమీద వాల్చున్న మంచాల్లో కూర్చున్నారు వాళ్ళంతా.

"మామయ్యా! నాది డిగ్రీ అయిపోయింది కదా! ఎమ్మేలో చేరినమాటా నిజమే. కాని నాకెందుకో చదవాలనిపించడంలేదు. కరీంనగర్‌లో చాలా ఫైనాన్స్‌లున్నాయి కదా! ఏదో ఓ ఫైనాన్స్ కంపెనీలో పార్ట్‌నర్ షిప్ తీసుకుంటాను. నా స్నేహితులు చాలామందున్నారు. ఎమ్మే చేసినా ఏదో ఉద్యోగమే కదా చేసేది. ఉద్యోగం చేస్తూ ఏంసంపాదిస్తాం చెప్పండి. ఫైనాన్సులు పెట్టి నాతో చదువుకున్న వాళ్ళు కూడా బాగానే సంపాదిస్తున్నారు. అదే మంచి బిజినెస్సనిపిస్తోంది" అన్నాడు శ్రీనివాస్.

ఆ మాటలూహించలేదు సాంబయ్య. అయిలయ్యకూ ఆ మాటలు కొత్తగానే ఉన్నాయి. శ్రీనివాస్‌కా బుద్ధెందుకు పుట్టిందో సాంబయ్య కర్థం కావడం లేదు. హైద్రాబాద్‌లో ఎమ్మేలో చేరిన వాడలా ఎందుకంటున్నాడో సాంబయ్యకు తెలియడంలేదు.

శ్రీనివాస్‌ను గట్టిగానే మందలించాలనుకున్నాడు సాంబయ్య.

"నీకీ బుద్ధెందుకు పుట్టింది? శ్రద్ధగా చదువుకోక నీకీ ఆలోచనలన్నీ ఎందుకు? మన జిల్లాలో ఫైనాన్సులు పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నమాట నిజమే. అవెన్నో రోజులుంటాయని నేననుకోను. ఫైనాన్సుల పేరు మీద మధ్యతరగతి ఉద్యోగులతో రైతులతో చిన్నచిన్న పెట్టుబడులు పెట్టించి ఆ తర్వాత బోర్డులు ఎత్తివేయడం చూస్తూనే ఉన్నాం కదా. ఆకర్షణీయమైన బహుమతుల ఎర చూపుతున్నారు. నువ్వందరితో పెట్టుబడులు పెట్టిస్తావు. బాగానే ఉంది. ఆ డబ్బును మల్టిపుల్స్‌గా ఎలా మారుస్తారు? స్పష్టమైన పథకాలేమైనా ఉన్నాయా? అవేవీ లేకుండా ఫైనాన్సులు పెట్టి ప్రజల్ని మోసంచేస్తే ఆ తర్వాత ఎవరు బాధ్యులు? బోర్డెత్తివేస్తే ఎవరిది బాధ్యత? "

"అలా ఎందుకు చేస్తారు మామయ్యా!? "

"అలా జరిగిందనుకో. నువ్వు సెక్యూరిటీగా ఉంటావా? "

"నేను మాత్రం ఎక్కణ్నుంచి తెచ్చిస్తాను డబ్బు? "

"అలాంటప్పుడు ఫైనాన్సులని మోసం చేయడమెందుకు? పుట్టగొడుగుల్లా పెరుగుతున్న వీట్లో నిలదొక్కుకొని ఉండగలిగే వెన్ని? వీటి ప్రధానోద్దేశ్యం 'ఎంజాయ్ విత్ అదర్స్ మనీ' అన్నదే. ఇందులో చాలావరకు కొన్నేండ్లలో మూతలు పడేవే. మనకిలాంటి సంపాదనలు వద్దు"

"మామయ్యా! మీ ఆలోచనలన్నీ క్లాసిక్‌గానే ఉంటాయి"

"కావచ్చు కాని శీనూ! పైకి రావాలని కోరుకోవడం తప్పుకాదు. దానికి కొన్ని నీతి నియమాలు పాటించాలి. ఎలాగైనా సరే లక్షలు సంపాదించుకోవాలనుకోవడం మంచిది కాదు. కష్టపడి సంపాదించుకుంటే మంచిదే. కాని మోసాలు చేస్తూ సంపాదించడం సరైందికాదు. ఇవి క్లాసిక్ ఆలోచనలైతే నావి క్లాసిక్ ఆలోచనలేననుకో"

"మరి నన్నిప్పుడేం చేయమంటారు? "

"ఏం చేయడమేముంది? ఎమ్మే పూర్తి చేయి. ఎలాగూ హాస్టల్లో గది దొరుకుతుంది కదా! స్కాలర్‌షిప్పవీ తిండికి సరిపోతాయి. ఇంటినుంచి స్వల్పంగానే పంపాల్సుంటుంది. చదువుకుంటూనే అన్ని కాంపిటీటివ్ టెస్టులను రాయి. హైద్రాబాద్‌లో ఉంటే ఈ ప్రయత్నాలు చేయొచ్చు"

"నాన్నను ఇంకింత కష్టపెట్టడం నాకిష్టం లేదు"

"డబ్బవసరముంటే నేను కొంత సాయం చేస్తాను. నేనెలాగూ నాకుటుంబానికేం చేసిన వాణ్ని కాలేదు. నన్ను చేయనీయక పోగా చేసిందాన్ని బూడిదలో పోసిన పన్నీ

రులా మార్చారు. పైగా నన్ను బదునాం చేశారు. సరే, అవన్నీ ఇప్పుడెందుగ్గాని ఇప్పుడు నీకున్న నీ తల్లిదండ్రుల గూర్చి ఆలోచన పెళ్ళయి జీవితంలో స్థిరపడింత ర్వాత కూడా ఉంటే మంచిదే" అన్నాడు సాంబయ్య.

"అంటే? నాకు ఉద్యోగమైతే మా అమ్మా నాన్నలను చూడనంటావా మామయ్యా" అన్నాడు శ్రీనివాస్.

"అని నేననడం లేదు శీనూ! అందరూ అలాగే ఉంటారనే చెప్పడంలేదు. కాని ఈ చదువుల్లో, ఈ విధానంలో ఏదో లోపముం దనిపిస్తుంది నాకు. ఇవి రోజురోజుకూ మరింత పొట్టకూటి చదువులుగా మారు తున్నాయేమోననిపిస్తుంది. ఇవి తరాల మధ్య అంతరాలను మరింత పెంచుతు న్నాయి. చాలామంది చాలా కబుర్లు చెబు తూనే పెళ్ళిళ్ళయి ఉద్యోగాలైన తర్వాత ఊళ్ళకు ముసలి తల్లిదండ్రులకు దూరమవు తున్నారు. చదువుకున్న కొడుకుల తరం చదువుకోని తల్లిదండ్రుల తరం మధ్య గ్యాప్ పెరుగుతూనే ఉంది. నా విషయం లోనూ అదే జరిగింది. నాకు ఊరుమీద, తల్లిదండ్రుల మీద ఎంత ప్రేమున్నా పరిస్థి తులే మా మధ్య దూరాన్ని పెంచాయి. నేనేం చేయలేకపోయాను. ఇలా జరుగకూ డదనే నా బాధంతా. మాతరం కంటె మీ తరంలో ఈ గ్యాప్ మరింత పెరిగే అవకా శముంది"

"ఇన్ని తెలిసుండే మీరు మీ కుటుం బాన్ని సరిచేయలేకపోయారు. ఆర్థికంగా నష్టపోవడమే కాకుండా బదునాం కూడా అయ్యారు" అన్నాడు శ్రీనివాస్.

"బావకున్న మెతక గుణం, ఎవర్నీ ఏమ నలేని స్వభావంవల్ల ఇలా జరిగింది. పోని య్యండి, అవన్నీ ఇప్పుడెందుకు? " అన్నాడు అయిలయ్య.

"ఆడబిడ్డ సొమ్మనో మరేదో అనో నన్ను అంటరానివాడిగా చూడకు. శ్రీనివాస్ చదు వుకు అవసరముంటే నా దగ్గర డబ్బు తీసుకో. నేనా డబ్బును శ్రీనివాస్ నుంచే వసూలు చేసుకుంటాను"

"మీ ఫ్యాక్టరీ పరిస్థితే అస్తవ్యస్థంగా ఉంటే మిమ్మల్ని ఇబ్బంది పెట్టడమెందుకు బావా? నా తిప్పలేవో నేను పడుతాను. ఈ రెండేండ్లు ఎలాగో కష్టపడి శ్రీనివాస్‌ను చదివిస్తాను"

"తమ్మీ! ప్రాణంపోయినా మీ బావమరిది ఆడబిడ్డ సొమ్ము తినడు. తాను పెట్టా ల్సింది పోయి తీసుకోవడం అసలే నచ్చదు. నా మీద రెండు తులాల బంగారముంది. అవసరమైతే అది అమ్మేస్తాం" అంది శాంతమ్మ.

"మరి బావ చదువు గూర్చి మాట్లాడింద్రు గాని నా సంగతో? " అన్నాడు ఆనంద్. సాంబయ్య, అయిలయ్య నవ్వారామాట లకు.

"నీ చదువు గూర్చేం మాట్లాడమంటావు. నువ్వింకా టెన్త్ కదా చదువుతున్నది"

"నేను ఇంటర్‌లో ఆర్ట్స్ తీసుకుంటాను నాన్నా! ఆ తర్వాత బి.ఏ. చేసి ఐ.ఏ.ఎస్‌కు తయారవుతాను. సైన్సు సబ్జెక్టుతో డిగ్రీ చేసి ఐ.ఏ.ఎస్. చేయడం కష్టమట" అన్నాడు ఆనంద్.

"అప్పటివరకు చూద్దాంలే. ఇప్పట్నుంచే ఆ ఆలోచనలన్నీ ఎందుకు? ఐ.ఏ.ఎస్ అనేది పెద్ద టార్గెట్. అదంత సులభం కాదు. అట్లని అసాధ్యం కూడా కాదు. కాని దాన్నే దృష్టిలో పెట్టుకొని బి.ఏ. చేస్తే అది రాలేదనుకో బి.ఏ.డిగ్రీ దేనికి పనికొస్తుంది. బి.ఏ.తో ఉద్యోగం రావడం కష్టం. అందు కోసం ఎమ్.పి.సి.తో ఇంటర్ చేయాలి. ఎమ్‌సెట్ రాసి ఇంజనీరింగ్‌లో చేరి పూర్తి చేసుకోవాలి. దాంతో ఐ.ఎ.ఎస్.కు ప్రయ త్నించాలి. ఐ.ఎ.ఎస్. రాకున్నా ఇంజనీర్ డిగ్రీతో జాబొస్తుంది"

"అది పెద్ద భారమవుతుంది నాన్నా! బ్రిల్లియంట్ కోచింగ్ మెటీరియలవన్నీ ఇప్పట్నుంచే తెప్పిస్తున్నారు కదా! నేనదే టార్గెట్ పెట్టుకుని చదువుతున్నాను"

"టెన్త్ అయిపోనియ్. తర్వాత చూద్దాం. టెన్త్‌లోనయితే ఏదో రాంకు తెచ్చుకునే ప్రయత్నం చేయి. మొదట్నుంచీ వందలోప లుండాలి"

"అన్నయ్యకా రాంకొచ్చేది, వానిమొహం" అంది కవిత.

"చిన్నపిల్లలు పెద్ద మాటలు" అంటూ లేచి నిల్చున్నాడు సాంబయ్య.

"బస్సెన్ని గంటలకుంది" అడిగాడు అయిలయ్యను.

"నాలుగ్గంటలకు బావా"

"ఇంకోగంట టైమే ఉంది. తయారుకండి, పోదాం" అన్నాడు సాంబయ్య.

వాళ్ళంతా ఊరెళ్లడానికి తయారయే ప్రయత్నంలో ఉన్నారు. ఆనంద్, కవితల కింకో రెండ్రోజులన్నా అక్కడుందామ నుంది.

కాని స్కూలు పోతుందని అమ్మానాన్న లొప్పుకోరని వాళ్ళకు తెలుసు. అందుకే వెళ్ళిపోవడానికి నిర్ణయించుకున్నారు.

★ ★ ★

శ్రీనివాస్ ఎమ్మే పూర్తిచేసి ఉద్యోగ ప్రయత్నాలు చేస్తున్నాడు. హైదరాబాద్‌లోనే ఉంటూ టెస్టులు రాస్తున్నాడు. ఉద్యోగం కొరకు తీవ్రంగానే ప్రయత్నిస్తున్నాడు. ఇప్పుడు బ్యాంక్ ప్రొబేషనరీ ఆఫీసర్ టెస్ట్ రాయడానికి తయారవుతున్నాడు. అయితే హైదరాబాద్ జీవితానికలవాటుపడ్డ తర్వాత శ్రీనివాస్ ఊరికి రావడం తక్కువ చేశాడు. ఇంటికెళ్ళడానికి మునుపట్లా సుముఖత చూపడంలేదు. ఏవేవో సాకులు చెపుతున్నాడు. వ్యవసాయప్పనులతో అయిలయ్య చిక్కి శల్యమవుతున్నాడు. ఎంత చేసినా ఏడేమానికలన్నట్టవుతున్న వ్యవసాయంతో సతమతమవుతున్నాడు. అతనికి ప్పుడు మిగిలిన భూమి కూడా స్వల్పమే. శ్రీనివాస్ ఉద్యోగంలో చేరి తండ్రికి బాసటగా నిలిస్తే తప్ప అయిలయ్య కష్టాలు తీరేట్టులేవు.

ఆనంద్ ఇంటర్ రెండవ సంవత్సరంలో ఉన్నాడు. సాంబయ్యెంత మొత్తుకుంటున్నా ఎమ్‌సెట్ రాయననే అంటున్నాడు. పాఠ్య పుస్తకాలతోపాటు ఇతర పుస్తకాలూ సీరియస్‌గానే చదువుతున్నాడు.

"నాన్నా! నేను ఖచ్చితంగా డిగ్రీ చేస్తాను. ఆ తర్వాత ఢిల్లీలో ఐ.ఏ.ఎస్. కోచింగ్‌కు పోతాను. ఏదేమైనా మీరన్నట్టు నేను ఐ.ఏ.ఎస్. చదవడానికి ప్రయత్నిస్తాను. అవుతానన్న నమ్మకమూ నాకుంది. దీన్నో ఛాలెంజ్‌గా, జీవన్మరణ సమస్యలా తీసుకుంటాను నేను. ఇప్పుడు ఎమ్‌సెట్‌కు, ఆ తర్వాత ఇంజనీరింగ్ చదవడానికి నాశక్తి నెందుకు వృధా చేసుకోవాలి. ఇంజనీరింగ్ తర్వాత ఏదైనా ఉద్యోగమొస్తే ఇంకేం చేయ బుద్ధి కాదు. పోగా మ్యాథ్స్, సైన్సు సబ్జెక్టులతో ఐ.ఏ.ఎస్.కు తయారుకావడం చాలా కష్టమైన పనంటున్నారు. ఇష్టమైన సబ్జెక్టు కూడా ఆర్ట్సే. అందుకోసం నేను బి.ఏ.నే చేస్తాను. అన్నిరకాల నోట్సు తెప్పించుకుంటూనే ఉన్నాను. కోచింగ్‌కి వెళ్తాను. నాకు నమ్మకముంది" అన్నాడు ఆనంద్.

ఇప్పుడు గుంటూరులో ఇంటర్ చేస్తున్నాడు ఆనంద్. సెలవులకోసమని ఇంటికొచ్చాడు.

"అది పెద్ద టార్గెట్. ఒకవేళ సెలెక్టు కాకుంటే బి.ఏ.తో ఉద్యోగం రావడం కష్టం"

"నాన్నా! ఒకవేళ ఐ.ఏ.ఎస్. రాలేదే అనుకుందాం. ఆ అనుభవం ఏ ఇతర కాంపిటీటివ్ టెస్టు రాయడానికైనా ఉపయోగపడ్తుందికదా! అవీ దొరుకకుంటే పి.జి.పిహెచ్.డి. చేసుకోవచ్చు పి.జి. చేసుకుం

టూనే ఐ.ఏ.ఎస్. ప్రిపేరవుతాను. అంతే కాని ఇటు బి.ఇ.చేసి అటు ఐ.ఏ.ఎస్. రాయడం నావల్ల కాదు. నేను ఇంజనీర్‌గా స్థిరపడబోవడం లేదుకదా. మరి బి.ఇ. చేయడమెందుకు? ఎమ్‌సెట్టెందుకు? "

తన ఉద్దేశాన్ని ఖచ్చితంగా చెప్పేశాడు ఆనంద్. కవిత ఎస్.ఎస్.సి. చదువుతోంది. ఆమె మొదటి నాలుగురాంకుల్లో ఉంటుంది.

ఈ సంవత్సరం ఇద్దరికీ బోర్డు పరీక్షలే. పిల్లల చదువుల గురించి ప్రత్యేక శ్రద్ధ తీసు కుంటున్నాడు సాంబయ్య. తేపకోసారి గుంటూరుకెళ్ళి వస్తున్నాడు. తన దగ్గరున్న కవితను బాగా చదవాలని ప్రోత్సహిస్తు న్నాడు.

పిల్లల చదువుల భారంతో సతమతమవు తున్న సాంబయ్య ఫ్యాక్టరీ మూతపడితే ఏంకావాలని భయపడుతున్నాడు. ఒకవేళ అదే జరిగితే నలభై ఏళ్లు దాటుతున్న వయ సులో మరో ఉద్యోగం దొరకడం కష్టమేన నుకుంటున్నాడు.

పిల్లలనెంత పెద్ద టార్గెట్లతో చదివిస్తున్నా తెలుగు భాష, సంస్కృతిలాంటివాటిమీద అభిమానం పోలేదు సాంబయ్యకు. ఒక్కో సారి ఈ చదువులెక్కడికి తీసుకువెళ్తున్నా యోనని బాధపడ్తుంటాడు కూడా. రకర కాల సంఘర్షణననుభవిస్తూనే వున్నాడు.

నెలకోసారి కరీంనగర్ కెళ్ళి ఇంటి కిరాయి లను వసూలు చేసుకొస్తుంటాడు సాంబయ్య. ఆ డబ్బు అవసరాల్లో ఎంతో ఉపయోగపడ్తుందతనికి.

ఆరోజు ఆదివారం కరీంనగర్‌లో బస్సు దిగాడు సాంబయ్య.

తెలుగును రక్షించుకుందాం. కళాభార తిలో సభ. మాతృభాషా సదస్సును జయ ప్రదం చేయండి. నిరుద్యోగ తెలుగు పండి తుల గోడు. గోడలకంటించి ఉన్న పోస్టర్లు చూశాడు.

సభ ప్రారంభం కావడానికింకో గంట సమయముంది.

ఈ సభకు తప్పకుండా పోవాలనుకు న్నాడు. ఇంటికెళ్ళి పనిముగించుకొని కళా భారతికి చేరుకున్నాడు సాంబయ్య.

తెలుగు డి.ఓ.యల్., బి.ఓ.యల్, బి.ఏ., ఎమ్.ఏ., టి.పి.టీ. ఎమ్.ఫిల్, పి.హెచ్.డి. చేసిన చాలామంది ఆ మీటిం గుకొచ్చారు. వాళ్ళతోపాటు ఉపాధ్యాయులు, నిరుద్యోగులు, తెలుగు భాషపై కొద్దో గొప్పో అభిమానమున్న వాళ్ళెంతోమందక్క డికి చేరుకున్నారు. ఆ జిల్లాకు చెందిన రచ యితలూ ఉన్నారక్కడ. తనకు తెలిసిన వాళ్ళకు విష్ చేశాడు సాంబయ్య.

"మిత్రులారా! నిరుద్యోగ తెలుగు పండిట్ల మైన మనమంతా ఈ విధంగా సమావేశం కావడం విచారకరమైన విషయమే. మనం చదువుకున్న చదువులు మనకు ఖాళీ పొట్ట లనే మిగులుస్తున్నాయి. ఇరవై ఏళ్ళక్రితంవ రకు తెలుగు, సంస్కృతం చదివేవాళ్ళలో నూటికి తొంభైమంది బ్రాహ్మణులే ఉండే వారు. వాళ్ళకు ఇళ్లల్లో ఉన్న వేదపఠనం, పంచాంగపఠనం, పౌరోహిత్యంలాంటివి వాళ్ళనివి చదవడానికి అవకాశం కల్పిం చేవి. అప్పుడు తెలుగు పండిట్ల సమస్య లంటే బ్రాహ్మణుల సమస్యన్నట్టుగానే ఉండేది. ఇప్పుడా పరిస్థితులేం లేవు. అన్ని కులాలవాళ్లూ తమ తమ అభిరుచులను బట్టి తెలుగు చదువుతున్నారు. ఉద్యోగాల కోసం ప్రయత్నిస్తున్నారు. ఇప్పుడు తెలుగు పండిట్ల సమస్యంటే అందరి సమస్యే. తెలుగు భాషా సమస్య. ఇందులో తెలుగు చదివినవారికి ఉద్యోగం సమస్య ఒక్కటే లేదు. మాతృభాషను రక్షించుకోవాల్సిన అంశమూ ఉంది. మనం మన సమస్యల గూర్చి చర్చించుకుందాం" అని ఆగాడు శర్మ.

"మనకు సమస్యలేమున్నాయి? నౌకరి దొరక్కపోవడమే సమస్య"

"ఇలాంటి మీటింగులవల్ల ఒరిగేదేం లేదు"

"1989 డిఎస్‌లో సెలెక్టు అయినవాళ్ళనే తీసుకోలేదింకా. మనకు నౌకర్లు ఇచ్చేదెవరు? "

వెనుకనుంచి తలోమాటన్నారు.

శర్మ కూర్చున్నాడు. మరోవ్యక్తి లేచి మాట్లాడటం ప్రారంభించాడు.

ఓరియంటల్ కాలేజీలను మంచి ఉద్దేశంతోనే స్థాపించారు. ఎన్టీఆర్ వచ్చింతర్వాత వీరావేశంతో తెలుగుకో విశ్వవిద్యాలయాన్నే నెలకొల్పాడు. అదీ మంచిదే. అధికార భాషగా తెలుగును అమలుచేయడానికి ముమ్మరంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. అధికార భాషా సంఘాలూ ఉన్నాయి. కాని అమలులో కొచ్చేసరికివన్నీ సాధిస్తున్నవి చాలా తక్కువ ప్రయోజనాలే.

మొదట్లో ఓరియంటల్ కాలేజీల్లో తెలుగు చదివినవాళ్ళకు సులభంగానే ఉద్యోగాలు దొరికినమాట నిజమే. ఆ తర్వాత వాళ్ళకు రోడ్లే గతయ్యాయి. ఇతర డిగ్రీలు చదివినవాళ్ళు ఉపాధ్యాయ వృత్తితో పాటు ఇతర ఉద్యోగాలకూ ప్రయత్నం చేసుకోవచ్చు. మరి మనకున్న అవకాశమిదొక్కటే కదా! బిచ్చంగా వెళుతున్న ఒకటి రెండు పోస్టులను కూడా బి.ఏ. తెలుగువాళ్ళను సెలెక్టు చేస్తున్నారు. ముందే ముక్కిడంటె అందులో దగ్గు పడిశమన్నట్టుంది భాషా పండితుల సంగతి. నా మట్టుకు నేను ఎమ్.ఓ.యల్. పాసై ఎనిమిదేళ్ళయింది. ఏ ఉద్యోగమూ దొరకలేదు. నాలుగువందల జీతంతో ప్రారంభించి ప్రస్తుతమో ప్రైవేట్ పాఠశాలలో వెయ్యిరూపాయలకు అరవచాకిరీ చేస్తున్నాను. తెలుగు విభుండ, తెలుగు వల్లభుండనంటూ తెలుగు భాషా సంస్కృతులను ఉద్ధరించడానికే పుట్టిన అవతారపురుషుడనని చెప్పుకున్నాడు ఎన్టీఆర్. కాని ఆ తర్వాత ఓరియంటల్ కాలేజీలనే మూసేస్తానని తెలుగు లెక్చరర్ల, ఉపాధ్యాయుల గుండెల్లో రైల్లు పరిగెత్తింపచేశారు. కొన్నిరోజులు వాటికి నిధులనే స్తంభింపజేశారు. తుదకెలాగోలా అవి నడుస్తున్నాయి. కొద్ది నెలల్లో మళ్ళీ అసెంబ్లీ ఎన్నికలు జరుగబోతున్నాయి. ఇప్పుడధికారంలో ఉన్న కాంగ్రెసో, తెలుగు దేశమో, మరో పార్టో అధికారంలోకి రావచ్చు ఎవరు అధికారంలోకి వచ్చినా, వస్తున్నా మన కన్నీళ్లు తుడిచేవాళ్ళయితే కనపడటంలేదు. ప్రతి సంవత్సరం డిగ్రీలు చేతబట్టుకొని వస్తున్న పండితులకు ఉద్యోగాలు మాత్రం దొరకడం లేదు. తెలుగు పద్యాలు చదువుకుంటూ బిచ్చమెత్తుకునే పరిస్థితులే వస్తున్నాయి.

"అది మీ కలవాటే వీరయ్యావార్లు" వెనుకనుంచెవరో అన్నారు.

"అది మాకలవాటయితే కావచ్చుగాని అందరి అలవాటుగా మారకూడదని నా ఉద్దేశం. అందరూ అడుక్కునేవాళ్ళే అయితే పెట్టేవాళ్ళెవరు మరి? అంటే అడుక్కోవడంలోనూ పోటీ పెరుగుతుందన్నమాట" అని ముగించాడు కృష్ణమాచారి.

ఆ మాటలకందరూ నవ్వారు.

ప్రైవేట్ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తున్న రవీందర్ లేచి మైకు ముందుకు వచ్చాడు.

"ప్రియమైన సోదరులందరికీ నా నమస్కారాలు. మనకెన్నో సమస్యలున్నాయి. కొత్త కొత్త సమస్యలు పుట్టుకొస్తున్నాయి. అసలు తెలుగు సబ్జెక్టునే తరిమివేసే పరిస్థితులు కనబడుతున్నాయి. మనం మన సమస్యలను నివేదించుకున్నా అవి బుట్టదాఖలు చేయబడుతాయని తెలుసు. అయినా మన పరిధిలో మనం పోరాటం లాంటిది చేయకతప్పదు.

నేను ఎమ్మే తెలుగు చేశాను. టి.పి.టి.

చేశాను. డాక్టరేట్ కూడా చేశాను. మెదడునంతా నాశనం చేసుకొని పరిశోధన పత్రం రాయడానికి సర్వశక్తులనుపయోగించాను. డాక్టరేట్ పట్టా పొందాను. అయినా ఉద్యోగం దొరకడంలేదు. దొరకడం కష్టం కూడా. కొద్దిరోజులు ఐదువందల రూపాయలకే ప్రైవేట్ పాఠశాలలో పనిచేసాను. తర్వాత ఎనిమిదివందలు. ఆ తర్వాత వెయ్యి రూపాయలకు. డాక్టరేట్ అయింతర్వాత కాలేజీల్లో పనిచేస్తే కొంత ఎక్కువ జీతం లభిస్తుందని అన్ని ప్రైవేట్ జూనియర్ కాలేజీలచుట్టూ తిరిగాను. ఇప్పుడు ప్రైవేట్ కాలేజీల ముందు ప్రభుత్వ కళాశాలలు వెలవెలబోవడం మనందరికీ తెలిసిందేకదా! చాలా ప్రైవేట్ కాలేజీల్లో తెలుగు, ఇంగ్లీషు మీడియంలున్నా తెలుగు మీడియం కిస్తున్న విలువ శూన్యమే. అందులో తెలుగు సబ్జెక్టుకిస్తున్న విలువింకా శూన్యం.

నైజాం పాలనాకాలంలో తెలుగువాళ్ళమై ఉండి కూడా తెలుగును చదువుకోలేని పరిస్థితుల నెదుర్కొన్నాం. అపుడు తెలంగాణలో ఉర్దూ చదవడం తప్పని సరయ్యింది. మరిప్పుడు? ప్రజాస్వామ్య ప్రభుత్వాల కాలంలో కూడా తెలుగు నేలపై ఉన్న పాఠశాలల్లోనుండి తెలుగును తరిమేస్తున్నాం. పెద్దపెద్ద ఉద్యోగాల్లో ఉన్నవాళ్ళయితే తెలుగును ఇంట్లోంచి కూడా తరిమేస్తున్నారు. పిల్లలకు మమ్మీ డాడీల సంస్కృతి నలవరుస్తున్నారు. తెలుగులో మాట్లాడటం తక్కువస్థాయి విషయంగా భావిస్తున్నారు.

మనమేం ఎక్కువడగడంలేదు. మన కోసం కొత్తకొత్త ఉద్యోగాలు సృష్టించమనీ కోరడం లేదు. కనీసంగా ఇతర సబ్జెక్టులకున్న పాటి విలువైనా అవకాశాలైనా మాతృభాషలో చదివినవారి కివ్వమంటున్నాం. మనదేశంలోనే మన రాష్ట్రానికంటే అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో ఆయా రాష్ట్రాల ప్రాంతీయ భాషను చదవడం తప్పనిసరి చేశారు. ఏ రాష్ట్రంవాడైనా సరే ఆ రాష్ట్రంలో ఉంటే ఆ భాషను నేర్చుకోవాలన్న నియమం పెట్టారు. దీన్ని భాషా దురభిమానమని కొందరంటే అనొచ్చు. ఇది భాషా దురభిమానమూ ప్రాంతీయ దురభిమానమూ అసలేకాదు. ఇలా చేయకుంటే కొన్నేళ్ళ తర్వాత హిందీ, ఇంగ్లీషు భాషల వెల్లువలో ప్రాంతీయ భాషలు మిగలవు. మన భాషసలే మిగలదు. ఆ ప్రమాదం నుండి మన భాషను రక్షించుకోవాలంటే ఏ రాష్ట్రంలో ఉన్నవారు ఆ రాష్ట్రం భాషను తప్పనిసరిగా చదువుకునేట్టు చేయాలి. వాటితోబాటు జాతీయ, అంతర్జాతీయ భాషల చదువుండనే ఉంది. నేనివన్నీ దురభిమానంతో అనడంలేదు. ఆవేదనతోనంటున్నాను. గుండె లోతుల్లోంచి పెల్లుబికి వస్తున్న బాధతోనంటున్నాను. ఇదంతా నిరుద్యోగ తెలుగు పండితుల ఘోషమాత్రమే కాదు. ప్రాంతీయ భాషలు సంస్కృతంలా మృతభాషగా మారకుండా చూసుకోవాలన్న తపన.

మనలాంటివాళ్ళ మెమొరాండాలతో పని కాదని తెలుసు. అయినా మన ప్రయత్నం మనం చేద్దాం. ఉన్నత స్థితిలో ఉన్న తెలుగు ప్రముఖులు, రచయితలు ఈ సమస్యనెందుకు పట్టించుకోరో నాకర్థంగాదు. మనం ఎన్ని పోరాటాలైనా చేసి తెలుగును రక్షించుకోవాలి. అందుకోసం కొన్ని డిమాండ్లనైనా సాధించుకోవాలి. ఇంటర్‌వరకు ఒక్క సబ్జక్టునయినా తెలుగు చదవాలి. అధికార భాషగా తెలుగు అమలును తప్పనిసరి చేయాలి. తెలుగు పండిట్ల పోస్టులను రెట్టింపు చేయాలి. తెలుగు చదివిన వాళ్ళకూ ఇతర్లలా సీనియారిటీ ప్రకారం హెడ్‌మాస్టర్లుగా ప్రమోషన్లివ్వాలి. వీలైతే పాఠశాల స్థాయివరకు మాతృభాషలోనే విద్యాబోధన చేయాలి"

అతని ఉపన్యాసాన్ని మంత్రముగ్ధులై

వింటున్నారంతా.

"ఈ డిమాండ్లను తీసుకొని మనం కలెక్టర్ దగ్గరికెళ్దాం. ప్రభుత్వం కదిలివచ్చేట్టు ఆందోళన చేద్దాం. అయితే ఇది ఒక్క మన జిల్లావరకే పరిమితమైతే సరిపోదు. ఈ ఆందోళనను రాష్ట్రవ్యాపితం చేయాలి. దూబగుంటలో మొదలైన సారా పోరాటం రాష్ట్రాన్నంతటినీ కదిలించినట్టు కరీంనగర్‌లో ప్రారంభమైన భాషా పోరాటం తెలుగు నేలంతా విస్తరించాలి" అని ముగించాడు రవీందర్.

రామరాజు లేచి వచ్చి అందరికీ నమస్కారాలంటూ ప్రారంభించాడు.

"మనమిలా తెలుగు నేలపై తెలుగు భాషకివ్వాల్సిన ప్రాముఖ్యత గూర్చి సభలు పెట్టుకొని తలలు బద్దలు కొట్టుకోవడం నిజంగా శోచనీయమైన విషయమే. మన మాతృభాషకు అంటే మన తల్లిభాషకు గుర్తింపు కావాలని కోరుకోవడం హాస్యాస్పదంగా ఉంది. కాని మనకిది తప్పడం లేదు. ఇది మన దౌర్భాగ్యం.

కొందరికిది ప్రాంతీయతగా, భాషా దురభిమానంగా అనిపించవచ్చు కాని స్వభాషాభిమానం పరభాషా ద్వేషం కానేకాదు. స్వభాషాభిమానం లేనివాడు తన నేలను ప్రేమించలేడు. తన దేశాన్నీ ప్రేమించలేడు. మాతృభాషా మాధ్యమాల ద్వారానే జపాన్, కొరియాలాంటి దేశాలు శాస్త్ర సాంకేతిక రంగాల్లోనూ గణనీయమైన అభివృద్ధిని సాధించాయన్న విషయాలను మరిచిపోకూడదు. మన భాషా సంస్కృతులను మనం కాపాడుకోవాలి. మనం మన భాషను కాపాడుకుంటే అది మనలను కాపాడుతుంది.

మనం ఎటు పయనిస్తున్నాం? మన సంస్కృతేమవుతుంది? నాగరికతా ముసుగు, పశ్చిమదేశాల సంస్కృతి ప్రభావం మనల్ని ఎక్కడికి లాక్కెళ్తుంది? మనం మనం కాకుండా ఎందుకవుతున్నాం? మనం భాషాపరంగా, సాంస్కృతికంగా బానిసత్వంలో కెందుకు కూరుకుపోతున్నాం? మన గృహాల్లో ఇప్పుడు మమ్మీ డాడీల సంస్కృతి రాజ్యమేలడం లేదా? తెలుగు అమ్మను చంపేస్తున్నాం మనం. ఆ అమ్మిప్పుడు మమ్మీ అయింది. తెలుగింటి అత్తమ్మ చనిపోయి ఆంటీ అయింది. ఆప్యాయమైన మామయ్య, బాబాయి పిలుపులు అంకుల్స్‌గా మారిపోతున్నాయి. కొంచెం ఉన్నవాళ్ల కుటుంబాల్లోంచి తెలుగు భాషను తరిమేస్తున్నారు. సంస్కృతిని తరిమేస్తున్నారు. మనకేం మిగుల్తున్నాయి మరి? హల్లో హల్లోలు... హాయ్, హాయ్‌లు.

కొంచెం చదువుకొని ఉద్యోగం చేస్తున్న వాళ్ళు తమ పిల్లలను

చచ్చినా తెలుగు చదవనివ్వడంలేదు. మీడియంతోపాటు తెలుగు ఒక్క సబ్జెక్టు కూడా లేకుండా జాగ్రత్తపడుతున్నారు. ఉన్నతోద్యోగాల్లో ఉన్నవాళ్లంతా తమ పిల్లల దగ్గరకు తెలుగును రానివ్వడంలేదు.

మరి తెలుగునెవరు చదువుతున్నారు? తెలుగు మీడియంలో చదివేదెవరు? పూర్తిగా ఆర్థిక వనరులు లేని పేదవారే. ఇంగ్లీషు మీడియంలో చదువలేనివారే. ఇంగ్లీషుమీడియం పాఠశాలలు లేని పల్లెటూరి ప్రజలే. కొంతమంది మురికివాడల ప్రజలు. వీళ్లే తెలుగును కొంతైనా బతికిస్తున్నారు.

టాంక్‌బండ్‌మీద, నాలుగురోడ్ల కూడలులవద్ద తెలుగు ప్రముఖుల విగ్రహాలను ప్రతిష్ఠించినంత మాత్రాన సరిపోదు. ఆ ప్రముఖులాశించిన తెలుగుదనాన్ని రక్షించుకోవాలి. దానికి మార్గం తెలుగు భాషను రక్షించుకోవడమే. అప్పుడే సంస్కృతీ రక్షణ జరుగుతుంది. మన భాష మృత భాషకాకుండా రక్షించుకుందాం. మన ఉద్యమాన్ని రాష్ట్ర వ్యాప్తం చేద్దాం"

అరగంటకు పైగా అనర్గళంగా, ఉపన్య

సించి ముగించాడు రామరాజు.

ఆ ఉపన్యాసం వింటున్నంతసేపూ సాంబయ్య హృదయం కళాఫెళా కాగుతూనే ఉంది. రామేశం ఉపన్యాసం వింటే కలిగిన ఆవేదనే ఇప్పుడూ కల్గుతోంది. కడుపులోంచి పెల్లుబికి వస్తున్న దుఃఖాన్నాపుకోవడానికి సాంబయ్య చాలా ప్రయత్నించాల్సి వస్తోంది.

ఊరెళ్ళడానికి బస్టాండుకొచ్చాడు సాంబయ్య. బస్సెక్కి కూర్చున్నాడు.

"తాను తన పిల్లల కన్యాయం చేస్తున్నాడా?" తననుతానే ప్రశ్నించుకుంటున్నాడు సాంబయ్య. బస్సు దిగేవరకూ ఆ ప్రశ్న అతనినోట్లో నానుతూనే ఉంది. అయితే ఎన్నిసార్లు ప్రశ్నించుకున్నా అతనికి సమాధానం దొరకడంలేదు.

★ ★ ★

"నాన్నా... నేననుకున్నది నా విషయంలో మీరనుకున్నది సాధించాను. నేను డాక్టర్‌నవుతున్నాను. ఇక అన్నయ్యేం చేస్తాడో చూడాలి. పిజి చేసి ఎమ్ఎస్ కోచింగ్ కెళ్తానంటున్నాడు అన్నయ్య. ఐఏఎస్ రాకుంటే అన్నయ్య ఏ క్లర్కో అవుతాడు. నేనైతే డాక్టర్నవుతున్నాను. అన్నయ్య క్లర్కయితే నా కార్లోనే తిరగాలి"

మెడిసిన్‌లో జాయినయి వచ్చింతర్వాత అంది కవిత...

"సరేలేమ్మా, నువ్వు అనుకున్నది సాధించావు నిజమే. మరి అన్నయ్య ఉన్నత స్థితిలోకెళ్ళాలనుందా? నీకంటే తక్కువస్థాయిలో బతుకాలనుందా?" అంది సరస్వతి.

"నాకెందుకలా ఉంటుందమ్మా, అన్నయ్య మరింత పట్టుదలగా అనుకున్నది సాధించాలని ఛాలెంజ్ చేస్తున్నాను..."

"నేనూ అవుతాన్లే ఐ.ఏ.ఎస్. నువ్వు నీ బోడి డాక్టర్ కోర్సు పూర్తిచేసి డాక్టరయి వచ్చేసరికి నేను కనీసం గ్రూపు వన్ సర్వీసులో నయినా జాయినవుతా..." ఖచ్చితంగా చెప్పాడు ఆనంద్.

"తన పిల్లలు ఉన్నత స్థితిలోకి వెళ్ళడం గొప్పవిషయమే. కాని తన జీవిత లక్ష్యమింతేనా? కొడుకు కలెక్టర్, బిడ్డ డాక్టరయితే ఇక తనకేం అక్కర్లేదా? తనకు కావాల్సిందంతేనా? పిల్లలు డబ్బు బాగా సంపాదిస్తూ తమకుతాము సుఖంగా బతికితే చాలా? ఏ చదువులనైతే పనికిరాని చదువులని చెబుతున్నారో, ఆ చదువులనే రియల్ ఎస్టేట్స్‌గా మార్చుకుంటున్నారు కొంతమంది. అందులో తానూ ఒకడా? తనకు పోనీ తన పిల్లలకు కూడా జీవితలక్ష్యమేం అక్కర్లేదా?

తననుతానే ప్రశ్నించుకుంటూ ఇంటిదిక్కు నడుస్తున్నాడు సాంబయ్య.

"పిల్లలను ఆ మాత్రంగానైనా చదివించడానికి ఎన్ని సుఖాలను త్యాగం చేయాల్సివచ్చింది? మిత్రులవల్ల, చుట్టాలవల్ల తన పిల్లల చదువులకు భంగం లేకుండా చూశాడు. పిల్లలు టీ.వీ లెక్కువగా చూడకుండా కట్టడి చేశాడు. ఇష్టమున్నట్టాడుకోకుండా కట్టడి చేశాడు. ఈ విషయంలో తాను, సరస్వతి కలిసి తపస్సులాంటిదే చేశారు. అయితే తమ ఈ నిర్బంధంవల్ల తమ పిల్లల బాల్యం ఛిద్రమైందా? అయినా తామింతకంటేం చేయలేరు. ఏదేమైనా తన కొడుకు ఐ.ఏ.ఎస్ అయితే తనకంతకంటే కావాల్సిందేముంది?

ఆలోచిస్తూనే ఇల్లు చేరుకున్నాడు సాంబయ్య.

అతనికి చదువుల్లో ఎక్కడో ఏదో లోపమున్నట్టగుపడుతోంది. ఆ లోపమేంటో ఇదమిద్ధంగా చెప్పలేకపోతున్నాడు.

"తన కొడుకు కలెక్టరయి, కూతురు డాక్టరయితే తానే ఆలోచనలేకుండా ప్రశాంతంగా ఉండగలడా? అప్పుడు తనకేసమ

స్యలు లేనట్టేనా? "

ఎంత ప్రశ్నించుకున్నా సమాధానాలు
దొరకడంలేదు సాంబయ్యకు.

ఆనందిప్పుడు ఢిల్లీలో ఉంటున్నాడు.
పట్టుదలగా ఐ.ఏ.ఎస్ కోచింగ్ తీసుకుంటు
న్నాడు. కొడుకును ఐ.ఏ.ఎస్ చేయడాని
కెంత ఖర్చు చేయడానికైనా సిద్ధంగా
ఉన్నాడు సాంబయ్య. కవిత మెడిసిన్ పూర్తి
కావడానికింకో మూడేండ్లుంది.

సరస్వతికిప్పుడెంతో తృప్తిగా ఉంది. భర్త
ఇంకా బాగా సంపాదించలేదన్న అసంతృప్తి
ఓ దిక్కున్నా పిల్లల చదువు విషయంలో
మాత్రం సంతృప్తికరంగానే ఉంది. తాను
తన కూతుర్ని డాక్టర్‌గా, కొడుకును ఉన్న
తాధికారిగా చూడబోతున్నందుకామెకెంతో
ఆనందంగా ఉంది. తానో డాక్టర్, కలెక్టర్
తల్లిగా కలలు కంటోంది. తన సగం కల
నిజమైనట్టే, ఇంకా సగం పూర్తి కావడానికిం
కెన్నాళ్ళు వేచి చూడటానికైనా సిద్ధంగానే
ఉందామె.

తన పిల్లల చదువు, తన కుటుంబం అభి
వృద్ధి విషయంలో సంతృప్తికరంగానే ఉన్నా
సాంబయ్యకెందుకో అసంతృప్తికరంగానే
ఉంది. ఓ దిక్కు జీవన్మరణ పోరాటాలు
జరుగుతుంటే తనలాంటి వాళ్ళు పిల్లలు,
కుటుంబం అంటూ పరిమితమై ఉండడ
మెంత వరకు సమంజసమో అతని కర్థంకా
వడంలేదు. తనకే తెలియని అసంతృప్తేదో
అతన్ని వెంటాడుతూనే ఉంది.

శ్రీనివాస్ బేంకు పరీక్ష రాసి ఉద్యోగంలో
చేరి దాదాపు రెండేండ్లయింది. ఇప్పుడతడు
విశాఖపట్నంలో ఉంటున్నాడు. సామాన్య
వ్యవసాయ కుటుంబంలోంచి వచ్చిన శ్రీని
వాస్‌కిప్పుడు జీవితం రంగులకలగానే కనిపి
స్తోంది. అతనికి తన పాత జీవితాన్ని
నెమరు వేసుకోటానికి కూడా మనసొప్పడం
లేదు. చేసుకోవాల్సిన అవసరమూ కనబడ
టంలేదు. ఇంటికి దగ్గరగా ఉండి తల్లిదం
డ్రులతో, ఊరితో దగ్గరి సంబంధాలుంటే
ఎంత వద్దనుకున్నా పాత విషయాలు జ్ఞాప
కంచేసుకోక తప్పేవికావేమో! కాని అతడు
ద్యోగం దొరికినప్పట్నుంచీ పాత జీవితపు
వాసనలు కూడా సోకనంత దూరంలో
ఉంటున్నాడు.

దానికితోడు ఉద్యోగంలో చేరిన ఒకటి
రెండు నెలల్లోనే శ్రీనివాస్‌కో అమ్మాయితో
పరిచయమయింది. అదే బ్యాంకులో పనిచే
స్తున్న ఆ అమ్మాయి మెరుపుతీగలా
ఉంటుంది. విశాఖపట్నమే ఆమె జన్మస్థలం.
ఆమె పేరు మానస. మానసతో పరిచయం
స్నేహంగా స్నేహం మరింత ముందుకు
పోయి వాళ్ళిద్దరు పెండ్లి చేసుకుందామని
మాట్లాడుకునేంతవరకు వచ్చింది. అయితే
వాళ్ళ పెళ్ళికామె కొన్ని షరతులు పెట్టింది.

"మీ గత చరిత్రతో నాకుసంబంధం
లేదు. మీ పాత జీవితమేంటో మీరెలా బతి
కేవారో కూడా నాకనవసరం. మీ ఇంటి
ఆర్థిక స్థితిగతులతోనూ నాకవసరంలేదు.
మీ తల్లిదండ్రులతోనూ నాకక్కర్లేదు.
వాళ్ళకు మీనుంచి ఏదైనా ఆర్థిక సహాయమ
వసరముంటే నెలకు కొంత డబ్బు పంపితే
నేనేం కాదనను. మీకు వాళ్ళను చూడ
బుద్ధయితే చూసి రావచ్చు వాళ్ళకు
మిమ్మల్ని చూడాలనిపించినా ఎప్పుడోసారి
వస్తే అభ్యంతరంలేదు. కాని నన్నా మారు
మూల పల్లెకు రమ్మని, అత్తామామల
సేవతో తరించమని చెబితే మాత్రం మన
పెళ్ళి జరగదు. నాకక్కడికి ఎప్పుడన్నా
రావాలనిపిస్తే వస్తాను. లేకుంటే లేదు.
నన్ను మాత్రం బలవంతం చేయొద్దు. నేను
మిమ్మల్ని భర్తగా స్వీకరించాలనుకుంటు
న్నాను కాని మీ వాళ్ళను నావాళ్ళుగా స్వీక
రించదలుచుకోలేదు. వాళ్ళతో నాకేసంబం
ధమూ లేదు. పెళ్ళయిం తర్వాత ఈ విష
యంలో ఏ గొడవలూ రావద్దు. ఉన్న
విషయం నేను ముందే చెప్పాను. నేను
చెప్పిందే చేస్తాను"

తన అభిప్రాయాలను ఖచ్చితంగా చెప్పే సింది మానస.

నేను చెప్పినవన్నీ ఇష్టమయితే మనం పెళ్ళి చేసుకుందాం అంది.

కొన్నేళ్ళ క్రితం అయితే ఎలా ఉండేదో కాని ఇప్పుడు మానస చెప్పిన విషయాల్లో పెద్దగా అభ్యంతరకరమైనవేవీ కనబడటం లేదు శ్రీనివాస్‌కు.

కొద్దిరోజులు మానస చెప్పిన మాటల గూర్చి బాగా ఆలోచించాడు శ్రీనివాస్. 'తనను కుటుంబానికి దూరం కావాలం టుంది మానస'

తనలో తాననుకున్నాడు.

అందగత్తె, ఆర్థికంగా మంచి స్థితిలో ఉన్న కుటుంబంలోంచి వచ్చింది. ఉద్యోగం చేస్తోంది. అలాంటి మానసను కాదనుకో వడం మూర్ఖత్వమే అవుతుంది.

ఆమెతో కలిసి జీవితం పంచుకోవడం సినిమాల్లో చూపే స్వర్గంలాంటిదే.

మానసలాంటి వాళ్ళింట్లో అడుగుపెట్టే స్తోమత కూడా లేదు తన కుటుంబానికి. అలాంటమ్మాయిని కాదనుకోవడం తన తెలివితక్కువతనమే అవుతుంది.

ఉద్యోగమైన తర్వాత ఎలాగూ తల్లిదం డ్రులకు, ఊరుకు దూరముండాల్సిందే. ఈకాలంలో ఏ కోడళ్లు మాత్రం అత్తామామ లకు సేవలు చేస్తున్నారు? అలాంటప్పుడు మానస తనింటికి రాకున్నా పోయేదే ముంది.? తల్లిదండ్రులకు తాను నెలకు కొంత డబ్బు పంపుతే సరిపోతుంది. అయినా పల్లెలో వాళ్ళకేమంత ఖర్చెం టుంది? తనకు ఇవ్వాల్సిన అవసరమేం లేదుగదా ఇప్పుడు. వాళ్ళ తిండికి సరిపో యేట్టు ఉన్న భూమిలో పంట వస్తుంది. అంతగా సరిపోకుంటే తానెంతో కొంత డబ్బు పంపుతాడు.

మానస షరతులకొప్పుకున్నాడు శ్రీని వాస్.

"మీ వాళ్ళకు తెలిస్తే ఎన్నో రకాల అభ్యంతరాలు చెప్పవచ్చు ఇంత దూరపు సంబంధమని ఒప్పుకోక పోవచ్చు తర్వాతె లాగూ తెలుస్తుంది. ఇప్పుడు వాళ్లకేం చెప్పకు..." అంది మానస.

ఆ మాటలూ నిజమేననిపించాయి శ్రీని వాస్‌కు.

శ్రీనివాస్, మానసల పెళ్ళి విశాఖప ట్నంలో జరిగింది.

ఆ పెళ్లయినట్టు శ్రీనివాస్ తరఫువాళ్ళెవ రికీ తెలియదు.

పెళ్ళయిన మూణ్నెళ్ల తర్వాత ఒంటరి గానే ఊరెళ్ళాడు శ్రీనివాస్. విషయం తెలు సుకున్న అయిలయ్య, శాంతమ్మ లబోదిబో మని మొత్తుకున్నారు.

కొడుకును దగ్గరకు తీసుకుని ఏడ్చారు.

సాంబయ్యను పిలిపించారు.

"నాన్నా! ఉద్యోగమన్న తర్వాత ఎక్కడో ఉండక తప్పదు కదా! మనూరి చుట్టువా ళ్ళనే పెండ్లి చేసుకొనుండాలంటే ఎలా కుదు రుతుంది? మానసలాంటి కుటుంబం వాళ్ళతో సబంధం మనం కలలో కూడా ఊహించలేం. ఇప్పుడేమైందని మీరేడ్వడం? మీకేం తక్కువైందని? మీకవసరమైతే నెలకు కొంత డబ్బు పంపుతాను కదా? ఇంకేం కావాలి? మీకు నా సుఖం, మంచి భవిష్యత్తు కావాలా? మీచుట్టూ ఉండడమే కావాలా? "

ఉద్యోగం? ఎదుగుదలనే ఆలోచన, మానస మత్తులో ఉన్న శ్రీనివాస్‌కు ఇప్పుడేం చెప్పినా లాభం లేదనుకున్నాడు సాంబయ్య.

అయిలయ్యకేవో సర్దిచెప్పాడు.

వెంట రమ్మని ఒక్క మాటా అన్లేదు శ్రీని వాస్. మానసను తీసుకొస్తాననీ అన్లేదు. తండ్రి చేతిలో ఐదువందల రూపాయలు పెట్టి వెళ్లిపోయాడు.

నాలుగు నెలల తర్వాత మరోసారొ చ్చాడు.

పెళ్ళయిన ఏడాది తర్వాత కోడలును తీసుకొని వస్తున్నానని తండ్రికి లేఖ రాసాడు. ఏ ట్రెయిన్‌కు వస్తున్నాడో, ఖాజీపేటలో ట్రెయిన్ దిగి కరీంనగర్ ఎప్పుడొస్తాడో ఆ లేఖలో వివరంగానే రాశాడు.

కరీంనగర్ బస్టాండులో బెంచీమీద కూర్చొనున్నాడు సాంబయ్య. అతని కళ్ళ ముందు గత రెండేళ్ళుగా జరుగుతున్న పరిణామాలన్నీ కదులుతున్నాయి.

అతని హృదయం బరువెక్కింది.

అతని ప్రక్కనే కూర్చొనున్నాడు అయిలయ్య.

అయిలయ్యకిప్పుడు యాభై ఏళ్ళు దాటాయి. నీడ పట్టునుంటున్నవాళ్ళకు, ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళకా వయసు పెద్ద వయసేం కాదు. కాని చిన్నప్పట్నుంచీ మట్టిలో మట్టయి బతుకుతున్న భూమిపుత్రులకు వృద్ధాప్యమన్నట్టే. అయిలయ్య శరీరం నిరంతర శారీరక శ్రమవల్ల సాగబారుంది. ఎండనక వాననక పనిచేస్తుండటం వల్ల మొదలే నలుపైన శరీరం మరింత నల్లబడుంది. అతని తల నెరిసింది. ముఖంలో ముడతలు కనబడుతున్నాయి.

బావ, బావమరుదులిద్దరూ ఒకర్నొకరు చూసుకుంటున్నారు. వరంగల్ నుంచి వచ్చే బస్సుకోసమెదురు చూస్తున్నారు.

కరీంనగర్ బస్సు ప్రాంగణమంతా యమ రద్దీగా ఉంది. ప్రయాణీకుల ప్రాంగణమిప్పుడు ఇరుకుగా లేదు. పాత దానికి సమీపంలో ఉన్న విశాలమైన స్థలంలో చాలా ఏండ్ల క్రితమే కట్టబడిందా బస్సు ప్రాంగణం. వేలాది మంది ప్రయాణీకులుండటానికి అనుకూలంగా ఎంతో విశాలంగా కట్టబడుందా బస్టాండు. జిల్లా కేంద్రానికిప్పటికీ రైలు సౌకర్యం లేనందువల్ల ప్రయాణీకులందరికీ బస్సే శరణ్యం. జిల్లాకు చెందిన వ్యక్తే అయిదేళ్ళు ప్రధానిగా దేశాన్నేలినా కరీంనగర్‌కు రైలు సౌకర్యం గగనకుసుమమే అయింది.

ఎంత విశాలంగా ఉన్నా ఆ ప్రాంగణమెప్పుడూ రద్దీగానే ఉంటుంది. సాంబయ్య ఏవేవో జ్ఞాపకం చేసుకుంటున్నాడు.

"ఏంటి బావా? బాగాలోచిస్తున్నట్టున్నావు!" అడిగాడు అయిలయ్య.

"ఏంలేదు బావా! ఏవేవో పాత జ్ఞాపకాలు" కొద్దిసేపెవరూ మాట్లాడలేదు.

బస్సులొస్తున్నాయి, పోతున్నాయి. బస్టాండు నిండా జనమే. బిస్కట్లు, పిప్పరమెంట్లు, అల్లమురబ్బా అమ్ముకునే వాళ్ళు తిరిగమ్ముతూ ఉన్నారు.

"అయిలయ్యా! ఇది నీ పిచ్చిగాకుంటేంది చెప్పు? విశాఖ పట్నంనుంచి నీ కొడుకు వస్తున్నట్టు ఉత్తరం రాసాడు నిజమే. పెళ్ళయిన ఏడాది తర్వాత నీ కోడల్ను నువ్వు మొదటిసారిగా చూడబోతున్నావన్న మాట నిజమే. విశాఖపట్నం నుంచి ట్రెయిన్‌లో ఖాజీపేట వరకొస్తాడు. అక్కణ్నుంచి బస్సులో ఇక్కడివరకొస్తాడు. ఇక్కడికొచ్చిన వాడు ఊరికి రాడా చెప్పు! ఈ బస్టాండులో ఎదురు చూడటమెందుకు? శ్రీనివాసేమన్న కరీంనగర్‌కు కొత్తవాడా? ఊరికి కొత్తవాడా? వాడే వచ్చేవాడు కదా. వద్దనంగా నన్నూ లాక్కొని వస్తివి. వాన్తోని మాట్లాడుదాం నిజమే. ఆ మాట్లాడేది ఊరి కెళ్ళింతర్వాతే కదా! ఊరికొచ్చేవర కాగక ఇక్కడికెందుకు లాక్కొస్తివి?" అన్నాడు సాంబయ్య.

"ఇక్కడిదాక వచ్చినవాడు ఆగడన్నది నిజమే కాని నీకు తెలియదు బావా నా కడుపుకోత! ఇంతకాలం తర్వాత అంతదూరంనుంచి కోడలుతో మొదటిసారి వస్తున్న నా కొడుకును ఇక్కడివరకైనా వచ్చి తోలుక పోకుంటేం బాగుంటుంది? కోడలేమనుకుంటుంది?" అన్నాడు అయిలయ్య.

"అవును... ఆ మాటా నిజమే"

వరంగల్‌నుంచి వస్తున్న ప్రతి బస్సునూ చూస్తున్నారిద్దరూ. ఎన్ని బస్సులొస్తున్నా శ్రీనివాస్ మాత్రం దిగడం లేదు బస్సు

లోంచి. శ్రీనివాస్ కరీంనగర్‌కు చేరుకుంటానన్న సమయం దాటి రెండు గంటలయింది. సమయం గడుస్తున్నకొద్దీ అయిలయ్యలో ఆరాటం, ఆందోళన పెరుగుతోంది. కొడుక్కోసం చకోరపక్షిలా ఎదురు చూస్తున్నాడు.

"బావా! శీను వస్తాడంటావా? మేమంటే ఎంతో ప్రాణంగా ఉండేది శీనుకు. ఇప్పుడెందుకిలా మారిపోయాడు? నా కొడుకు నాకు గాకుండా అయిపోతున్నాడా? "

అయిలయ్య మాటలకు చలించిపోయాడు సాంబయ్య. పరిస్థితి తనకెప్పుడో అర్థమైపోయినా అయిలయ్యకామాటలు చెప్పి మరింత బాధపెట్టదలుచుకోలేదు సాంబయ్య. శ్రీనివాస్ అయిలయ్యనాదుకుంటాడన్న నమ్మకం లేదు సాంబయ్యకు. అయినా కొంచెం ఓదార్పుగా అన్నాడు.

"ఇప్పుడు కొత్త మోజులో ఉన్నాడు. తర్వాత వాడు ఇటు దిక్కు బదిలీ చేయించుకుంటాడు. ఇప్పుడు అక్కకు, నీకైతే కాళ్ళు జేతులాడుతున్నాయిగదా! చేతగాకుంటయితే అప్పుడు చూద్దాం"

చదువులయిపోయి ఉద్యోగాలయింతర్వాత రెక్కలొచ్చిన పక్షులల్లా ఎగిరిపోతూ ఊరుకు, తల్లిదండ్రులకు దూరమవుతున్న ఎంతోమందిని చూస్తూనే ఉన్నాడు అయిలయ్య. కొడుకు తనకు తెలియకుండా పెళ్ళి చేసుకున్నప్పుడే అతనిమీద నమ్మకం పోయింది అయిలయ్యకు. తన అదృష్టమెలా ఉంటే అలా అవుతుందని సరిపెట్టుకోవాలనుకుంటున్నాడు. కాని ఎంత తనకు తాను సంతృప్తిపరుచుకోవడానికి ప్రయత్నిస్తున్నా సాధ్యం కావడంలేదు. శాంతమ్మను చూస్తుంటే అతని కడుపు మరింత తరుక్కుపోతుంటుంది. కడుపులో పెట్టుకొని పెంచి ఎన్నో ఆశలు పెట్టుకొని చదివించిన కన్న కొడుకే కళ్ళముందు కనబడుతున్నాడు.

ఏం మాట్లాడటానికీ అతనికి నోరు పెగిలి రావడంలేదు. వరంగల్‌నుంచి బస్సొచ్చి ఆగితే ఇద్దరూ లేచి చూశారు.

వాళ్ళకు నిరాశే మిగిలింది.

మరో గంట గడిచింది. అయిలయ్య ఊరుకెళ్ళే రెండు బస్సులూ వెళ్ళిపోయాయి. ఇంకో అరగంటయితే ఆ ఊరుకెళ్ళే చివరి బస్సు కూడా వెళ్ళిపోతుంది.

"బావా! ఈనగాచిన చేనును నక్కల పాలు చేసాడంటారు చూడు. అలా అయింది నా పరిస్థితి. నా కొడుకు నాకు గాకుండా పోయినట్టే. నా శీను నాకు అందకుండా పోయినట్టే. నాకేమొ మునుపటి తీరుగ చాతనయిత లేదు. మీ అక్క రోగాలకుప్పేనాయె. నేనంటె మొగబాయిగాన్ని. ఎట్లనో సరిపెట్టుకుంట. మీ అక్క కడుపుకోత నెవ్వలు బాపాలె బావ? మావిద్దరికీ ముసలితనమొస్తుంది. నాకింకో కొడుకన్న లేకపాయె. బిడ్డలకేమిచ్చిన్నని మా భారం వాళ్ళమీద బెట్టాలి? ఏ విధంగా చూసినా నా కొడుకు నాకిగ అందని ముల్లెలాంటోడేననిపిస్తోంది. ఈరోజు వస్తాడన్న నమ్మకం లేదు. వచ్చినా ఒక్కటి రెండు రోజులుండి వెళ్ళిపోయెటొడే కద! మాంటె ఐదువందలో, వెయ్యో చేతిలపెడుతాడేమో? "

అయిలయ్య ఆ మాటలంటుంటే ఇద్దరి కళ్ళలోనూ నీళ్ళు తిరిగాయి.

ఆ మాటల్లో నగ్న సత్యాలున్నాయని సాంబయ్యకు తెలుసు. అయిలయ్య శరీరం ఇదువరకట్లా సహకరించడానికి సిద్ధంగా లేదన్న విషయమూ గమనిస్తున్నాడు సాంబయ్య.

అండగా ఉండాల్సిన సమయంలో అందకుండా పోతున్నాడు శీను. ఏం జరుగుతోందసలు? లోపమెక్కడుంది? ఇదిలాగే జరుగుతుందా?

రేపు తనకు కూడా ఇలాంటి పరిస్థితే వస్తుందా? వస్తే తాము తట్టుకోగలరా?

బావమరిదికేం జవాబు చెప్పడానికి మనసొప్పలేదు సాంబయ్యకు. కొద్దిక్షణాలు తన

లోతాను తర్జనభర్జన పడ్డాడు.

"బావా! చీమలు పెట్టిన పుట్టలంటారే, అలా ఉందిప్పుడు కొందరి పరిస్థితి. అయినా కాలంతోపాటు మనమూ నడ వాలి"

వాళ్ళిద్దరూ బెంచీమీద ఒకరి పక్కనొకరు కూర్చునే ఉన్నారు. అయిలయ్య ఊరెళ్ళే చివరి బస్సొచ్చాగింది.

"పెద్దాపూర్. జూలపల్లి. ఎక్కండెక్కండి" అని కండక్టర్ బస్సు దిగి కంట్రోలర్ దగ్గరి కెళ్ళాడు.

ఆ ఊరివాళ్ళు చాలామంది ఒకర్నొకరు తోసుకుంటూ బస్సెక్కుతున్నారు.

"బావా! ఈ బస్సుపోతే మనకు ఉదయం ఐదు గంటలవరకు బస్సు లేదు. ఈ బస్సులో వెళ్ళిపోదాం మనం. ఒకవేళ శీనొస్తే రాత్రి లాడ్జిలోనో, వాని స్నేహితుని దగ్గరో ఉండి ఉదయం ఊరికొస్తాడు" అన్నాడు సాంబయ్య.

"బావా! దయచేసి నన్ను బలవంతం చేయకు. ట్రెయిన్ లేటుకావచ్చు దూరం నుంచి రావడమాయె. శీనొచ్చేదాకా ఉందాం. అందరం కలిసే పోదాం. తెల్లారే వరకు రాకుంటే అప్పుడు చూద్దాం"

ఇంకేం మాట్లాడలేదు సాంబయ్య.

కొద్దిసేపట్లో జూలపల్లి బస్సెళ్ళిపోయింది.

అయిలయ్య కొడుకుకోసం బస్టాండులో నిరీక్షిస్తూనే ఉన్నాడు.

అయిలయ్యలాంటి ఎంతోమంది తండ్రులు తమ కొడుకులకోసం గలుమల దగ్గర ఎదురుచూస్తూనే ఉన్నారు.

శాంతమ్మలాంటి తల్లులూ కళ్లలో వత్తులే సుకొని చూస్తూనే ఉన్నారు. ఈ చదువులు తరాలమధ్య అంతరాలను పెంచుతూనే ఉన్నాయి. సంధి యుగంలో పరాయీకరణ మరింతెక్కువవుతోంది.

బెంచీమీద కూర్చొనున్న సాంబయ్య రెండు దశాబ్దాలు దాటిన తన ఉద్యోగ జీవితాన్ని గూర్చి మననం చేసుకుంటున్నాడు. తనలాంటివాళ్ళు, అయిలయ్యలాంటివాళ్ళు పిల్లల చదువుల కొరకు పడిన, పడుతున్న తాపత్రయాన్ని కళ్ళముందు సాక్షాత్కరింప జేసుకుంటున్నాడు.

పక్కనున్న బావమరిది దిక్కు చూశాడు సాంబయ్య.

"అయిలయ్యా! త్వరలో మనం ఇరవై ఒక టవ శతాబ్దిలోకడు గిడబోతున్నాం. ఈ విధానమిలాగే కొనసాగితే మనముండం. మన సంస్కృతుండదు. మన భాషా సాహిత్యాలుండవు. మిగిలేవి తాత్కాలిక సుఖాలు. శూన్యం. సైన్సు... ఇంకా... ఇంకా... అవైనా ఎందరి కందుబాటులో ఉంటాయి?

"బాగా ఆలోచిస్తే ఇది శ్రీనివాస్ తప్పు మాత్రమే కాదనిపిస్తోంది? అందరిలాగే చేస్తున్నారని కాదుగాని ఈ విధానంలో ఏదో లోపముంది. ఈ చదువులు పరాయీకరణకు గురిచేస్తున్నాయి. మాట్లాడే బొమ్మలను తయారుచేస్తున్నాయి. ఇవి టాకింగ్ డాల్స్‌ను తయారుచేస్తున్నాయయిలయ్యా. రేపు నేనూ నీలాగే ఎదురు చూడాల్సివస్తుందేమో!"

సాంబయ్య కంఠం పూడుకుపోయింది.

ఒకరిచేయిలో ఒకరి చేయి కలుపుకున్నారు వాళ్ళిద్దరు.

అర్ధరాత్రి దాటింది.

అయినా వాళ్ళ నిరీక్షణ కొనసాగుతూ ఉంది. శ్రీనివాస్ వస్తాడో రాడో తెలియదు. వచ్చినా అయిలయ్యను అక్కున చేర్చుకుంటాడన్న నమ్మకంలేదు.

అయినప్పటికీ ఊళ్ళో గలుమ దగ్గర కూచొని శాంతమ్మ, జిల్లా ప్రయాణప్రాంగణంలో కూచొని అయిలయ్య కొడుక్కోసం ఎదురుతెన్నులు చూస్తూనే ఉన్నారు.

★

# చతుర కతలు

## గాంధీతాత

సత్యమూర్తి హడావుడి పడుతూ రాజారావ్ ఇంటికి పరిగెత్తుకు వెళ్ళాడు. రాజారావ్ సత్యమూర్తికి కాఫీలాంటి సత్కార్యాలవీ చేసి "ఏంట్రా! ఇప్పుడు చెప్పు అసలు విషయం" అనడిగాడు.

"ఏంలేదురా! రేపు ఆగష్టు పదిహేను కదా.

మా కాలనీలో పెద్దలంతా కలిసి జెండా ఎగరేస్తున్నారు. నువ్వు కూడా వచ్చి గాంధీతాత గురించి నాలుగు ముక్కలు మాట్లాడాలి. ఊరికే కాదులే నూటపదహార్లిచ్చి సన్మానం వగైరా చేస్తాం. ఏమంటావ్..." అని చాలా గొప్పగానే చెప్పాడు సత్యమూర్తి.



"ఏమిటి? గాంధితాత గురించి నేను మాట్లాడాలా? నావల్లకాదురా. బాబ్బాబు నన్నొదిలేయ్" బతిమలాడుతున్నట్లుగా అడిగాడు రాజారావ్. ఆ మాటలకు సత్యమూర్తి ఆశ్చర్యపోతూ...

"అదేంట్రా... నువ్వు కాలేజీ రోజుల్నుండీ ఎన్నెన్నో ఉపన్యాసాలు దంచేవాడివి గదరా. పైగా గాంధీగారి గురించి ఎంతో ఎమోషనల్‌గా మాట్లాడి, చప్పట్లు కొట్టించుకోవడం నేనూ ఎన్నోసార్లు చూశాను. ఇప్పుడిలా అంటావేంటి?" అని ప్రశ్నార్థకంగా చూశాడు రాజారావ్‌వైపు.

"అదేంలేదురా. ఒక్క గాంధీతాత గురించి తప్ప ఇంకెవరి గురించైనా మాట్లాడమను. ఉన్నపళంగా స్పీచ్ దంచేస్తాను. అంతేగానీ నన్ను గాంధీతాత మీదే మాట్లాడమని మాత్రం ఇబ్బందిపెట్టకు" అని ఖచ్చితంగా చెప్పేశాడు ఈసారి రాజారావ్.

"పోనీ నేను మాట్లాడతానుగానీ, ఆ డబ్బులేవో నాకే ఇప్పించు" అంటూ వీళ్ళిద్దరి వాదోపవాదాల్ని తలుపుదగ్గర పొంచి మరీ విని లోపలికి వచ్చాడు గోవిందు. గోవిందు వీళ్ళిద్దరికీ కూడా చాలా మంచి స్నేహితుడే.

"పోరా గోవిందూ... నువ్వెవరికి తెలుసు? నీ మాటలెవరు వింటారు? వీడైతే ఊళ్ళో పెద్దపేరుంది. అందుకే కదా వీణ్ణి బతిమిలాడుతుంట" అని విసుగ్గా చెప్పాడు సత్యమూర్తి.

"పోనీ మాట్లాడవచ్చు కదరా..." తనూ సలహా ఇచ్చి చూశాడు గోవిందు. "లేదురా. వీడికివాళ ఏదో అయ్యింది" అసహనంగా అరిచాడు సత్యమూర్తి.

"నోర్మూయ్యండ్రా మీరిద్దరూనూ. ఇందాకణ్ణుంచి ఒకటే నసపెట్టి చంపుతున్నారు. గాంధీ గురించి మాట్లాడమంటే ఓకే. తెల్లారేదాకా మాట్లాడగల్ను. కానీ ఎవడో గాంధీ గారి తాత గురించి మాట్లాడమంటే నేనెలా చచ్చేది. గాంధీగారి తాతగారు ఎవరో, ఏంటో తెలిస్తేగా. అందుకే నేను మాట్లాడననేది" అని పెద్దపెట్టున అరుస్తూ చెప్పాడు రాజారావ్.

**–అద్దంకి శ్రీనివాస్**

---

## ప్రొఫెసర్ మతిమరుపు

ఆరోజు ప్రొఫెసర్‌గారి పెళ్ళిరోజు. ఎవరెవరో అతిథులు వస్తున్నారని స్పెషల్ డిషెస్ చేస్తున్నాడు బ్రహ్మానందం. వంటగదిలో ఒకటే హడావిడి పడ్తూ చకచకా పనులు చేసుకుంటున్నాడు.

హఠాత్తుగా వచ్చిపడింది ప్రొఫెసర్‌గారి భార్య. "ఇక నేను మీ అయ్యగారితో కాపురం చెయ్యలేను బ్రహ్మానందం" అంటూ శోకాలు మొదలుపెట్టింది.

కంగారు పడ్డాడు బ్రహ్మానందం. "అదేంటమ్మా, అంతమాటనేశారు" అన్నాడు ఆమె వంక విస్తుపోయి చూస్తూ.

"అవున్రా. పక్కింటి పంకజాక్షి ఎంత మాటనేసిందో చూశావా. ఈయనమూలంగా అంతమాటన్పించుకుని కూడా ఇంకా ఆయనతో ఎలారా కాపురం చేసేది"

"ఏమందమ్మా పక్కింటి పంకజాక్షి?"

"ఏమంటే ఏంలేరా. ఇంక నేనాయనతో కాపురం చేయలేన్రా"

శోకాలు తీస్తూనే మధ్యలో ముక్కు చీదేస్తోంది.

"అంతమాటనకండమ్మా. అయ్యగారు ఎంతమంచివారమ్మా. మీరు తెగ తిడ్తారు కానీ అయ్యగారెప్పుడైనా నన్ను కోప్పడ్డారా అమ్మా!"

"అవున్రా, అందుకేగా ఆయన్ని నెత్తిమీద పెట్టుకొంటున్నావు. అయినా ఈ మతిమరుపు మొగుడితో వేగలేనురా. నీకు తెల్సుకదరా. మొన్నటికి మొన్న మిరియాలు తెండీ అంటే కిలో నలభై ఉన్న మిరపకాయలు అరవై చేసి తెచ్చిపడేశారు. నిన్నటికి నిన్న అడ్డాకులు ఓ అరడజను పట్టుకురండీ అంటే అరడజనూ... ఆనపకాయలు పట్టుకొచ్చి పడేశారు కదరా!"

"అవుననుకోండీ. అది జరిగినప్పుడు మీరెంతగానో తిట్టారుగానీ ఇంతమాటన్లేదు కదమ్మా. మరిప్పుడేవిటో ఇలా! ఇంతకీ పంకజాక్షిగారు ఏమన్నారమ్మా"

"ఏమనడం ఏమిట్రా? నా మొగుణ్ణి నేను అదుపులో పెట్టుకోవాలట. లేకపోతే అనర్థాలు జరిగిపోతాయట"

"అంత అనర్థాలు జరిగిపోయే పనేం చేశారమ్మా అయ్యగారు" అనుమానంగా అడిగాడు బ్రహ్మానందం.

"అయ్యో. నా నోటితో నన్నే ఎలా చెప్పమంటావురా? "

"మీరు చెప్పకపోతే ఎలాగమ్మా నేవెళ్ళి పంకజాక్షినడిగితే జరిగే అనర్థమేదో నాతోనే మొదలవుతుందేమో కదమ్మా. అందుకని మీరే చెప్పండమ్మా"

"అదేరా. ఈరోజు మాపెళ్ళిరోజుకదా..."

"అందుకే కదా గెస్టుల్ని కూడా ఆహ్వానించారూ, నేను మరీ జాగ్రత్తగా స్పెషల్స్ చేస్తున్నాను కూడానూ"

"అయ్యగారు కొత్త సూట్ తెచ్చుకుంటానని టైలర్ దగ్గరకి వెళ్ళార్రా..."

మధ్యలో అన్నాడు బ్రహ్మానందం. "మరేనండి. బాగా కుట్టాడామ్మా. వేసుకున్నారా

లేదా యింకా? "

"వేసుకోవడమేమిటి నా తలకాయ. వేసుకుని మరీ వచ్చారింటికి. అదే కదరా పంకజాక్షి అంతమాటనడానికి కారణం"

"ఇంతకీ ఆ పంకజాక్షి ఎందుకందో చెప్పరేంటి? " కాస్త విసుగ్గా అన్నాడు బ్రహ్మానందం.

"అదే మరి చెప్పేది పూర్తిగా వినవేం. "సూటు బాగానే వుంది. అండర్‌వేర్ ఎంత బాగున్నా దానిమీద పాంటు కూడా వేసుకుంటే ఇంకా బాగుంటుంది. అంతేకాదు పక్కింటి తలుపుకొడితే మీ ఆవిడ వస్తుంది. అవిణ్ణడిగితే ఈమాట బాగా చెబుతుంది"



"అదేరా... అయ్యగారు టైలర్‌షాపునుంచి తిన్నగా వచ్చి తలుపు కొట్టారు. తలుపు తెరుచుకోగానే "ఏమే... ఏమే... కొత్త సూటు బాగుందా." అనడిగారు ప్రొఫెసర్ గారు.

"అంతేకదా... ఇందులో పెద్ద కొంప మునిగేదేముంది అంతమాటనడానికి. అయినా మిమ్మల్నడిగితే ఆవిడకెందుకట అంత కోపం..." తేలిగ్గా నవ్వుతూ అన్నాడు

అని ముఖంపగిలేలా తలుపు వేసుకుందిరా పక్కింటి పంకజాక్షి.

"అంతే కదమ్మా మరి చెయ్యాల్సింది. ఆ టైలర్ దగ్గరికి నేవెళ్ళి ఆ ఫాంటు పట్టుకొస్తాను గానీ మీరింక ఊరుకోండమ్మా!" అంటూ బయటకి పరిగెత్తాడు బ్రహ్మానందం.

**–సూరిపండు**

---

# పబ్లిసిటీ స్టంట్

సిటీలో రద్దీగా కిటకిటలాడే నాలుగు రోడ్ల కూడలి అది. వచ్చీపోయే వాహనాలతో, జనసందోహంతో హడావుడిగా ఉంది ఆ ప్రాంతమంతా...

అలాంటి ప్రదేశంలో ఓ ముసలి బిచ్చగాడు రోడ్డుని క్రాస్ చేయడానికని తాపత్రయ పడ్తున్నాడు.

అతని వయసు దాదాపు అరవై ఏళ్ళుండవచ్చును. వడలి జారిపోయిన చర్మం. కృంగి, కృశించి, శుష్కించిన దేహం. అతని ఒడలంతా తెల్లతెల్లని, కుష్టువ్యాధి మచ్చలతో అందవికారంగా ఉంది. ఆ మచ్చలు అతని ముఖాన్ని కూడా విడిచి పెట్టకుండా ఆవరించుకుని ఉన్నాయి.

చేతిలో కర్ర తాటించుకుంటూ అతనురోడ్డు దాటడానికి ప్రయత్నిస్తున్నాడు. మధ్యాహ్న మార్తాండుడు చంద్రనిప్పులు చెరుగుతూ తన ప్రతాపాన్ని చాటుకుంటున్నాడు.

ఆ ముసలి బిచ్చగాడికి దాహంతో నోరు పిడచ కట్టుకునిపోతోంది. అడుగులు పడటం లేదు. అయినా తన ప్రయత్నంమాత్రం మానలేదు పట్టువదలని విక్రమార్కుడిలా.

కాస్సేపు ప్రయత్నించాక ఓ రెండు అడుగులు వేశాడు రోడ్డుమీదకి. కానీ నీరసంవలన, నిస్త్రాణంగా కాళ్ళు లొటలొటలాడి అడ్డంగా పడిపోయాడు రోడ్డుకి.

సడెన్ బ్రేక్‌తో వాహనాలన్నీ ఆగిపోయాయి. రోడ్డున పోయేవారందరూ ఏం జరిగిందోనన్న కుతూహలంతో ఆగి చూడసాగారక్కడ.

"దాహం... దాహం...!" పలవరిస్తున్నట్లుగా కదలసాగాయి ఆ బిచ్చగాడి పెదవులు.

అయినా ముందుకి రాలేదెవరూ. ఆ ముసలాడిచుట్టూ గుమిగూడి ఫ్రీగా సినిమా షూటింగ్ చూస్తున్నట్లు తిలకిస్తున్నారే గానీ ఏ ఒక్కరూ ముందుకొచ్చి అతడిని లేవదీసేందుకు గానీ, ఎండిపోయిన అతని గొంతుకని తడిపేందుకు గానీ ప్రయత్నించడంలేదు.

అలాంటి పరిస్థితిలో అక్కడికోకారు సర్రున వచ్చి ఆగింది.

ఎవరా అని అటు చూశారందరూ.

ఆంధ్రుల ఆరాధ్యదేవత... ప్రముఖ సినీనటి... మృదుల దిగిందా కారులోంచి.

దివినుండి నేలకు దిగిన అప్సరసలా... అందంగా కళ్ళు జిగేల్‌మనేలా అద్భుతంగా ఉందామె.

"ఆవిడేరా... సినీస్టార్ మృదులరోయ్... సూపర్‌స్టార్ మృదుల....!" అంటూ జనం గుసగుసలాడుకోసాగారు.

అందర్నీ దాటుకుంటూ ముందుకొచ్చింది ఆమె.

నేలమీద పడున్న బిచ్చగాడివైపు పరికించి చూసింది ఆమె. ఆమెకళ్ళు అంతులేని జాలితో తొణికిసలాడాయి. చోద్యం చూస్తున్నట్లుగా నిలబడ్డవాళ్ళందరివైపు ఓసారి నిరసనగా చూశాయి ఆమెకళ్లు. తనతోపాటు వచ్చిన అసిస్టెంట్‌తో అందామె,

"కారులోంచి నా వాటర్‌బాటిల్ తీసుకురా...!" అని.

"అమ్మా... ఇతడు కుష్టువాడు...!" అన్నాడు అసిస్టెంట్ సందేహిస్తూ.

"అయితే ఏంటి... ఇతడు ముందర ఒక మనిషి. ఆలస్యం చేయక నేను చెప్పింది చేయి..." ఆర్డర్ జారీ చేసింది మృదుల.

మరేం మాట్లాడకుండా ఆమె చెప్పినట్లు చేశాడతను.

ఆ అసిస్టెంట్ తీసుకొచ్చిన మినరల్‌వాటర్‌ని ఆ ముసలాడిమీద కొద్దిగా చిలకరించింది మృదుల. అతని నుదిటిమీంచి ధారలుగా కారుతున్న చెమటను తన చున్నీతో తుడిచింది. కన్నులు తెరిచి చూశాడు అతను.

బాటిల్‌లోని నీటిని అతనిచేత తాగించింది.

అప్పటికి కొద్దిగా తేరుకున్న ఆ బిచ్చగాడు మెల్లిగా లేచి కూర్చున్నాడు.

"తాతా ఏమీ తినలేదా. అలా పడిపోయావు. ఇంద ఈ రెండొందలు ఉంచు. కడుపునిండా భోంచేసి ఎన్నిరోజులైందో ఏమో... ఏమైనా తిను...!" జాలిగా అంటూ తన పర్సులోంచి రెండు వందనోట్లు తీసి అతని చేతిలో ఉంచింది మృదుల.

"దరమతల్లి... దయగల తల్లి... ఎయ్యేళ్ళు సుకంగా ఉండు తల్లీ...!" అని దీవించాడా వృద్ధుడు.

చుట్టూఉన్న జనం వింతగా, విడ్డూరంగా ఆశ్చర్యపోయి వీక్షిస్తున్నారీ దృశ్యాన్ని. అంత పెద్ద సినీతార అలా కుష్టువాడని కూడా చూడకుండా ఆ ముసలాడికి సేవచేసిన తీరు వాళ్లని విస్మయపరిచింది. అతన్ని అసహ్యించుకోకుండా ఆమె చూపిన కరుణ వాళ్లని కదిలించివేసింది.

అప్పుడు అందామె... "అలా సినిమా చూస్తున్నట్లు చూడకపోతే... ఏ ఒక్కరైనా

ముందుకొచ్చి అతనికి సహాయపడవచ్చు కదా... మీరంతా మనుషులు కారా... మీలో కాస్తంతైనా మానవత్వంలేదా... కుష్ఠురోగు లను చూసి జాలిపడాలేగానీ.... ద్వేషించి, అసహ్యించుకోకూడదు!"

ఆవేశంగా అంటూ కారెక్కింది ఆమె. కారు మెత్తగా దూసుకుపోయిందక్కడనుంచి.

అనేక కరుణరస ప్రధాన పాత్రల్లో, దీను లను ఆదుకునే దయామయిగా చాలా చిత్రాల్లో నటించి జీవించిన ఆమె... ప్రత్య క్షంగా అలా ఒక బడుగు జీవిని ఆదుకున్న వైనం అక్కడ అందరినీ ఆకట్టుకుంది.

తన అసిస్టెంట్‌ని కేకేసి అతనికి అయిదు వేల రూపాయలివ్వమని చెప్పిందామె.

అసిస్టెంట్ ఇచ్చిన డబ్బుని తీసుకుని మృదులకు నమస్కరించి బయటకు నడిచా డావ్యక్తి.

"అమ్మా బేబీ... ఎవరమ్మా అతను... ఎందుకంత డబ్బిచ్చావతనికి?" కుతూహ లంగా ఇదంతా తిలకిస్తున్న మృదుల తల్లి మంగతాయారు అడిగింది ఆసక్తిగా.

"ముసలి కుష్ఠు బిచ్చగాడి పాత్రలో, అద్భు తంగా నటించినందుకు... ఆఁ... ఆఁ... కాదు... జీవించినందుకు అతనికివ్వాల్సిన



పారితోషికం!" నవ్వుతూ చెప్పింది మృదుల.

"నా తల్లే... నా తల్లే...!" అంటూ మృదుల బుగ్గలు పుణికి మెటికలు విరిచింది మంగతాయారు గర్వంగా.

ఇదంతా వింటున్న అసిస్టెంట్ మృదుల తెలివికి ముక్కుమీద వేలేసుకున్నాడు. సిని మాలు తగ్గుతున్న తరుణంలో అందరి దృష్టిని తెలివిగా తనవైపు మళ్ళించుకున్న ఆమె ప్రయత్నానికి జేజేలు అర్పించాడతడు మనసులోనే.

"సినిమాలలోనే కాదు... నిజజీవితంలో కూడా మృదుల హీరోయినే..."

"కుష్ఠు బిచ్చగాడిని ఆదుకుని... పెద్దమనసు చూపించిన ప్రముఖనటిమృదుల...!"

"అన్నార్తులను ఆదుకునే అన్నపూర్ణ... ప్రఖ్యాతనటి మృదుల..."

వివిధ పత్రికలలో మరునాడు ప్రము ఖంగా ప్రచురితమైన ఆ హెడ్‌లైన్స్‌ని చూసి చిద్విలాసంగా మృదుమందహాసం చిందిం చింది మృదుల.

ఇంతలో అక్కడికి ఓ వ్యక్తి వచ్చాడు.

–కె.కె.భాగ్యశ్రీ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942. Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

